# విషయానుక్రమణిక

## జూన్ 1963

# ఆ ట వె ల ది



శ్రీ బాలగంగాధర తిలక్

## వే స వి :

వాలుజడలమల్లె పూల తురిమి రేల
          వీథి వీథి తావి విందులొసగి
రామ నవమినాడు రామాభిరామమౌ
          తెలుగు చైత్రమెదల నిలచు నెపుడు.

చందనాది లేప చారు చర్చిత గాత్ర
          కించి దుత్థ ఘర్మ వంచిత సుఖ
సుప్తి హీన సతుల చురచుర కవ్వించు
          గ్రీష్మ వాస రోష్మ కేను దెలతు.

ఉత్సహింప కాంతు ఉడిగింప పెను వేడి
          కలసి నంతలోన అలసి విడెడి
వింత కౌగలింత లింతింత కసి కాటు
          లంద గించు తరుణు లందు నెందు.

## వెన్నెల రేయి :

ఆకసమ్ము మీద ఆనంద మహదుత్స
          వమ్ము నేటి రేయి రమ్ము చెలియ
కోటి తారలెల్ల గువ్వ కోల్గొన్నవి
          తరుణ చంద్రు చుట్టి మురులు ముట్టి

వెండి వాన కురిసి వెల్లువై పొంగెనో
          పూల జగము విరుగ బూసెనేమొ
త్రిదశ భామ లొక్క తెర నవ్విన యట్లు
          వెలది వెన్నె లలమె విశ్వమెల్ల.

శారద

వెన్నెలందు తడిసి వింతగా కనురెప్ప
లించుకొని నన్ను కాంచు మతివ
నీదు కన్నులిపుడు నిష్పంద చంద్రికా
ధవళ ధవళ రాగ కవన మల్లె.

హార శిరస్తటమున హరువైన వెన్నెల
ఒలికి పార గిరిజ కలువ యయ్యె
శివ విసరిన చూపు చెలువమ్ము సామేన
నిగుడ శివుడు నీలి నింగి యయ్యె.

పడుచు:

పూల తోట సిగను మొలిపించు కొన్నావ
పడుచ! యెదదలోన పట్టి నట్టి
కోర్కె లేమి వెనుక కొప్పులో దాచితో
మధుప మూర్తి యెవడె సుధల గ్రోల.

సవిధ సౌధ మెక్కి వివిధ దిశల నొత్తి
చూపు లేల పరతు సుందరాంగి
పట్ట పగలె యిరులు పరిఢవిల్ల జగతి
పల్లవుండు వాడు తల్ల డిల్లు.



## అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము:

# శ్రీ కృష్ణశాస్త్రి



డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

**8**

కృష్ణశాస్త్రిగారి రచన వెంకటపార్వతీశ్వరుల రచనల వల్లా, సమకాలిక పరిస్థితులవల్లా ప్రభావితమైంది. వెంకట పార్వతీశ్వరులు ఆలోచన నుంచి ఆవేశములోనికి కొంత కొంత ప్రవేశించారూ, వీరు ఆవేశమునుంచి ఆలోచనలలోనికి తొంగి చూస్తారు. వారు ప్రాచీన సంప్రదాయానుసారులు, వీరు తిరుగుబాటుదారులు. కనుక వారి ఆమ్రేడిత కవిత్వాన్ని శబ్ద వాచ్యతనూ వీరు శ్రవణ సుఖానికి లోభించి కొంత అనుక రించినా వాటినే చిరకాలముపట్టి మనలను పట్టార్చలేదు. (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చేశారు ఆ పని.)

కృష్ణశాస్త్రిగారి రచనలమీద రెండో ప్రభావము స్వేచ్ఛది. ఆంగ్ల కవులు షెల్లీ వంటివారి కవన పఠనమూ, జెసెంటమ్మా మహాత్ముడూ వెలిగించిన స్వాతంత్ర్యజ్యోతీ వీరిలో రెండు మూడు స్వేచ్ఛలను రేకెత్తించింది. మొదటిది 'నా సంగతే వేరు' అన్న ఆత్మ విశ్వాసము. 'ఎవ్వరని యెంతురో నన్ను, ఏనవంత శోక భీకర తిమిర లోకైక పతిని' అన్నారు. సామాన్య మానవులు బలహీనతనుగా విశ్వసించే కన్నీటిని వీరు 'అపూర్వ మత్యంత మానంద మొసగు నిరుపమ నితాంత దుఃఖంపు నిధు' లంటారు. 'మీరు మనసారగా నేడ్వనీరు నన్ను' అంటారు. ఈ వింత ఏమిటి ? అని ఆలోచిస్తే నాకు ఒక సమాధానము తట్టుతున్నది. చిత్తగించండి మనవిచేస్తాను.

కృష్ణశాస్త్రిగారు భక్తులు, అనేక భక్తి కీర్తనలు రచించారు. అనుతాపమూ, ప్రపత్తి భక్తికి అంగములు. 'ఎట్లు ని న్నూహసేయుటో యెరుగలేక వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు' నంటారు. 'తారకారత్న భాసుర తారహార సుప్రభామాలికాజాల శోభితుడవు .... వీథి వీథుల వాడల విపినము లను భిక్షుకునిబోలె తిరుగాడు పేదనోయి' అంటారు. 'ఏది నీకిత్తునందు నా హృదయనాథ కాన్కగానే మొసంగగా గలను నీకు .... వలపూర కరవుదీర గాటమగు వేడి కన్నీటి చుక్క దక్క కాన్కగానే మొసంగగా గలను నీకు' అంటారు. 'కురి యుమురా కన్నీటిని మరి మరి విలపింపుమురా, సరము గూర్చి పరమేశుడె దాల్చును రా పాపీ' అన్నారు. పరమేశ్వరుని యెదుట వినయముతో, ప్రపత్తితో కన్నీరు కార్చుట గంగాస్నానము వంటిదే. ఈ 'కన్నీరు' కృష్ణశాస్త్రిగారి కావ్యమంజరి కొక దానికి శీర్షకే అయినది. కృష్ణశాస్త్రి గారికే కాక వారు నిర్మించిన పాత్రలకు కూడా ఈ కన్నీరు జీవము. పెరి యాళ్వారు 'తీరా నీ వేతెంచిన, ధారలైన అశ్రులని రూపు తోచదేమి స్వామీ' అంటారు. గోదాదేవి వారి గని నంతనే బాష్ప వారి క్రమ్మె' నంటుందీ, రంగదేవుని కన్నులు చూసిన ధనుర్దాసు 'ఏడుస్తాడు', రాధ 'అలరు పన్నీరో నా చలువ కన్నీరు నీ తలిరు పాదములకై కృష్ణా' అంటుంది. కనుక కృష్ణ శాస్త్రిగారికి కన్నీరు పూజాద్రవ్యముగ... విధి బలీయమై 'ప్రేయసి' 'సడిలేని నడిరేయి బడిపోయి' నది. ఆమెకొరకు పడిన నిర్వేద నౌకకు ఆయన కన్నీరే నదియైనది. పూర్ణ రాగ కవిత ప్రియురాలు కోసము అనుభవించిన దుఃఖమే ఆమెకూ కవికీ ఏకైక శేషబంధమైనది. ఈ బంధమును—అనగా తన దుఃఖమును—వీడుట కీయనకు ఇష్టము కాలేదు. కనుక ఈయన 'నాకు మరణమ్మె వలదనినాను' అన్నారూ, దుఃఖమునూ కన్నీటినీ కౌగిలించుకున్నారు. "నన్ను గనియేరు జాలి జెందంగవల' దన్నారు. 'నా విలాప నిబిడ గీతికావళీ నిస్స్వనమ్మె నర్ధరాత్ర గర్భమ్మె మరియు మరియు భీషణ కాళిమో న్మత్తగాగ జేయుతరి నన్ను మీరు వీక్షింపలేదా ?' అని సవాలు చేస్తున్నారు ! తన దఃఖముతో తనకు గల బంధముమీది మమతతో, ఈ సవాలు తన దుఃఖాన్నంతటినీ—తానే చూచి దాని భీషణ కాళిమను మెచ్చుకునే—నటననుగా అన్వ యిస్తున్నదైనా చూనుకోలేదు ఈయన. 'నా సంగతే వేరు' అన్న ఆత్మ విశ్వాసమే 'నా దుఃఖము కూడా వీక్షనార్హమే, నాకు కన్నీటి సరుల దొంతరలూ నిశ్శ్వసతాళ వృంతాలూ' ఉన్నాయి. 'నన్ను గనియేరు జాలి జెందగ వలదు' అన్న ఆద లింపులకు కూడా దారి తీసింది.

వీరిలోని రెండో స్వేచ్ఛ సాంఘిక సారస్వత రాజకీయ సంస్కారములు కోరే స్వేచ్ఛ. మానవుడన్న వాణ్ణి ఇంకొక మానవుడు ముట్టరాదనుట చైతన్యానికి అవమానమనీ పర ప్రభుత్వానికి భృత్యులై వూరేగే అధికారుల ధాష్ట్రికము నీచ మనీ, సంప్రదాయ శృంఖలాలు మోస్తూనే రచించడము కృత కమూ నికృష్టమూ అనీ ఘోషించా రీయన. పతితుల మహా ప్రస్థానముతో చేరి 'కదలి నడువగలము మేము మడమ త్రిప్పి రాము మేము' అన్నారూ, 'జిలుగు వసనాల మణిమ యోజ్జ్వల మనోజ్ఞ కాంచ నాంచిత భూషణ గణము బూని రాజ వీథుల రతనాల రథము నెక్కి' వూరేగే ఉద్యోగి దివాంధాన్ని

తిట్టారూ, రాయి అప్పయు కంఠస్వరంబు దాల్చి గానముచేసే నవోదయ కాలంలో 'పికమ పాడకుము' ని శపించిన ఆచారానుసారి ఛాందసాన్ని నిరసించారు. మాత్రాచ్ఛందస్సులూ పద్యచ్ఛందస్సులూ యదేచ్ఛంగా వాడుకున్నారూ పద్యములో భావము ఎక్కడ పూర్తి అయిపోతే అక్కడ ఆపేశారు రచన. పెద్ద పుటలో ఒక్క పద్యము వేసి దాన్ని తేల్చి చూపించారూ ఖండ కావ్యాలకు శీర్షక ఇవ్వకుండా చుక్కలు పెట్టారు. (శుష్కాచారాభిమానులు ఇంత మాత్రానికే అల్లరి చేశారు.) తరువాతి దశలలో 'స్వాతంత్ర్య రథము' వంటి నాటికలూ ప్రగతిశీలములగు రాజకీయ తత్వ సూచకములుగా 'ప్రాభాత ప్రాంగణాన మ్రోగెను నగారా' 'ఆకాశము నొసట పొడిచె నరుణారుణ తార' అన్న గేయాలూ రచించారు. అయితే వీరి ఈ స్వేచ్ఛ వీరి రచనలలోనూ, చర్యలలోనూ గౌణాతి గౌణముగానే ఉండిపోయింది.

వీరి మూఢోస్వేచ్ఛ స్వేచ్ఛా ప్రేమగా పొడచూపింది. ఆధునిక కవిత్వ ప్రారంభంనించీ ప్రబంధ శృంగారాన్ని సమర్థించడానికీ శృంగారాన్ని ఉపాదేయంగా నిరూపించడానికీ గురజాడ అవ్యాజప్రేమనీ, రాయప్రోలు అప్రాప్త ప్రేమ, అపరిణత ప్రేమ, విశ్వప్రేమల్నీ, అబ్బూరి పూర్వప్రేమ, వృత్తప్రేమ, క్షణిక ప్రేమ, దాంపత్య ప్రేమలనూ, దువ్వూరి నైసర్గిక ప్రేమనూ, అధికార్లూ, బసవరాజూ, నండూరీ దాంపత్య ప్రేమనూ చిత్రించి శారీరకాకర్షణపైన మొలిచే సర్వ సాధారణ 'ప్రేమను' వెనక్కి నెట్టారు. ఈ ప్రేమను—ఇది నైసర్గికమన్న కారణాన్ని పట్టుకుని పెద్దజేసి—'అలరు పడంతి చక్కిలిగింత వెట్టి విరిచేడె పులకింప సరసను బాడి, మరియొక్క నవతోడ మంతనం బాడి వేరొక్క సుమకాంత వ్రీడ బోగొట్టి తిరిగే తేటి 'వలపు' ను ప్రపంచించి, 'సౌరభములేల జిమ్ము పుష్పవ్రజంబు ? చంద్రికల నేల వెదజల్లు చందమామ ? ఏల సలిలంబు పాఱు, గాడ్పేల విసరు, నేల నా హృదయంబు ప్రేమించు నిన్ను' అన్న వశీకరణ మంత్రాలతో, 'ఏటి పని యిది లోకమా హృదయదళన దారుణ మహోగ్ర కార్యంబు దలచినావు, ప్రణయ మధురిమ మెలుగవు పాప మనవు, పక్షముల దూల్చి బంధింతు పంజరాన' అన్న హెూదా ఉపన్యాసాలతో, 'హృదయ వనజాత సుమ మృదు మనోహరదళము లదయతను ద్రుంచి వారె పెంధూళి చిదిమి వెదజల్లినారె' అన్న ఆక్రోశ నటనలతో ఒక్క ఖండములో కాకపోయినా, 'అన్వేషణము, ఏల ప్రేమింతును, అయ్యో, లోకము, శాపము, అబ్బ' అన్న ఖండాలలో స్వేచ్ఛాప్రేమనుగా దిద్ది తీర్చారు కృష్ణశాస్త్రిగారు. తిరిగి తిరిగి, లాలసను వర్ణిస్తున్నారని తెలుగు ప్రబంధాలను నిషేధించే తొలినాటి ఉద్యమానికి బలము చేకూరే ఘట్టానికి వచ్చాయి ఈ రచనలు. అయితే వాటిల్లోది దాంపత్య శృంగారము, గురజాడవారు 'మాట మంతి' లో అన్నట్టుగా నిరపాయకరము. ఈ స్వేచ్ఛా ప్రేమ పారదారికము, సంఘ శాంతికి ధూమకేతువు !

కవిత్వానికి నీతితో పనిలేదనీ, ఆర్ద్ర భావాలతో అందాలతో నిండిన రచన ఏదయినా గ్రహణయోగ్యమే ననీ ఒక వాదము బయలుదేరిందా రోజుల్లో. నిజమే. నీతిని బోధించడము కాదు కవిత్వానికి పని, నీతి శతకాల్ని కవిత్వముగా జమ కట్టలేము. అయితే, నీతితో పనిలేదు అన్న మాటలకు అర్థము 'అవినీతినైనా పట్టి చూపించు' అని కాదు. కావ్య సాహిత్యమనేది కథనకావ్యములు భావ్యకావ్యములు అన్న రెండుభాగాలుగా కనపడుతుంది. కథన కావ్యాలు మానవుని కథను వర్ణిస్తూ, చదువరుల మానవత్వానికి అపేక్ష కలిగిస్తూ లాగి, ఆ కథవల్ల ధ్వనించే సత్యాన్ని చదువరులకు కాంతాసమ్మితంగా వారికి తెలియకుండానే బోధ చేస్తాయి. ఈ కథనములో మంచీ చెడ్డా అందమూ అసహ్యతా వంటి ద్వంద్వాలు దేనికది మోతాదు బరువు కాకుండా ఉంటాయి. ఎక్కడేనా ఒక భాగము అనవసరముగా పొడుగైతే రసాభాసము అయిందంటారు రసికులు. మొత్తపు కథ పెద్దదైతే దాని మొత్తపు ప్రభావములో ఈ చిన్న రసాభాస ఘట్టము తలయెత్తి నిలవక మునిగిపోతుంది. ఈ కథను మాత్రము పెంచి చిన్న ప్రబంధంగా రచిస్తే తారాశశాంకమూ అహల్యా సంక్రందనమూ లాగ తయారై అవినీతి బోధకము అవుతుంది. అలాంటివి రచించడమా కవి చేయవలసిన కార్యము ? .... భావ కావ్యాలలో కూడా చదువరిని నిండు మానవునిగా తీర్చడానికి సాయపడే భావాల్ని తీర్చి ఇస్తే చదువరికి క్రొత్త అనుభవమూ, వికాసమూ కలుగుతుంది. ఈ భావాలలో నీతి ఉండనక్కరలేదు, క్రొత్త అనుభవముంటే చాలు. వర్డ్స్‌వర్త్ చిన్న కావ్యాలూ కీట్సు ఖండ కావ్యాలూ సాధిస్తాయి ఈ ఆశయాన్ని. ఏ సైతాను ఉపన్యాసాన్ని మాత్రమో రచించి వూరుకుని కవితకు నీతితో పని లేదంటే ? తిక్కనగారు కీచకుని అధర్మ విరహాన్ని మూడు మారులు వర్ణించారు. వాల్మీకి రావణాసురుని సీతా విరహాన్ని ఒక్కమారైనా వర్ణించడు. చదువరికి కీచకుని అధర్మ మోహముపై సానుభూతి కలుగవచ్చునా ? అని అడిగేరు ఉమాకాన్తముగారు ! నీతితో పనిలేదు గాని ! చదువరుల్ని షాక్ చేసే సంఘ విరోధి కళాభాయి రచనలకు పని ఉన్నదా కవితలో ? అయితే రక్షించి ఈ స్వేచ్ఛా ప్రేమవాదుల స్వార్థమూ లాలసా పద్యాలలో నుంచి తప్పుకుని గుడిపాటివారి వచన రచనలలోనికి వెళ్లిపోయినాయి ఇటు తర్వాత.

కృష్ణశాస్త్రిగారి రచనలకు ఆవేశము ప్రాణమూ శక్తీని. ఈ ఆవేశము ఎన్ని అవతారాలో ఎత్తుతుంది. ఆవేశము కవిని ఆవరించినప్పుడు ఒక్క ఉదాహరణ నిచ్చి సంతుష్టిపడలేడు కవి. 'ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగనపథ విహార విహంగమపతిని నేను, మోహన నవీల జలధరమూర్తి నేను, ప్రళయ ఝంఝూ ప్రభంజనస్వామి నేను' అని ఉదాహరణల విసురుతాడు. ఇది నితాంత తమిస్రకాంత, మిది దరిద్ర, మీ నిశాంతమ్ము శూన్యమని ఛాయమీద ఛాయ నెక్కిస్తాడు. శర్వరీ శీతపవన పక్షముల మలసి, స్వాదు యమునోర్మి సంగీత ఝరుల

# శ్రీ కృష్ణశాస్త్రి

గలసి కౌముదీ ధౌత శుభ్రదిక్తటుల పొలసి మురళికా మాధురుల రుచులు దాటి దాటి వచ్చిన వంటాడు. 'చిఱుత తొలకరి వానగా చిన్ని సొనగ బొంగి పొరలెడు కాల్వగా నింగి కెగయు కడలిగా పిల్లగ్రోవిని వెడలు వింత తీయదనముల లీనమై పోయె నెడదని జల్లులతో ముట్టడిస్తాడు. 'ఇచటనే—యిచటనే—యిత—డిచట నేను—ఇచట నీ జాజిపూ బొదరింట నేను అతండు కన్నుల గట్టిన సరణి దోచు' నని మళ్లీ మళ్లీ విసురుతాడు.

''నాకు గాదులు లేవు, నాకు షస్పులు లేవు, నేను హేమంత కృష్ణానంత శర్వరిని, నాకు కాలమొక్కటే కారు రూపు, నా శోకమ్మె వలెనె నా బ్రదుకు వలెనె, నా వలెనె'' అంటా రీయన. ఇంత చిన్న ఆవరణలో నింత భావావేశము గల పంక్తులు వే నిప్పటికి ఎఱుగను. అభిప్రాయాలుగానూ, వూహలుగానూ కవులు సామాన్యంగా ఇచ్చే వస్తువు ఆవేశము చేరడముతో భావాలుగా వస్తుంది. ''ఇది ఎంతో, బాగున్నది'' లన్నప్పుడు కంటె 'ఇది ఎంత బాగుందో' అంటే మనము ఎక్కువ అనుభవిస్తాము. ''కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మారె వ్యర్థపుంజాతురి హెచ్చె నల్పమగు సాహితితో పెద పెద్ద పొత్తముల్ జాతురు తప్పు దిద్దుదురు శూరత సచ్చె కవీంద్రు లందు, సీ ! మూతులు గట్టవై చికొన బోలదె సత్కవులైన వారికిన్'' అన్న ఊహలు ''ఇపుడు ప్రళయమ్ము క్రమ్మిన దేమొ కాక దొరకదో నిల్వ నీడగా చిఱుతపాట కింత యురుకొనె యుమ్మహోనంత విశ్వ మలమికొను చీకటుల కలకలము వలన'' అని శక్తివంతమైన భావాలుగా వస్తాయి వీరినుంచి. దువ్వూరి రామిరెడ్డి ''సాంధ్యకిమ్మీరవర్ణ వస్త్రములు దాల్చి, గిరితట విహార శృంగారకేళి సొలసి రమణ జరియించు జలధ రార్భకుని గాగనేల సృజియింపడో నన్ను నీశ్వరుండు'' అని ఆశను వివరిస్తే, విశ్వనాథవారు ''ముదురాకు రాలేటి ముదిమి నాళులలోన, తొడిగేటి చివురాకు తొగరు సంజ లోన, ఆకునై నా కానుగా, అయినచో, సోకేది చిఱుగాలి నన్ను మెల్ల, తాకేది మిణుగురుల హొన్ను'' అని ఆశకు కారణము కూడా చెప్పారు, కృష్ణశాస్త్రిగారు ''గలగలని వీచు చిఱుగాలిలో గెరటమై, జలజలని పాఱు సెలపాటలో దేటనై, ఈ యడవి దాటిపోనా, ఎట్లయిన నిచటనే యాగిపోనా'' అనేశారు కారణాలే చెప్పకుండా. విశ్వనాథవారి కృష్ణుడు విరహవ్యగ్రయైన రాధ చింతా సౌధానికేగి ''రాధా'' అన్నాడుట. కృష్ణశాస్త్రిగారి ఊర్వశి ''పడికి రేయి వెన్నెల యెద చరించు పిలుపెగా 'నా సఖా' యని వేగిరి'' స్తుంది. కృష్ణశాస్త్రిగారి భావాలు వెన్నెల యెద చరింపజేసేట్లుగా వస్తాయి.

వారి భాష కూడా తీర్చిదిద్దినట్టిది. చిన్నతనములో వారి తండ్రీ పెదతండ్రీ—మహా పండితులు—రెండు మూడు రచనల్ని చూపించి 'ఏది బాగుందిరా నాన్నా' అని అడిగేవారట. అలాంటి శిక్షణవల్ల ఈయన కలవడినది నదీప్రవాహ సదృశమైన శైలీ శక్తివంతమైన ఎంపికాను. (తలిరాకు జొంపముల సందుల త్రోవలు, (కాఱు మొయిళ్ల) కాటుక పొగలు, ఏ త్రోవరుల్ త్రొక్కని దారులు, కనపడని చేయి, వేయబోని తలుపు, మొదలోపలి యెద, మూయని వాకిలి, తిగువని వింటివాడు, వంటి శక్తివంతమైన నవ్య నిర్మాణాలు ఇంకొకరెవరూ చేసినట్లు కానరాదు. 'వికృత క్రూర క్షుధాక్షుభిత మృత్యు కఠోర విగత పాండుర శుష్క వదన దంష్ట్రాగ్ని' అని సంస్కృతమూ, 'మ్రోగు పాటల పేటినా గళమ్ము వలె తీయ తీయ నైనది పులుగు తెరవ గూడు' అని తెలుగూ, 'ఏలా వచ్చె హవాహుమాయి పయి వాడే కుచ్చు పాగాల షోకేలా, పచ్చ జరీ బుటా మొఖ మలంగీ దాల్చి చైత్రుండు కెం, గేలన్ సోగ గులాబి కొమ్మ కొరడా కీలించి సారా నెరా, ప్యాలా సారెకు సారెకున్ పెదవులన్ పట్టించుచున్ నవ్వుచున్' అని ఖయామూ తెలుగూ, వైష్ణవుల లరవ తెలుగూ అందముగా వాడగలరు కృష్ణశాస్త్రిగారూ, 'ఆషాఢ యోషామణీ కేశపాశాన అల్లుకొన్నది తటిద్వల్లియో' అనీ, 'తరుణతమాల కిసాల సమాన, శ్యామల కోమల చారు శరీరా' అనీ 'మసృణ కుసుమ హృద్గళన్మరంద స్నపితచరణ యుగళా వసంతా' అనీ ఇక్షుఖండ సదృశ రచనా చేస్తారు. నాకు వచ్చిన అసంతృప్తల్లా, వారు తేనె బిందువుల్ని చిలికే శ్రద్ధను పెంచి తేనె పెఱలాంటి ఖండకావ్యాల్ని నటరాజ, ఆకులో ఆకునై, నీలాభ్ర సరసిలో, దారులన్నియు మోపె వంటివే ఎందుకు చేయరూ అని. తెలుగు ప్రబంధాలు అందపు టూహల్ని సుందర భావాల్ని కాలిబాట లాగ తీర్చి చదువరిని లాగక, ఎక్కడి కక్కడ ఇతర ఊహలతో దట్టించి పటిచేసి, కవిగారు చాప వేసుకుని కూర్చుని గోష్ఠి నడుపుతాన్నట్టు తయారు చేశాయి. ఆంగ్ల కవులు—కీట్సు, బైరను టెనిసన్నూ వంటివారు—పూలదారుల్లాగ తయారు చేశారు తమ ఖండకావ్యాల్ని. వాటిని చూచి కూడా మనవారు చెఱకు గడల్లాగ ఎందుకు నిర్మించరూ ? కలకండ ముక్కలు జల్లుతూ సంతుష్టి పడిపోతారేమీ ?

కవిత్వము చదువరికి ఇంద్రియ గోచరము కావాలి. అప్పుడు కవి వర్ణించిన ప్రకృతి చదువరికి గోచరించడమూ తద్ద్వారా చదువరికి అనుభవము కలగడమూ జరుగుతుంది. కవి భావాల్నే వెలిబుచ్చినప్పుడు ఆ భావాలు మహా పండితుడైన కవికే గాని సామాన్య చదువరిని జల్లు మనిపించేవి కాకపోతే కవి మానాన్న కవి రచించుకుంటూ పోవడమే మిగుల్తుంది కాని చదువరిని అంటదు. వర్ణనకు ఈ చిక్కు లేదు. తనకు ఆవేశ కారణమైన ప్రకృతి చైతన్యాన్ని కవి వర్ణించి విడిచినా, ఎంతో కొంత ఉద్రిక్తత చదువరికీ కలుగుతుంది. అయితే ఈ వర్ణిత వస్తువు చదువరికి ఎంత చక్కగా కనబడితే అంత ఎక్కువగా అది అతణ్ణి స్పందింపజేస్తుంది. కనుకనే అన్నాను కవిత్వానికి ఇంద్రియ గోచరమయ్యే గుణము ఉండాలని. కృష్ణశాస్త్రిగారి రచనకు ఈ గుణము బాగా ఉంది. 'గలగలని వీచు చిఱుగాలి', 'తలిరాకు జొంపముల సందుల త్రోవల నేలవాలు తుహిన కిరణ కోమలరేఖ', 'చంద్రాత పాంతరాళ రజత తల్పము' ''బృందావన వీథులందు యమునా నవభంగ మృదంగ వాద్యములు' 'నీలాభ్ర

సరసిలో రాయంచవలె విహారము చేసే జాబిల్లి, యమునోర్మి సంగీత ఝరుల గలసి వినిపించే మురళీ వినాదమూ, కనులలో మిల మిల నిలిచే బాష్ప పశోక్తికమూ' చక్కగా గోచరిస్తాయి.

కీట్సు కవి 'చెవి సోకిన గీతములు మధురములే అయితే, చెవికి సోకగరాని గీతములు మధురాతి మధురము'' అన్నాడు. కృష్ణశాస్త్రిగారు 'శర్వరీ శీత పవన పక్షముల మలసి, కౌముదీ ధౌత శుభ్ర దిక్తటుల సోలసి'న మురళీనాదాన్ని మాత్రమే కాక 'కనుచూపుదాటు నామని బాయు కోయిల గొంతులో చిక్కు వసంత గీతి' నీ, 'విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడగిన కడలి మ్రోత' నీ, చెవికి సోకించకుండానే వినిపించారు. దిశ దిశాంతగత శకుంత దివ్యగానమును విని వినిపించిన ధన్యత వీరిదే. ఒక అనుభవముయొక్క స్మృతిని ఉపయోగించుకొని ఆ అనుభవాన్ని చదువరులలో రేపడము చక్కని నేర్పు. ప్రకృతికి చైతన్యాలూ, భావాలూ ఆరోపించి వర్ణించడమూ నేర్పే. ఈ భావాల వల్ల ప్రకృతి చిత్రము సాంద్రమై కంటికి కట్టడమూ, ఈ భావాల అనుభవము ఆ ప్రకృతి దర్శనానుభవానికి తోడ్పడడమూ జరుగుతుంది. 'వరిపంటి విరిచేడె చిన్నారి సిగ్గు' అని విన్నప్పుడు, మనము గుర్తించని వరి మొక్క వంపును చిన్నారి సిగ్గు అన్నమాట అవకుంఠనము తీసి చూపిస్తుంది. గాలి, ''ఇంత చిఱుగీతి యెద వేగిరించెనేని పాడుకొమనటూ, తాండవ నృత్య మాడుకొనునట ! అతడు, 'పాట పదములకై నిత్య పథికు డయ్యెనట. నవమల్లికానతి హిమాంబువులలో జలక మాడిం' దట. 'తొలి ప్రొద్దు తెమ్మెర త్రోవలో బయనమై' పరువెత్తినదట కోయిల పాట. 'మొండి చేతుల నెత్తి' 'వనతరుల్ శూన్య దృక్కుల దిశలు చూచు' నట. ప్రాయంపు వంశి 'మరియు పవను కౌగిలిలోనె పులకరించి హాయిగా గంతమెత్తునట. 'ప్రావృడంబోధర స్వామి జీవనంపు భారము తొలంగిపోవ .... తన సొదలు చెప్పుకుంటూ 'గొణుగు' కుంటాడట. 'ఎంతొ దాహమ్ము గొన్న శ్రవణముల విచ్చి గీతరవము కొరకు వెదకునట. గాలి 'మృదు వసనాంచలముల గుసగుసలు' 'చరణ మంజీరము కొసరు జాలి పలుకరింతలు' విన రాలేదుట. మూగవోయిన (నా) గళమ్మునను గూడ నిదురవోయిన సెలయేటి రొదలు కలవట. 'నీప పాదప శాఖికాగ్ర పత్ర కుటీర మార్గాలలో ఇరులు గుసగుస లాడు' నట. 'రాగాంశు మాలికా కాంతి నాట్యాలు సలుపునట. అమృతగళరవమ్మునకు రెక్కలు విరిసిపోతున్నవట. చలువ తెమ్మెర జాణ చలచిత్తుడట. ప్రకృతికి మానవ చైతన్యము నలవరిచే దృష్టి రవీంద్రుని వర్ణనలకు జీవము. తెలుగు కవులకు కొంచెమే పట్టుబడినా కృష్ణశాస్త్రిగారికే పట్టుబడింది ఎక్కువగా ఆ దృష్టి. దీనిని సాధించే యత్నములో వీరి వర్ణన పలుచోట్ల మన అనుభవశక్తిని దాటిపోవడమూ కద్దు— ప్రబంధ కవుల ఉత్ప్రేక్షలవలె. 'పాడుచు చిన్కునై పడి పోదు నిలకు' 'చరణ కరుణా మధుకణము' సుధ హారము ఊహలోనికి వెళ్లిపోయింది అలంకారము. 'గాలి నీలాలపాట' గాలి నీలమా? తల నీలాలు ఎఱుగుదుము, గాలి నీలా లేమిటో! వడక వెఱుగని తేనె' 'పాట రెక్కల రొద' ఎక్కడికో వెళ్లిపోతాయి.

కృష్ణశాస్త్రిగారి రచనలో కొన్ని చిత్ర విచిత్రా లున్నాయి. ఒక ఇంద్రియాన్ని పలకరించడముతో తృప్తిపొందక, వీరి కవిత్వము రెండు మూ డింద్రియాల్ని లేవగొట్టుతూ ఉంటుంది. ''ఈ నిశాంతమ్ము శూన్య, మిం దెన్నడో రహశ్శిథిల సుప్తిగలవరపంది లేచి గుబులుకొను లేత నెత్తావి గుసగుస లెవో'' ''తేనె తేట చినుకేని లేని యీ పాట'' ''నీ వెలుగు చూపొక రేయి వికసించి వాసించి మిలమిలా తళతళా మెరసినది కురిసినది.'' ''హాలాహలాంధకారానల జ్వాల'' ''కరుణార్ద్ర వీక్షణ పరిమళములు'' ! ఇవి కవి చదువరుల రుచితో, చైతన్యంతో, చేసే ప్రయోగాలు. పోయినవి పోతాయి, కదిపినవి నిలుస్తాయి. అమృతగాన శీతల తుషారములు, పలుకుదేనెలా, నవ్వుతావులూ సుగమములే. హాలాహల అనల అంధకార జ్వాల ! వెంటబెట్టి వెతకాలి ఇదేమిటో. విశ్వవీణ అనే ఉత్ప్రేక్షా ఇలాటిదే. దశదిశాతంత్రులు (దశతంత్రుల వీణట!) ఒక్క మధ్యశ్రుతిని బెనంగుటూ, చుక్కలు మెట్లగుటూ, వింతలలో వింత. 'వీణ' అన్నమాట ముందు అనేసి సర్దుకోవడము ప్రారంభిస్తే అలంకారము ఇలాగే తయారౌతుంది. పిలుపు అనలమై విశ్వాన్ని కాల్చడమూ ఇలాటిదే. కృష్ణపక్షమూ, ప్రవాసమూ ఊర్వశీ చదువుతూ రాగారాగా రచన మంచులాగ అదృశ్యమౌతూ ''యేలా యెటకో యెటకో జలదాల దాటి తారకల విశాల వీలపథ రాజాలనెల్ల నతిక్రమించిపోయి కరియు సొలిసొలి చదలేటి తుషారపు స్వప్నర్గాసులన్.'' పారలే కాలువలు, వంపు తడి, విషాద సుఖము అన్నవి సామాన్యుల అనుభవానికి దూరము. మొయిళ్ల కాటుక పొగలు, ఉడుమణి విషాదపూరిత ద్యుతులూ కూడా ఊహాసాధాలే.

''మీ మీ అనుభవాల్నిబట్టి రచించండ' ని శివశంకరశాస్త్రి (ఇప్పుడు స్వామి)గారు చేసిన ఆదేశాన్ని కృష్ణశాస్త్రిగారు మితిమీరి పాలించారనిపిస్తుంది ఆయన కొన్ని రచనల్ని పరిశీలిస్తే. అనుభవాన్ని బట్టి రచించమంటే ఈయన అనుభవాల్నే రచించారు. కవి అనుభవాలు కవిత్వము కాదు, చదువరికి అనుభవాలు కలిగించే రచన కవిత్వము. తా నూహించిన, లేదా అనుభవించిన, ఆనందాన్ని చదువరులకు కూడా కలిగించే ఉద్దేశంతో కవి రచన చేస్తాడు. వ్రాస్తున్నప్పుడు కవిగా వ్రాస్తాడూ, పాఠకుడుగా చదివి బాగున్నదా లేదా చూసుకుంటాడు కవి. ఒక మాట మారుస్తాడు, ఇంకొక మాటకు చోటు మారుస్తాడూ మళ్లీ చదువుతాడూ సంతుష్టిగా ఉంటే ముందు పద్యం రచించడానికి ఉపక్రమిస్తాడు. కవిలో రచయితా ఉన్నాడూ, చదువరీ—అనగా రసికుడూ—ఉన్నాడు. కవిగా రచిస్తూ రసికుడుగా ఆ రచన అనుభవాన్ని రేపుతున్నదా లేదా అని చూసుకుంటూ చేస్తాడు రచన. అనగా తనవంటి రసికులకు శక్తివంతంగా తాకి అనుభవాన్ని కలిగించేదిగా తయారుచేస్తాడు రచనని. నేను నా కోసమే రాసుకున్నాననే కవి చెప్పేది నిజము

కాదు. రచించేటప్పుడు కవి తన కెదురుగా పాఠకు డున్నాడని ఊహించి రచన చెయ్యడు కనుక పాఠకుని కోసము అతడు రచించటలేదనడము వట్టి అపోహ. మీరు మిమ్మల్ని అద్దంలో చూసుకుంటూ అలంకరించుకుంటున్నారంటే మీరు ఇతరులకు వెకిలిగా కనబడకుండా సర్దుకుంటున్నారనీ, అందంగా కనబడడానికి దిద్దుకుంటున్నారనీ కదా అర్థము ? అదే రీతిగా కావ్యాన్నో, వర్ణచిత్రాన్నో, శిల్పాన్నో నిర్మిస్తూ అడుగడుక్కీ రచన ఎట్లా సాగుతున్నదో చూసుకుంటున్నారంటే ఆ సరిగ్గా ఉన్నదో లేదో చూచే వ్యక్తి ఆమోదము కోసము రచిస్తున్నారన్నమాటే కదా ? ఈ వ్యక్తి సర్వ రసిక లోకానికీ ప్రాతినిధ్యము వహించిన మీ రాసిక్యమే రూపంగా కలవాడు. కనుక రచన ఎట్లా ఉన్నదీ అని చూసుకున్నవాడల్లా రసికలోకానికి ఉద్దేశించి రచించినవాడే అవుతున్నాడు. రచించేవాడల్లా తన రచన తన ఉద్దేశాన్ని కడతేర్చేటట్లు సాగుతున్నదా లేదా అని చూసుకునితీరాలి. ప్రేయసుడూ కవీ తప్పక చూసుకోవాలి. పిచ్చివాడు చూసుకోడు. తన భావాలు (రసిక) పాఠకునికి కూడా కలగాలని—అది జల్లుమనిపించాలని—చూసుకునే కవి తన రచనని చెక్కి తయారు చేస్తాడు. తన రచనకు ముక్కూ మూలమూ దిద్ది, సర్వ మానవులూ సామాన్యంగా ఉండే తటస్థ స్థితిలో నున్న చదువరి చెయ్యి పట్టి తన కావ్య ప్రపంచంలోనికి తీసుకుపోయి ఆవేగం హెచ్చించి చదువరిని బయల్దేరే ఏరోప్లేనులాగ లాగి భావావేశంలోకి ఎత్తి వదుల్తాడు. చదువరి భావావేశంలో మగ్గి అనుభవం పొంది ఆనందిస్తాడు. కథాకావ్య మయ్యేది, భావకావ్య మయ్యేది "అపుడు గొంతెత్తి యేడ్చినాను" అని ప్రారంభిస్తే చదువరి సంకోచిస్తూనే చదువుతాడు. "ఎప్పుడు ? ఏమొచ్చింది ? గొంతెత్తి ఏడ్చే స్థితికి ఎలాగు వచ్చాడా రచయిత ?" అన్న సందేహాలుండిపోతాయి. కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షములో 26 ఖండములు ముక్కూ మూలముతోనే పుట్టినవి. అబ్బ ! అన్న ఖండము "హృదయ వనజాత సుమ మృదు మనోహరదళము లదయతను ద్రుంచినారే, పెంధూళి జిదిమి వెదజల్లినారే" అని ప్రారంభించింది. ఎవరేనా "ఏమి ? ఎందుకు అలాగ జరిగింది ?" అని అడుగుతారు. దానికేమీ సమాధానం లేదు. ఈ ఆరోపణే మరోరీతిగా వచ్చింది. రెండో చరణంలో. ప్రశ్నా సందేహమూ అలాగే ఉండిపోయాయి. మాటవరసకి, ఒకడు భార్యని హత్యచేసి ఉంపుడుకత్తె కామె నగలిచ్చా డనుకోండి. వాణ్ణి తన్నినవారిని గురించి వాడు ఈ మాటలే అనవచ్చును గదా ? నలుగురి యెదటా వాపోయేవారు పూర్వాపరాలు దాచడమేమి ? .... 'ఆశ' అన్న ఖండములో ప్రశ్నలే ఉన్నాయి పొడుపు కథల్లాగ ఎంత గళ ఘోర గంభీర ఫెళఫెళార్భటులతో అడిగినా అదే ప్రశ్న. ఈ ప్రశ్నలలో నిశ్శ్రేణి మెట్లకు వలె ఒకదాని కంటె ఒకదానికి ఎత్తు లేదు. అన్నిటినీ బిగించి సందేశ మివ్వగల చివరి పాదమూ లేదు. ఇది భావాలమూట. ఆ భావ మిక్కడా ఈ భావ మక్కడా పెట్టినా ఏ మార్పూ రాదు. మరో నాలుగు చరణాలు కలిపినా వడ్లగింజంత బరువేనా ఎక్కువకాదు. 'ప్రాశారాయక్షితీంద్ర' అన్న పద్యాలలోదే ఇది, రచన మాత్రము ఆధునిక కవిది. "నన్ను గనియేరు జాలి జెందంగ వలదు" అని ప్రారంభించిన పంక్తులకు కూడా పూర్వాపరాలు తెలియవు. లేవు గనుక ! ఇది ఖండకావ్యము కాదు, కావ్య ఖండము. దారిలో దొరికిన ఒక పుట లాంటిది. గళఘోర గంభీర ఫెళఫెళార్భటులు దీనిలోనూ ఉన్నాయి.

"మీరు మనసారగా వేడ్వనీరు నన్ను" అన్న ఖండమునకు పూర్వభాగము తెగిపోయింది. 'ఒకసారి నన్ను విడువుడు' అన్న మాటలు, ఈ పలికే వ్యక్తిని ఎవరో పట్టుకున్నట్టు సూచిస్తున్నాయి. అంతమాత్రమే. పూర్వగాథ తెలియడము లేదు. నా గుప్పిటలోది ఏమిటో చెప్పమన్న ప్రశ్నకిలాగే, చకితుడౌతాడు చదువరి. సంఘటన (Composition) చిత్రములో ఒక ముక్క కత్తిరించి మిగిలిన ముక్కని ఎదుట పెట్టినట్లే ఈ ఖండము ఎదుట పెట్టడమూను. 'కలువ పూ బ్రతుకులో' అన్న రచనలు నాటకాల్లో అభాగినుల వచనాలలాగ వినపడుతున్నాయి.

ముక్కూ మూలమూ తెలిసే రచనల్లోనైనా భావ స్ఫురీగమనములేని రచన లున్నాయి. ఏవో కొన్ని పద్యాలు గుచ్చి పెట్టితే అది ఖండ కావ్యము అయిపోదు. స్వేచ్ఛాగానములో ప్రవిష్ట లున్నాయి అయిదు పద్యాల్లో. ఒక పద్యం తీసినా, ఒకటి కలిపినా మార్పు రాదు. 'స్వేచ్ఛా గానము 2' లోని వరుసలో సార్థకత లేదు. వెఱ్ఱి పాట వెఱ్ఱికి ఎంతో దూరము లేదు. ఇదేదైనా ఖండకావ్యానికి భాషాంతరీకరణమేమో. 'ఏసు నిద్దుర వోవుదునో యేమొ' అన్నది రవీంద్రుని రచనకు తెలుగు. 'కవికుమార' లో మూడు పద్యాలకీ ఐక్యత లేదు. ఏది తీసేసినా మొత్తపు కావ్యానికి నష్టము కలుగదు. 'మహాకవి' లో భావాలకు బంధము లేదు. మూడు నాలుగు అయిదు ఆరు పాదాలు తీసేసినా నష్టము ఏమీ రాదు! ఎనిమిదోదీ అంతే. వీ టన్నిటా అఖరి పాదాలు బిగుతు సళ్ళి పోయాయి. 'లోకము'లోని మూడు పద్యాలూ ముక్తకములు, సప్తశతి గాథలవలె నున్నవి. 'ఆలని దివ్వె' లో మొదటి రెండు పద్యాలలోనూ సఖునికి సంబోధన. తరవాతి మూడింటా సాదామనికి, చెప్పవలసే ఇలాగు చెప్పేరా ?

కృష్ణశాస్త్రిగారు "శబ్ద సంస్కార మెచ్చటను జారగనీక పదమైత్రి అర్థ సంపదల బొదలు' నట్లు 'పొనగ ముత్తెపు సరుల్ పోహళించిన లీల' పద్యాలు రచించగలరు. వారి నాటికలలో అలాంటి రచన సమృద్ధిగా గలదు. భావ చంచల అలాటి చోట ఎన్నిమార్లో జరాలున మెరుస్తుంది. (ద్రాక్షరసము లోని పండ్లవలె మధు బిందువుల వంటి వీరి పద్యాలు నాటికలల్లో రాణించాయి.) 'ఉలికిపడి లేచు కోవెలతోట వలిగలి' 'తొలి ప్రొద్దు కొండపై మొలిచె నొక దేవళము, వెలుగు గుడి మొగసాల నిలిచె యాత్రాజనము' 'పొడుపు వాకిలి గవను తల్పులు

పడల్చి కనబడని చేయి యేది విప్పినదో కాని నాలుగాళల లోపల మూలమూలలందు చొరబడి పోయినాడా మని దొర !' 'పారిజాతానికి మరిగిపోయే రక్త హృదయం, శాంత ధవళమైన పైమూర్తి'ట ! 'ప్రక్కనున్న సైకతవీథి కంటె మూగగా నున్నది' ట యమున. 'కడలి యేదో గాతమేదో ఏకమైనవి ఏడు పాయలు !' నాటినుండి నేటివరకూ ఇంపుగ మోగుతున్నది వీరి కవితాకన్య చరణ మంజీర కింకిణి. మధు బిందువుల నందించే పూవులు వీరి కవితావనములో వికసించాయీ, వికసిస్తున్నాయి. బృందస్విడిన కృష్ణస్వామి, కైలాసగిరినుండి కాశికీ, కాశికాపురి నుండి యొదటికీ వచ్చి తన కన్నీటి బిందువులను నరము గూర్చుట కోసమై చేయిచాచాలని ఈయన ఆశయము. వెన్నెల్ని పరచినా విన్ను పానుపు మీద కన్ను విప్పక పన్నుండు కరిమబ్బు చాటునుంచి, తరుణతమాల కిసాల సమాన శ్యామల కోమల చారు శరీరి, హరిదంత పదమ్ము నుండి మ్రోయు చైత్రమాస పదకింకిణిరవముల కోలాహలమ్ముతో హావాహూమాయిపయి, తరళ తరళమలయానిలలోల తరంగచలిత! వననాంచలముల గుసగుసలతో, వచ్చును గాక జగత్ప్రభువు! రచింతురుగాక వీరు తేనె పెఱలవంటి నిండైన ఖండ కావ్యములు.

కృష్ణశాస్త్రిగారి రచనలతో, అంతకన్నా యెక్కువగా ఆయన కావ్య పఠనాలతో, ఆధునిక కవిత్వానికి నత్త చేకూరినది. వారి వ్యక్తి అప్పటివారి రచనలతో పూర్తిగా రూపొందలేదు. సంప్రదాయము నతిక్రమించని శైలితో వారు రచించి, చక్కగా పాడుతూ వినిపించేవారు. కనుక 'ఏదియొ అపూర్వ మధుర రక్తి స్ఫురియించు కాని, అర్థమ్ము కాని' భావ కవిత్వముగా జమ కట్టేరు యువకులు వారి రచనని. వాచ్యార్థము వల్ల తేటతెల్లముకాని అంతరార్థమేదో వారి రచనలలో ఇమిడి ఉన్నదని నమ్మేవా రెంద రెందరో. ఈ నమ్మకతో అజ్ఞాత అగోచర సౌందర్యాన్ని దేన్నో అన్వేషిస్తూ రచించడమూ, గతించిన ప్రేయసినో అప్రాప్త మనోహరినో ఉద్దేశించి దుఃఖ గీతాలు రచించడమూ, లోకపు వైముఖ్యమును ఊహించుకుని పడదిట్టడమూ ప్రారంభించారు 1920 తరువాతి నాటి నవ కవులు. వేదనా దుఃఖమూ, ఏదో చెప్పరాని సౌందర్యాన్వేషణా, ప్రియురాలి పాదలాక్షకు హృదయరక్త మర్పించడమూ, ప్రియురాలిని కూడగట్టుకుని మృత్యు మందిరంలో దూకుతా మనడమూ ఆనాటి రచనలలో జల్లు జల్లులుగా కురిశాయి. కావ్య పఠనాలూ కృష్ణ శాస్త్రి రూపానుకరణాలూ చెప్పనే అక్కర్లేదు. 'భావ కవి' కి రూపమూ కావ్య వస్తువూ, (గీత పద్య) ఛందస్సూ, నాట్యరంగమూ ఏర్పడ్డాయి. ఈ భావ కవిత్వపు గుడారుకు కృష్ణ శాస్త్రిగారు మూలస్తంభమై నిలిచారు. అయితే మన దురదృష్టము వారి అనుయాయుల రచనల లోనూ కావ్యసిద్ధి కలిగి రసానందము కలిగించగల నిండు భావ కావ్యాలకంటె కవిత్వపు తునకలు గల సంశ్లిష్ట రచనలే ఎక్కువ వచ్చాయి.

---

సీ. జీవిని జీవి భక్షింపఁ జేసితి వింతె
   కానిపెట్టినావె చేతనుల కెల్ల ?
చేసినంత భుజింపఁ జేసి నా వింతె కా
   కెక్కువ లెవ్వరికిచ్చినావు ?
కర్మసూత్రంబునఁ గట్టి త్రిప్పెదవు గా
   కిచ్చ నొక్కనిఁ బోవ నిచ్చినావె ?
వెసఁ బృథక్ప్రకృతుల వేయుఁ బెట్టితిగా
   కందఱ కైకమత్య మిడినావె ?

గీ. తెలిసె నీ రక్షకత్వంబు దేవదేవ !
వేఱగతిలేక నిన్ను సేవింపవలసె
చిత్రచిత్ర ప్రభావ ! దాక్షిణ్యభావ
హతవిమతజీవ ! శ్రీకాకుళాంధ్రదేవ !

# వగపేటికి చల్లచిందినస్



శ్రీ మధురాంతకం రాజారాం

ఒక చివర తులసమ్మ. వేరొక చివర మురళీకృష్ణ. ఆ యిద్దరికీ మధ్య పరివ్యాప్తమయ్యే వృత్తాంతం ఇది. తులసమ్మ దగ్గిర నుంచీ మొదలెడితే దీన్ని ఎవ్వరూ చదవరేమో నన్న భయం నాకుంది. ఎందుకంటే తులసమ్మ కథ చెప్పగా విన్నవాళ్ల హృదయాల పాలిటికి రంపాల కోత. యుద్ధ ప్రమాదాలు ముంచుకొచ్చి, జీవన వ్యయాలు హద్దుమీరి ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునేదాకా యిబ్బందులతోడిదే బ్రతుకైపోయిన రోజుల్లో విషాదగాథల్ని వినే ఓపిక ఎవరికుంటుంది ?

ఎవ్వరికీ ఉండదు. అలాంటి సందేహానికి ఆస్కారం లేకుండా మురళీకృష్ణను గురించి నిర్భయంగా చెప్పుకోవచ్చు. పదిమంది ఒకచోట కలిసినప్పుడు కులాసాగా చెప్పుకుని వినోదించడానికి అనువైన కథే మురళీకృష్ణది. కాని వచ్చిన చిక్కేమిటంటే వినోదమూ, విషాదమూ ఒకే ఒక నాణానికి బొమ్మా, బొరుసూ మాత్రమే ! నాణెంతో కాసేపు ఆడుకో దలచినప్పుడు బొమ్మలాగే బొరుసు గూడా కంటబడక తప్పదు!

ఐనా ఒకపని చేయువచ్చు. బొరుసు కనిపించగానే కళ్లు మూసుకుని నాణాన్ని తల్లక్రిందులు జేయడం చిటికలో పని! కథలో విషాదంపాలు ఏమాత్రం తగ్గినా తగ్గినట్టే !

పట్టణంలో బస్సు దిగి అరమైలు దూరం నడిస్తే ఓ చిన్న మేడ కనుపిస్తుంది. మేడ పైభాగంలో ఉన్న ఓ చిన్న గదిలో మురళీకృష్ణ నివాసం. మురళీకృష్ణ స్వార్జితంగానీ, పిత్రార్జితంగానీ కాదు గనుక ఆ మేడను గురించిన వివరాలతో మన కక్కట్టే ప్రసక్తి ఉండదు. నెలకు పదిహేను రూపాయల అద్దె తమది కాదనుకుంటే ఆ గదిలో ఎవరైనా ఉండవచ్చు. అద్దెడబ్బులైతే నికరంగా చెల్లిస్తాడు గానీ, మురళీకృష్ణ ఎప్పుడుబడితే అప్పుడు గదిలో కనపించడు. ఊళ్లో అతనికి ఉద్యోగం ఉంది. ఉద్యోగానికి సెలవులొస్తే మిత్రు లున్నారు. మిత్రు లెవరూ కనిపించకపోతే గ్రంథాగారా లున్నాయి. గ్రంథాలయాలు మూసేస్తే అర్ధరాత్రి వరకూ మేలుకునే సినీ మందిరా లున్నాయి. ఎన్నివున్నా మధ్యాహ్నానంతరం వీధుల్లో వడగాడ్పులు, నిప్పులు చెరిగిపోసే వేళల్లో మురళీకృష్ణకు ఆగది ఆపత్సమయంలో సుగ్రీవుడికి ఋష్యమూకం లాంటిది. తారురోడ్డుపైన అరమైలు దూరం నడిచి, మేడ మెట్లెక్కి ఓరవాకిలిగా వేసి ఉన్న రెక్క తలుపులు తెరిచేసరికి చల్లటి గదిలో తెల్లటి దూదిపరుపుమీద హాయిగా విశ్రమిస్తూ ప్రత్యక్ష మౌతాడు మురళీకృష్ణ. నిద్రాభంగం పాపహేతు వౌనో కాదో గానీ, అది మురళీకృష్ణ విషయంలో కోపకారణం మాత్రం అవును. మూగపోయిన మురళి నిద్రలేచి గాలి పోసుకుని మళ్లీ నాదాలు కుమ్మరించేదాకా అల్మారాలో కనిపించిన కొత్త పత్రికలనో, పాత కావ్యాలనో చూస్తూ కూర్చోడ మొకటే గత్యంతరం !

వెళ్లినవాడి అదృష్ట దురదృష్టాలనుబట్టి కాస్త తొందరగానో, కాదా మరీ ఆలస్యంగానో నిద్రలేస్తాడు మురళీకృష్ణ. లేచి కూర్చోగానే ఆగంతకుడు అతనికి కనిపిస్తాడు. మురళీకృష్ణ కళ్లు పెద్దవౌతాయి. నుదురు కుంచించుకుపోతుంది. ముక్కుపుటం పైకి లేస్తుంది. మరొకటి, మరొకటి గాదు. అదంతా స్వాగత సంరంభ మన్నమాట ! ఎప్పుడొచ్చావు, ఎక్కడినుంచీ రాక, ఏమిటి విశేషాలు మున్నగు ప్రశ్నల వర్షానికి అతడి ముఖంలోని కదలికలు మౌనవ్యాఖ్యానా లన్నమాట !

పిందెను తీసుకొచ్చి మాగబెట్టడానికి ప్రయత్నించడం ఎంతటి తెలివితక్కువపనో, అందుకు సంసిద్ధం కాకమునుపే మురళీకృష్ణను మాటల్లోకి దించ దలచుకోడం అంతటి వెర్రి పని. శుద్ధ సాత్వికాభినయంతోనే స్వాగతకార్యం నిర్వర్తించిన మీదట బక్కపలచటి శరీరంలో ఈమూల కొకటిగా, ఆమూల కొకటిగా చెల్లాచెదరైపోయిన శక్తులను కూడగట్టుకోడాని కన్నట్టుగా అయిదు నిమిషాలో, పది నిమిషాలో అలాగే స్తబ్దంగా కూర్చుంటాడు మురళీకృష్ణ. ఆ తరువాత నింపాదిగా ముఖ ప్రక్షాళనం, తదనంతరం అతడి చూపులు సూటిగా గోడపైకి వెళ్తాయి. అక్కడ చిలుకు వ్రేలాడుతూ ఒక ఫ్లాస్కులో ఉన్న కాఫీలో కొంచెం అతిథికి భాగంపెట్టి మిగిలిన గ్రుక్కెడు తాను సేవిస్తాడు మురళీకృష్ణ. మురళి గాలి పోసుకుంటున్న దన్నమాట ! ఇక ఎదుటివాడు సావధానంగా ఉండవచ్చు, నాదం ఉప్పతిల్లబోతుంది గనుక !

మురళీకృష్ణను నేను చిన్నతనం నుంచీ ఎరుగుదును. అతడిలోని లోపాలను, దోషాలను వ్రేలెత్తి చూపి వాళ్లూ వీళ్లూ కోపతాపాలు ప్రకటించినప్పుడు 'ఆఁ, కుర్రతనం లెద్దురూ,' అని అతణ్ణి వెనకేసుకొచ్చిన మిత్రుల్లో నేనూ ఒకణ్ణి. తనలోని గుణాలతోను, దోషాలతోనూ అలాగే పెరుగుతూ వచ్చిన మురళీకృష్ణ, చిట్టచివరకు తనను వెనకేసుకొచ్చిన మిత్రులకు సైతం అర్థంకానంతటి క్లిష్టమైన వ్యక్తిగా రూపొందాడు. ఫలానా సంఘటన ఎదురైనప్పుడు అతడి ప్రవర్తన ఫలానావిధంగా ఉంటుందని గానీ, ఫలానా ప్రశ్నకు అతడి జవాబు ఫలానా విధంగా ఉండవచ్చునని గానీ

ఊహించడానికి వీలులేకపోవడం మురళీకృష్ణలోని ప్రత్యేకత. ప్రాణమిత్రుణ్ణి గురించిన ప్రసక్తి తెచ్చి 'అతడెలా ఉన్నాడని' ప్రశ్నిస్తే వింతగా ముఖంపెట్టి 'అతడు వూళ్ళోనే ఉన్నాడా?'' అంటాడు మురళీకృష్ణ. 'ఫలానా సినిమా చాలా బాగుంది. బహుశా చూసే ఉంటావు' అంటూ ముందరి కాళ్ళకు బందం వేస్తే 'ఆ పేరుతో సినిమా గూడా వచ్చిందా? అలాంటి పేరుతో ఓ పుస్తకం చదివినట్లు జ్ఞాపకం' అంటాడు మురళీకృష్ణ. అతడీమధ్య ఆ మిత్రుణ్ణి కలుసుకోలేదా, ఆ సినిమా చూచిఉండడా' అని ప్రశ్నిస్తే—కలుసుకుని ఉంటాడు, చూచిఉంటాడు అన్నదే నా సమాధానం. ఐతే అతడెందుకిలా చెబుతున్నాడు? నాకు స్ఫురించే కారణం ఒక్కటే! తనను గురించిన నిజాలు సాధారణంగా సామాన్య మానవుల ఊహా పరిమితికి అందవన్న భ్రమను కలిగిస్తాడు మురళీకృష్ణ. ఆ భ్రమలో తన ఉద్దేశం తల్లక్రిందులైనందుకు, తన అంచనా తారుమారు అయినందుకు ఎదుటి వ్యక్తి కించపడిపోవడం సహజం. అప్పటికప్పుడు అలా ఎదుటివాడిలో కించపాటును సృష్టించి, దానిపైన తన ఆధిక్యతను ప్రతిష్టించి దాని ద్వారా తన విశిష్టతను చాటుకోడం అతడి అభిమతమేమో మరి!

తన స్వభావంలోని వైచిత్రిని మాత్రం మినహాయించి చూస్తే మురళీకృష్ణ ఎంతో స్నేహపాత్రుడుగా కనిపిస్తాడు. అతడికెందరో స్నేహితులున్నారు. కొందరు చెరువులో అలల్లాంటివారు. ఎదురైతే మందహాస మాత్రమైన పరామర్శతో అలాగే ముందుకు సాగిపోతారు. కొందరు మొగిలిపువ్వుల్లాంటివారు. దూరంనుంచీ పలకరించి, బాగున్నావా అంటూ కుశలమడిగి జనంతో కలిసి మాయమైపోతారు. కొందరు పరుగిడుతున్న మెట్టపొలంలో కాలికి తగులుకునే అనపతీగల్లాంటివారు. రోడ్డుపైన తారసిల్లితే గంటల తరబడి వూకదంపుడు ప్రసంగాలకు పూనుకుంటారు. ఈ రకం మిత్రులు తమ సశేష ప్రసంగాన్ని మళ్ళీ రోడ్డుపైన సమాగమం సంఘటించేనాటికి వాయిదా వేసుకుని విడిపోతుంటారు. పోగా మురళీకృష్ణను వెదుక్కుంటూ అతడి గదిలోకి వెళ్ళి బాతాఖానీకి కూర్చునే మిత్రులు సైతం లేకపోలేదు. కాని వాళ్ళల్లోనైనా మురళీకృష్ణ ఎక్కడివాడు, ఎందుండి వచ్చాడు, ఎక్కడికి వెళ్తున్నాడు అన్న వివరాలు తెలిసినవాళ్ళు చాలా తక్కువ. దాదాపు శూన్యమని చెప్పినా చెప్పవచ్చు. మురళీకృష్ణ నివసిస్తున్న పట్టణమేదైతే ఉందో అది సిమ్లా కాదు, డార్జిలింగు కాదు. ఉదకమండలమైనా కాదు. దేశంలో ఏమూలలనుంచో వచ్చి వేసవికాలపు విశ్రాంతి ప్రదేశంలో నాలుగు రోజులు గడిపి పోయేవాళ్ళల్లోనైతే యిలాంటి తాత్కాలిక స్నేహాలు ఆశ్చర్యం కలిగించవు. మామూలు ప్రపంచంలో స్నేహానికున్న విలువ వేరు. మహానుభావుడెవరో సృష్టిలో తియ్యనిది స్నేహమేనని చెప్పనే చెప్పాడు. ఒకసారి ఆమాట మురళీకృష్ణతో చెప్పాను గూడా! అతడు నవ్వాడు. 'ఆయన నిజంలో సగం మాత్రమే చెప్పాడు. మిగిలిన సగం నేను చెబుతాను. శ్రుతి మీరితే అంతటి బాధాకరమైంది గూడా వేరొకటి ఉండదు' అన్నాడు మురళీకృష్ణ.

తన మానసిక ప్రపంచంలో మురళీకృష్ణ నా కిచ్చిన స్థానమెలాంటిదో నాకు తెలియదు. అప్పుడప్పుడూ నేనతని ఆంతరంగిక విషయాల్లో జోక్యం కలిగించుకునేమాట మాత్రం నిజం. అందుకు కారణం లేకపోలేదు. చెట్టు పెట్టినవారు దానిలోనుంచీ కాయలు కోసుకోడమనేది సభ్య మానవ సమాజంలో ఒక న్యాయం. లోకం కంటికి చక్కటి సన్నజాజి పందిరిలా భాసిస్తున్న మురళీకృష్ణ జీవితానికి పాదులు కట్టి, నీరుపెట్టి అది ననలు తొడిగినప్పుడల్లా పరవశించిపోయిన వాళ్ళను గురించి నాకు తెలుసు. తన అభివృద్ధికి ఎక్కడినుంచైతే అది సత్తువను గ్రహించిందో అక్కడివాళ్ళకు దాని అందచందాలు, సుమ సౌరభాలు ఒక్కింతగానైనా వినియోగపడితే బాగుండునన్నదే నా కోరిక. మురళీకృష్ణ మాటల్లోనూ, చేతల్లోనూ అందుకు విరుద్ధమైన లక్షణాలు పొడగట్టినప్పుడల్లా నేను మృదువుగా మందలించే నేరానికి పాల్పడేవాణ్ణి.

పెద్దమనసు చేసి నా కామాత్రం చనువు ప్రసాదించాడు మురళీకృష్ణ. లేకపోతే నేను మురళీకృష్ణను మందలించడమేమిటి? అతడు బాగా చదువుకున్నవాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. లలితకళలన్నింటిలోనూ తనకున్న కొంచెమో నంచెమో పరిచయాన్ని పురస్కరించుకొని పదిమందిని మెప్పించగలిగినవాడు. నగరంలో పేరెన్నికగన్న వ్యక్తిగా చలామణి కావడానికి కావలసిన హంగులు—లేదా ఆ హంగుల తాలూకు అంకురాలు మురళీకృష్ణలో పుష్కలంగా ఉన్నాయి. తెలిసినవాడికి తెల్పడం మిక్కిలి సులభమంటాడు భర్తృహరి. అసలు తెలిసినవాడికి ఒకరు మళ్ళీ తెలియజెప్పవలసిన అవసరం ఏముంటుందన్నదే నా సందేహం! అందుచేతనే గావచ్చు, క్రమక్రమంగా మురళీకృష్ణకు సలహాలిచ్చే అనవసరమైన బాధ్యతకు స్వస్తి చెప్పుకోడానికే ప్రయత్నించాను.

కాని తన కిష్టంలేని పని ఏదైతే ఉందో, దాన్ని తప్పనిసరిగా చేయవలసి రావడం మానవుణ్ణి తరచుగా ఎదుర్కొనే ధర్మసంకటాల్లో ఒకటని నా కప్పట్లో తెలియదు—

* * *

ఏదో పనిబడి ఒకసారి పట్టణం వెళ్ళాను. మురళీకృష్ణకు బదులుగా, వేసిన తాళంతో మూసిన తలుపులు ప్రత్యక్షమయ్యాయి. అది మురళీకృష్ణకు సెలవురోజు. బయట గ్రీష్మతాపం యింకా తగ్గలేదు. మేడ క్రింది భాగంలో కాపురమున్నవాళ్ళని అడిగిచూచాను. మురళీకృష్ణ ఊళ్ళో లేడని తెలిసింది.

ఎక్కడికి వెళ్ళాడన్న ప్రశ్నకు మాకు తెలియదన్నదే వాళ్ళ సమాధానం.

రోడ్డుపైకి వచ్చేశాను. బజార్లో అంగళ్ళు ఎక్కి దిగుతుండగానే ఎండలు చల్లబడ్డాయి. మిగిలిన ప్రొద్దు మరి

# వగపేటికి చల్లదిందినవ్

కొన్ని స్వంత పనులు చక్కబెట్టుకోడానికి సరిపోయింది. తరువాతి కార్యక్రమ మేమిటో పాలుపోక, ఆలోచిస్తూ మెల్లగా నడుస్తున్నాను. నాలుగు రోడ్ల కూడలిలో రామభద్రం ఎదురయ్యాడు.

"ఏమండీ ! ఎప్పుడొచ్చారు వూరినుంచీ ?"

చెప్పాను.

"ఇలా ఎక్కడికి వెళ్తున్నారు ?"

చెడ్డ చిక్కే వచ్చిపడింది నాకు. నికరంగా ఒక గమ్యస్థానం చెప్పకపోతే రామభద్రం నన్ను తన గృహాన్ని పావనం చేయమంటాడు. అలాంటి పనికి సాహసించి, రామభద్రం ప్రసంగ వాగ్ఝరిలో మునిగితేలి తలనొప్పిని కొనితెచ్చుకోడం నా కిష్టంలేదు.

"సినిమాకు" అంటూ అబద్ధంతో ఆత్మరక్షణకు పూనుకున్నాను.

"సినిమాకు ఒంటరిగా వెళ్తారా మీరు?" రామభద్రం కొండంత ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"జంటగా ఎలా వెళ్లగలను ? సహధర్మిణి ఊళ్లోనే ఉంది."

"అబ్బే, అదిగాదండీ మేష్టారుగారూ, సాధారణంగ మురళికృష్ణను వదిలిపెట్టరే మీరు."

"నిజమే ! కానీ ఏం చేయను ? మురళికృష్ణ ఊళ్లో లేడు....."

"లేకపోవడ మేమిటి ? ఉన్నాడండీ ! నిక్షేపంగా ఉన్నాడు. ఇప్పుడే చూచాను. పెట్టె, పరుపు, కూలీచేత మోయించుకుని వెళ్తుంటే అడిగాను. ఎక్కడో నెల్లూరు జిల్లాలో పెళ్లట! వెళ్లొస్తున్నా నన్నాడు ...."

రామభద్రానికి మిత్రమండలిలో 'సమయ సంజీవి' అన్న బిరుదం ఉంది. ఒకరికి ఫోను చేయాలి. బ్యాంకులో చెక్కు మార్పించుకోవాలి. ఆఫీసులో అర్జీ సంగతి కనుక్కోవాలి. అర్జంటుగా ఓ వర్తమానం తెలుసుకోవాలి. నిమిషాల్లో యిలాంటి పనులు చక్కబెట్టగల చాకచక్యం రామభద్రం సొత్తు.

రెండోదఫా వెళ్లేసరికి మురళీకృష్ణ ప్రయాణంచేసి బడలిపోయి వచ్చిన కారణాన కాబోలు, పైపై దుస్తులన్నీ ఊడదీసి కాళ్లొక వైపుకు చేతులొక వైపుకు తోటకూర కాడల్లా వ్రేలాడవేసి వాలు కుర్చీలో విశ్రాంతి తీసుకుంటున్నాడు.

గదిలో అడుగిడగానే అతడు పలకరించాడు.

"ఎప్పుడు ?"

మధ్యాహ్న మనగా వచ్చానని చెప్పుకున్నాను.

కొంతసేపు మౌనంగా కూర్చున్న తర్వాత పెదవుల పైకి ఓ చిరునవ్వు తెచ్చుకుని "విశేషాలు ?" అన్నాడు.

"విశేషా లేమైనా ఉంటే నువ్వే చెప్పాలి. ఎక్కడో పెళ్లట. వెళ్లొస్తున్నావట !" అంటూ ఓ కదుపు కదిపాను.

పెళ్లిమాట చెవిని బడగానే మురళీకష్ణ కళ్లలోకి వెలుగు లొచ్చేశాయి. ముఖంలోకి ఉత్సాహం వచ్చేసింది. అతడు వాలు కుర్చీలో నిటారుగా కూర్చున్నాడు.

"పెళ్లంటే పెళ్లా అది ! మన ప్రాంతంలోనూ పెళ్లిళ్లు జరుగుతాయి. దానిముందు ఇవి దిగదుడుపుకైనా పనికిరావు .... ."

"నీ అంతటివాడి మెచ్చికోలుకు పాత్రం కావడంలోనే దాని గొప్పతనం తెలిసిపోతోంది. వివరాలు చెబుతే చాలు. పెళ్లెవరికి ? ఎక్కడ ? ఎలాంటి సంబరాలు జరిగాయి ?"

బస్సు దిగి మార్గ మధ్యంలో కాఫీతో సహా ఉపాహారం గూడా సేవించి వచ్చినట్టున్నాడు మురళీకృష్ణ. దండిగా బొగ్గూ, నీళ్లూ వేసుకున్న యింజనులా ప్రారంభమైంది ప్రసంగం.

వీరంరాజుగారని ఓ గొప్ప భూస్వామి. రాజకీయాల్లో ఆయన పాత్ర చాలా ఉంది. తరచుగా వార్తాప్రపంచంలో వినవచ్చే పేరాయనిది. ఆయనే కన్యాదాత. వధూవరు లిద్దరూ విద్యాధికులే ! పెళ్లికి పెద్ద పెద్ద తలకాయలు చాలా వచ్చాయి. దక్షిణాది నుంచి పేరుపొందిన మేళగాళ్లు వచ్చారు. వంటలెంత బాగున్నాయంటే, వాటిని చేసింది నలభీముల్లో ఎవరో మురళీకృష్ణ ఏర్పరించి చెప్పలేకపోయాడు. ఈ విశేషాలన్నీ ఒక ఎత్తయితే వరకట్నాన్ని గురించిన ఉదంతాన్ని ఒక ఎత్తుగా చెప్పాడు. మురళీకృష్ణ.

"అదే, అదే. నాకు తెలుసు. వరకట్న మనగానే నువ్వు త్రుళ్లిపడతావని నాకు తెలుసు. ప్రభుత్వం నిషేధించింది గనుక యిక దాని ప్రసక్తికే తావుండగూడదని నీ ఉద్దేశం. అదెలా పొసగుతుందో నువ్వు ఆలోచించవు. భోగంవృత్తి కూడదనుకోడంలో అర్థముంది. మద్యపానం వద్దనుకోడంలో అర్థముంది. కానీ వరకట్నాలకు అడ్డకా లేమిటి ? మళ్లీ స్త్రీలకు సమాన హక్కులు కావాలని మాత్రం చెబుతారు ! ఇప్పుడా వీరంరాజుగా రన్న పెద్దమనిషినే తీసుకో ! ఆయన వరకట్నమన్న పేరుతో కుమార్తెకు పాతికవేల రూపాయ లిచ్చాడనుకో ! (ఇంకా ఎక్కువే ఇచ్చిఉంటాడని మురళీకృష్ణ అంచనా !) అమ్మాయి కాబట్టి అంతటితో సరిపోయింది గానీ, అదే అబ్బాయి అయితే చచ్చినట్టు ఆస్తిలో వాటా పంచిపెట్టవలసిందేగదా !"

తేలిన సారాంశం వరకట్నాలు యిచ్చుకోడంలోనూ, పుచ్చుకోడంలోనూ తప్పులేదని !

ఐనా నాకు తోచిన పద్ధతిలో మురళీకృష వాదాన్ని పూర్వపక్షం చేయడానికే ప్రయత్నించాను.

"మాటవరసకంటున్నావుగానీ వరకట్నాలు మూలంగా ఏర్పడుతున్న అనర్థాలు నీకుమాత్రం తెలియవా మురళీ ! మన కళ్లముందర ఎన్ని సంసారాలు గుల్లయిపోలేదు ?"

"దానికేం చేద్దాం ! ఎంత చెట్టుకు అంత గాలి ! ఎవ రివ్వదగిన కట్నం వాళ్లిచ్చుకోడం ఉచితం …."

"కానీ యిచ్చుకోదగినంత కట్నానికి మంచి వరుడు దొరక్కపోతే ?"

"అందు కెవరు మాత్రం ఏం చేయగలరు ? నాకు తోచినంతలో గంతకు తగిన బొంతను ఎన్నుకోడం ఉత్తమమని నేనూ ఒక ఉపాయాన్ని సూచించే ఉన్నాను …."

పూర్తిగా వ్యాపార సరళిలో దిగి మాట్లాడుతున్న మురళీకృష్ణతో ఆ విషయంపైన యింకా చర్చను పొడిగించడం వృథాయాస మనిపించింది.

"పోనీ నేను నీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నా ననుకో మురళీ ! నువ్వు చదువుకున్నావు. ఉద్యోగం చేస్తున్నావు. ఇక పెళ్లి ఒక్కటే బాకీ ! అదీ సమీప భవిష్యత్తులోనే ఉందని ఆశిద్దాం. ఏమాత్రం కట్నం ఆశిస్తున్నావు నువ్వు ?"

"ఎలా చెప్పగలను ? అదృష్టం కలిసిరావాలి. అది కలిసి వస్తే ఎందుకూ పనికిరాని వాజమ్మలు సైతం లక్షలు పలుకుతారు. ….."

"పోనీ, పనికివచ్చే వాజమ్మలు అందులో సగం ధరైనా పలకరా మురళీ ?"

కొంటె కుర్రవాడి చిలిపి మాటల్ని పట్టించుకోని వయోధికుడిలా గంభీరంగా కూర్చున్నాడు మురళి. చెబుదామా వద్దా అని తటపటాయించినట్టుగా కాసేపు వూరుకుని, ఆపైన మెల్లగా ఉపక్రమించాడు—"సెటిలయ్యేదాకా ఎవరికీ చెప్పగూడ దనుకున్నాను. నీకు చెప్పినా పరవాలేదు. ఇప్పు డిప్పుడే ఆఫర్లు వస్తున్నాయి …."

"అలాగా మురళీ ! ఎక్కడినుంచీ వస్తున్నా యవి ?"

"ఎక్కడినుంచైతే నేమిగానీ నెల రోజులనుంచీ ఒకటే గోల. మధ్యవర్తి ఒకాయన వేపుక తింటున్నాడు. ఆకాడికీ నేను నోరు తెరిచి అడిగింది లేదనుకో ! తనంతట తానే అతను రథాన్ని పదిహేనువేల దాకా లాక్కొచ్చాడు …."

తీరా ధరలు పడిపోయిన తరువాత విచారిస్తూ కూర్చునే వర్తకుడిలా దీనంగా అడిగాను "ఒప్పుకోలేక పోయావా మురళీ !"

మురళి ముఖంలో రంగు మారింది. "నాన్సెన్స్ ! లోకం ఎలా ఉందో తెలియదు నీకు ! అదే—జిల్లాలో నైతే మనం యాభై అరవై వేల దాకా ఆశించవచ్చు …."

భావికాలంలో పదకోశాలు తయారుచేసేవాళ్లకు ఉపకరించవచ్చునన్న ఉద్దేశంతో ఒక మనవి—పై మాటల్లో ఒక చోట మురళీకృష్ణ 'లోకం' అన్నాడు. అది పెళ్లిళ్ల మార్కెట్టు అన్న సంకర సమాసానికి పర్యాయపదం. పనిలో పనిగా యింకొక మనవి. అతడి మాటల్లోనుంచీ జిల్లా పేరు ప్రయత్నపూర్వకంగానే తీసివేయబడింది. కారణం వూహా కందని దేమీ కాదు. పేరు చెబితే ఆ జిల్లా వాళ్లకు కోపమైనా రావచ్చు. లేదు—గర్వమైనా కలుగవచ్చు. ఆ రెండు ఉద్వేగాలు ఆరోగ్యాని కేమంత మంచివిగావు.

మురళీకృష్ణ స్వభావాన్ని పరిశీలించడంలో నే నందాకా విస్మరించిన సరిక్రొత్త పాత విషయం ఒకటి నా కప్పుడు జ్ఞప్తికి వచ్చింది. మురళీకృష్ణ జాగరూకుడు ! ఎట్టి పరిస్థితిలోనైనా తన మెలకువలో తా నుండనేర్చినవాడు. కొమ్ములు తిరిగిన డాక్టరుగారికి వైద్య విద్యలో ప్రాథమిక పాఠాలు బోధించడం ఎలాంటిదో అతడికి సలహా లివ్వడం అలాంటిది.

ఐనా మళ్లీ—ఈసారి వేరొక దిశనుంచి చర్చను కొనసాగించాను.

"చూడు మురళీ ! ప్రపంచంలో డబ్బుకున్న ప్రాధాన్యం నాకు తెలియక కాదు. ఐనా కీడెంచి మేలెంచడం మంచిది. జీవితపథంలో నీకొక అమ్మాయి తారసిల్లుతుంది. చక్కని చుక్క. చిదిమి దీపం పెట్టుకోవచ్చు. గుణగణాలకు, సత్సాంప్రదాయానికి లోటులేని కుటుంబం. ఎటొచ్చీ వాళ్లేమంత కలిగిన వారు కారు. కట్నాలు కుమ్మరించలేరు. ఆ పరిస్థితిలో ఏం చేస్తావు నువ్వు ?"

మురళీకృష్ణ పక్కున నవ్వేశాడు.—"నాకేమంత ఒళ్లెరుగని శివమా ! లోకం గొడ్డుపోలేదుకదా ! ఆమాత్రం అందం ప్రపంచంలో మరెక్కడా కనుపించబోదన్న కక్కుర్తి ఏముంది ? కత్తి బంగారందని గొంతు కోసుకుంటారా ఎవరైనా ?"

తేలిపోయింది. ముందు జాగ్రత్త ఒక్కటె మినహాగా మిగిలిన, అన్ని ప్రలోభాలనుంచీ విముక్తుడై మురళీకృష్ణ తేలిగట్టున కూర్చున్నాడని స్పష్టంగా అవగతమైపోయింది.

శ్రమ తీసుకుని అతడు తన ఆంతర్యాన్ని విశదీకరించాడు గూడా !

"కత్తిపైన సాము. ఏటి కెదురీత. తనకుమాలిన ధర్మం. ఇవే ఆదర్శాలనుకోడం మానవుడి కొక చెడ్డ అలవాటైపోయింది. నన్నడిగితే అమల్లో పెట్టడానికి వీలున్నదేదో అదే ఆదర్శమంటాను. లోకం మెరమెచ్చులకోసం ఆశపడి బీదింటి అమ్మాయిని పెళ్లాడి భావికాలంలో అదే లోకంచేత బ్రతక లేనివాడి క్రింద జమకట్టబడటానికి నే నొప్పుకోను. ఇప్పుడు నాకు వందా యాభై రూపాయల జీత మిస్తున్నారు. ఎంత పొదుపుగా వాడుకున్నా పట్టణంలో వంద రూపాయలు లేనిదే బ్రతకడం సాధ్యంకాదు. పెళ్లయ్యాక నా జీతం సంసారానికి చాలవచ్చు. చాలకపోవచ్చు. పోనీ సరిపెట్టుకుంటామనుకో! కుటుంబజీవిత మన్నాక కొన్ని పొంగులు తప్పనిసరి ! అవి లేక పోతే 'గృహమే కదా స్వర్గసీమ' అన్న పాటను త్రిప్పించి పాడుకో వలసి వస్తుంది. కనీసపు అవసరం ఓ యిల్లు. పదివేల్

పెట్టందే యిల్లు దొరకదు. ఇల్లు కొన్నాము. వట్టింటో బ్రతకలేము గదా ! ఫర్నిచరు కావాలి. రేడియో ఉండాలి. ఈ ముఖ్యావసరాల కన్నింటికీ నాకు డబ్బు ఎక్కడినుంచి వస్తుందని నీ ఉద్దేశం ?''

ఆపాటికి బాగా చీకటి పడిపోయింది. ఇంటా బయటా గూడా దీపాలు వెలిగించుకుని తన పనులేవో తాను చేసుకుపోతోంది పట్టణం. పుస్తకంలోనుంచి మీల్సు టిక్కెట్లు రెండు చించుకుని మురళీకృష్ణ భోజనానికి వెళ్ళొద్దా మన్నాడు. ఆకాశవాణి సంగీతంతోబాటుగా అయ్యరుగారి భోజనం గూడా బాగుండడంతో హోటల్లో నుంచీ ఈవలికి వచ్చేసరికి తొమ్మిది దాటింది. నాలుగు రోడ్లు త్రిప్పించి మిల్కుబారు లోపలికి తీసుకెళ్ళాడు మురళీకృష్ణ. అక్కడినుంచి సినిమా థియేటరుకు దారితీశాడు. రాత్రంతా యించుమించు జాగరణగానే గడవడంతో ఉదయం నిద్రలేచేసరికి ఆలస్యమైంది. మొదటి బస్సు అందదు. రెండోబస్సు పన్నెండుకు గానీ లేదు. ఏదో పనుందని మురళీకృష్ణ తొమ్మిదింటికే ఆఫీసుకు వెళ్లిపోయాడు. నాకూ కొంత పని మిగిలి ఉండటం మూలాన మండీలవైపు బయల్దేరాను. మండీ ఆసాములు తలుపులు తెరచి తక్కెలు సర్దుకుంటున్నారు.

ఓ వసారాలోనుంచి పిలుపు వినిపించింది. తిరిగి చూచాను. తులసమ్మ కనిపించింది.

''ఎన్నాళ్ల కెన్నాళ్లకు నాయనా ! బాగున్నావా ? ఎప్పుడొచ్చావు ? మురళీకృష్ణ కనిపించాడా ?''

ఆమె పదేళ్లనాటి తులసమ్మలా లేదు. రక్తమాంసాలు అస్తిపంజరంపైన యిమిడిపోవడంతో ఆమె కృష్ణవర్ణదారు శిల్పంలా ఉంది. తలవెంట్రుకలు ఎండిపోయిన కసువు పోగుల్లా గాలికి కదులుతున్నాయి. జీవితం చిట్టచివర 'ఏమి మిగిలింది ?' అంటూ ఎదురయ్యే ప్రశ్నకు ఆమె ఏమని జవాబు చెప్పగలుగుతుంది ? అదిగో—నుదుట కానీ కాసంత కుంకుమ బొట్టు మాత్రం మిగిలింది. జీవితాన్ని తరచి తరచి చూచిన పెద్దలు భారతదేశపు సతీత్వ మనగా కష్టాలు భరించడం, కన్నీరు నించడం మినహాగా మరేమీ కాదన్నారు. జీవన సాగరంలో ఆడ దానికి ఐదవతనం ఒక చిన్న తెప్పలాంటిది. నిరంతర దుఃఖ ఝంఝూమారుతాలకు తావలమైన జీవన సాగరంలో దిగంతాలదాకా చేస్తున్న పయనంలో ఆఖరు మజిలీదాకా ఆ తెప్ప తోడు ఒక్కటి దక్కితే చాలు. అంతకంటే తులసమ్మలాంటి వాళ్ళు కోరదగిన దేముంది ?

చుట్టూరా కలయజూచాను. గోడ ప్రక్కన గంప ఒకటి కనిపించింది. గంపలో మట్టికుండ లున్నాయి. ఒకటి మజ్జిగదుత్త. వేరొకటి పెరుగుకుండ. ఇంకొకటి నెయ్యి ముంత. పోయేనాడు పూచిక పుల్లయినా వెంటరా దనడానికి నిదర్శనంగా మూడు కుండలు ఖాళీగానే ఉన్నాయి. తమ కుక్షిలోనుంచి పట్టణంలో నివసిస్తున్న భాగ్యవంతులకోసం ఎంత పెరుగు, ఎంత మజ్జిగ, ఎంత నెయ్యి సరఫరా అయి ఉంటుందో వాటికేం తెలుసు ? నాగరిక సమాజం దృష్టిలో విలువలేని దౌర్భాగ్యపు వస్తువులు మట్టికుండలు. మానవుడికి ప్రాణవస్తువులాంటి పాడి దినుసుల్ని పదిలపరచి పంచిపెట్టడ మొక్కటే వాటికి తెలుసు ! రుచిచూచే అదృష్టం వాటి నుదుట భగవంతుడు వ్రాసిపెట్టలేదు.

తులసమ్మకు ఊళ్లో నాలుగైదు ఆవులున్నాయి. ఓపిక ఉన్నా, లేకున్నా జరాభారమూ, రుజా ప్రకోపమూ ఎంతగా పీడిస్తున్నా ఆవుల్ని తోలుకెళ్లి పొలాల్లోనూ కొండ కోనల్లోనూ త్రిప్పుకురావడం నరసయ్యవంతు. కుక్కి తట్ట నిండుకూ చెక్కుడు బారతో గడ్డి చెక్కి తీసుకరావడం తులసమ్మ వంతు. రెండు పూటలా తిండి వండుకునే వెసులుబాటు తులసమ్మకు అందుబాటులో లేని సుఖం. అల్లంత దూరాన ఆమె కనిపించగానే ఆవులు గడ్డికోసం, దూడలు పాలకోసం పగ్గాలతో గింజులాట ప్రారంభిస్తాయి. ఆవులకు మేత బెట్టి, దూడల్ని పాలకు విడిచి, పిండుకున్న పాలను కుంపటి మీది కెక్కించి, అదనెరిగి తోడుబెట్టి ఆవలింతలతో ఆమె మేను వాల్చేసరికి ఊరి కనురెప్పలమీద నిద్రాదేవత హాయిగా సేదదీరి ఉంటుంది. ఆ ఊళ్లో తెల్లవారుజామున సైరను మ్రోగదు. కాని ఆ ప్రశాంత వాతావరణంలో పట్టణం తాలూకు సైరను మ్రోత బాటలూ తోటలూ దాటి వంకలూ, వాగులూ దాటి పొలాలూ బీళ్లూ దాటి ఆ కుగ్రామం లోని కుటీరాల్లోకి సన్న సన్నగా వినిపిస్తుంది.

పట్టణానికి పల్లెకూ అయిదుమైళ్ల దూరం. తులసమ్మకు రెండు గంటలు పట్టే కాలినడక.

''మురళి కనిపించలేదా బాబూ ?'' మళ్లీ అడుగుతోంది తులసమ్మ.

కనిపించాడని చెప్పాను.

''ఏమంటున్నాడు ?''

''ఏమంటాడమ్మా ? ఈ లోకానికి సంబంధించిన విషయా లన్నింటిపైనా మురళీకృష్ణకు స్వంతమైన అభిప్రాయా లున్నాయి. ఇంతకూ నువ్వడుగుతున్నది దేన్ని గురించి ?''

''అదే నాయనా— పెళ్ళిమాట !''

సిటీలో చదువుకునే రోజుల్లోనైతే సెలవుల్లోనైనా యింటి ముఖం చూడక తప్పేదిగాదు మురళీకృష్ణకు. పట్టణంలో ఉద్యోగమైన తర్వాత సెలవులతో బాటుగా యింటికి రాకపోకలు గూడా సన్నగిల్లిపోయాయి. కుమారుణ్ణి కలుసుకుని ముఖాముఖిగా మాట్లాడే అవకాశాలు తులసమ్మకు చాలా తక్కువ. అథవా మాట్లాడినా అతడిభాష తులసమ్మకేమర్థమౌతుంది గనుక ! చదువుకోసం బస్తీకి పంపిననాటి నుంచీ కుమారుడి భాష తన కర్థంకావడానికి ఆమెకు దుబాసీలు అవసరమౌతూ వచ్చారు. ఎక్స్కర్షను వెళ్ళాలి. అర్జంటుగా వంద రూపాయలు— అంటూ తంతిలా ఒకజాబువస్తే తులసమ్మకు వ్యాఖ్యానం కావలసి వచ్చేది— సువిశాలమైనది భారతదేశం.

వ

ంహాబలిపురంలో రాతి రథాలున్నాయి. హంపీలో శిథిలాలున్నాయి. హైదరాబాదులో సాలారుజంగు మ్యూజియం వుంది. అజంతాల్లో గుహామందిరాలున్నాయి. మనిషి బావిలో కప్పలా బ్రతికేం లాభం ? అలాంటి దృశ్యాలుచూచి పుట్టువును సార్థకం చేసుకోవాలి ? ఎక్స్‌కర్షనంటే విహారం. అలాంటి ప్రదేశాలకు వెళ్ళిరావడ మన్నమాట !— ఈ విధంగా కొనసాగే టీకా తాత్పర్యాలపై మళ్ళీ కొన్ని ప్రశ్నలు వుత్పన్న మయ్యేవి. రాతిరథాలంటే అవి ఎలా వుంటాయి ? సాలారుజంగు అనే ఆయన సాయిబా ? మేడలూ మిద్దెలూ చూడాలిగానీ శిథిలాలు చూడడ మేమిటి ? గుహల్లో చీకటిగదా, లోపలికి వెళ్ళడం ఎలా సాధ్యం ? దాని బ్రతుకు దానికి హాయిగానే గడిచిపోతుండగా యిప్పుడు బావిలోని కప్పకు వచ్చిన కష్టమేమిటి ?

తులసమ్మకు సమాధానం చెప్పుకోడంలో చెట్టునాటునుంచి నరుక్కురావడమే మేలనిపించేది— లక్షాధిపతుల బిడ్డలు,— జమీందార్ల అబ్బాయిలు కాలేజీలో చదువుకుంటారు. వాళ్ళకాలొకచోట నిలవదు. హమేషా తమాషాగా దేశాలపైన తిరిగిరావడం వాళ్ళ వ్యాసంగాల్లో ఒకటి. వాళ్ళతో కలిసి చదువుకుంటున్నాడు గనుక మురళీకృష్ణ కూడా నలుగురితో బాటు నారాయణా అనక తప్పదు— ఈ చిట్కా యింద్రజాలంలా పనిచేసేది తులసమ్మపైన ! గొప్పవాళ్ళ సాహచర్యంలో మెలగుతున్న తన కుమారుడు ఆ మాత్రం ఖర్చులకు వెనుదీయడం నా మోషీకదూ ! నూరు ఆరైనా, ఆరు నూరైనా అప్పోసప్పో చేసి తాను కుమారుడి పరువు నిలబెట్టుతుంది. ఆప్పేంచేస్తుంది ? తిరిగివచ్చి వాడు ఉద్యోగంలో చేరితే అప్పులు చప్పున ఎగిరిపోవూ !

ఇప్పుడు తులసమ్మ తెలుసుకో గోరుతున్నది— పెళ్ళిని గురించి మురళీకృష్ణ ఏర్పరచుకున్న అభిప్రాయం.

అదామెకు చూచాయగానైనా తెలిసివుండదా ? ఏమో తెలిసివుండకపోవచ్చు.

"అదేమిటమ్మా ! కష్టపడి చదివించి యింత వాణ్ణి చేశావు. అతడొక యింటివాడైతే పరమానందం కలిగేది నీకు ! నీ యిష్టమేమిటో చెప్పగూడదూ ?" అన్నాను.

"నాదేముంది నాయనా ! నన్ను ఊరు పొమ్మంటోంది. కాడు రమ్మంటోంది ఇంట్లో ఓ ముసలాయన వున్నాడు. ముగ్గురు కూతుళ్ళు కాపురాలు చేసుకుంటున్నారు. మేమెవ్వరమూ వాడిపెట్టు పోతలకైతే ఆశించడంలేదనుకో ! కానీ పండుగా పబ్బమూ జరిగినప్పుడైన వాడు ఇంటికి రావద్దూ ! రెండు మూడేళ్ళ కొక్కసారైనా యింటబుట్టిన ఆడబిడ్డలు ఇంత పసుపుకుంకుమకోసం ఆశించరూ! ఎవరో ఒక మహారాజు పదివేలో పాతికవేలోపోసి పెళ్ళిపీటల పైన్నుంచీ అలాగే లాక్కెళ్ళిపోయిన తర్వాత వాడు మనవాడని చెప్పుకోడానికైనా వీలుంటుందా బాబూ ?"

గడ్డు ప్రశ్నతోనే ఎదురైంది తులసమ్మ.

"చెప్పు నాయనా ! అంతడబ్బుపోసి అల్లుణ్ణి గడించుకున్న తర్వాత వాళ్ళకు అబ్బాయిపైన హక్కు ఏర్పడక పోతుందా ?"

ఎందుకేర్పడదు ? ఏర్పడేదే అది !

"బాబ్బాబూ ! నీకు పుణ్యముంటుంది. ఎలాగైనా వాడికి నువ్వు నచ్చచెప్పాలి. ఈ నాడు డబ్బుముఖం చూస్తే మమకారాలు నిలవ్వు. పుటుక్కున తెగిపోతాయి. ఆడుబిడ్డలు కన్నీళ్ళు పెట్టుకుంటారు. ముసలాయన కృంగిపోతాడు. 'అత్తా' అని ఆప్యాయంగా పిలిచి ఆకులో అన్నంపెట్టి దగ్గరగా కూర్చునే కోడలు దొరికితే చాలు నాకు !"

ఎవరు లేనప్పుడు వాళ్ళమాట మాట్లాడ్డమే మంచిది. "ఐతే ఓ పల్లెటూరి పిల్లను తీసుకొచ్చి నీ కుమారుడికి కట్టబెట్టాలనుకుంటున్నావటమ్మా ?" అని కాసేపు మురళీకృష్ణ పక్షాన్నే నిలబడటానికి ప్రయత్నించాను.

"ఎందుకూ ! పల్లెటూళ్ళల్లో మాత్రం చదువుకున్న అమ్మాయిలు లేరాబాబూ ! పల్లెయినా పట్నమయినా మన తాహతుకు తగిన సంబంధం మనకు చాలు. పెంచి పెద్దచేసిన దూడను అమ్ముకుంటే నాకు పదిరోజులు నిద్రపట్టదు. ఆ దూడ కలల్లోకి వస్తుంది. కొట్టంలో బోసిగా వున్న కట్టుకొయ్య కనిపిస్తే ప్రాణం ఉసూరుమంటుంది. నీకు చెప్పాలా నాయనా ! మమకారాల సంగతి నీకు తెలియదూ ?"

మండీలో పనివుండి వచ్చిందేమో "ఉండు నాయనా ! ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది తులసమ్మ.

చొక్కా చేతిని పైకి మడిచి ముంజేతి కంకణాన్ని ప్రదర్శించినట్టుగా క్రితంరోజు రాత్రి మాటల సందర్భంలో మురళీకృష్ణ వివాహంపైన తన స్వాభిప్రాయాన్ని సుస్పష్టం చేశాడు. అనతికాలంలో అదే విషయంపైన మధ్యవర్తిత్వం నెరపవలసి వస్తుందని అనుకోలేదు. తీరా రాయబారానికి పూనుకుంటే మురళీకృష్ణ వైఖరి ఎలావుంటుంది ?

అయిదు నిముషాల్లో తిరిగి వచ్చింది తులసమ్మ. "వెళ్ళొస్తాను బాబూ ! మరచిపోకుండా మురళితో మాట్లాడి వెళ్తావుగదూ ?" అంటూ తేలిగ్గావున్న గంపను తలపైకెత్తుకుంది.

తిరిగి వెళ్ళిపోతున్న వాలకాన్ని బట్టి చూస్తే దేనికోసం ఆమె మండీలవైపు వచ్చిందో ఆ కార్యం సానుకూలమైనట్టు లేదు.

ప్రశ్నించాను.

గోసంపదతో బాటుగా ఆ కుటుంబానికి రెండెకరాల పొలం గూడా ఉంది. కౌలు కివ్వగా పదిమూటల బెల్లం యిల్లు చేరింది. చెరకు బెల్లానికి గిరాకీలేని రోజులు. బండికి బాడుగ పెట్టి సరకును మండీకి తోలించుకోవలసి వచ్చింది.

"డబ్బివ్వటానికి మండీవాళ్ళు గడువు పెడుతున్నారటమ్మా ?" అడిగాను.

# వగపేటికి చల్లచిందినన్

"అబ్బే, వాళ్ళు నిక్కచ్చి మనుషులు బాబూ! గడువులు పెట్టే రకం కాదు. నాకేనా ఆ డబ్బుతో పనేముంది? బాండుకు వాయిదా పోతోందని ఓ పెద్దమనిషి పీకలపైన కూర్చుంటున్నాడు. దీన్ని తీసుకెళ్లి ఆయన కడ్డుపెడదామనుకున్నాను ......"

అనుకున్న దొకట్టైతే జరిగేది వేరొకటి. డబ్బుకోసం వెళ్లేసరికి మండీ ఆసామి తెల్లబోయి "ఇంకా ఏం డబ్బమ్మా! మొన్ననే మీ అబ్బాయి పట్టుకెళ్లాడే!" అన్నాడు.

"వాడి సంసారం. వాడేమైనా చేసుకోవచ్చు. ఐనా అవసరం తగలకపోతే వాడైనా ఆ డబ్బుతో ఏం చేసుకుంటాడు? పోనీలే నాయనా! ఈ సంగతి మాత్రం అడగొద్దు ...."

'అలాగేనమ్మా' అన్నాను.

దృక్పథంలోనుంచీ వైదొలగేదాకా ఆ వృద్ధురాలి వైపు నుంచీ చూపులు మరల్చుకోలేకపోయాను. చురకత్తి అంచుల్లా వచ్చి లోకంపైన విడిసిపోతున్న ఖరకరుని కిరణాల తీక్షణ స్పర్శకు ఆమె శరీరం అలవాటు పడిపోయింది. బుస్సున లేచి పాదాలపైన పేరుకునే బాటలోని బూడిద దుమ్ము మినహాగా ఆ పాదాలకు పాదరక్షలు లేవు. తలపైన గంప వినా ఆతపత్రం సున్న. దారిప్రక్కన ఆకులు రాల్చుకుని నీడ నివ్వడానికి మారాంచేసే చింతచెట్లు. అవైనా ఫర్లాంగుకు ఒకటి, రెండు మాత్రం. ఏ రక్షణా లేక శీతోష్ణస్థితుల కోపతాపా లన్నింటికీ నృత్యరంగమైపోయిన శరీరాన్ని ఈడ్చుకుంటూ ఎడారి ఎండల్లో మోయరాని బరువును మోస్తూ వెళ్తున్న లొట్టిపిట్టలా జీవనయాత్రాపథం వెంట సాగిపోతున్న తులశమ్మకు చలువ పందిరిలాంటి సుఖం ఎప్పు డెదురౌతుంది?

సాయంకాలం అయిదు గంటలకు సరాసరి ఆఫీసుకే వెళ్లి మురళీకృష్ణను కలుసుకున్నాను.

"ఊరికి వెళ్లలేదా! మరీ మంచిది. ఈరోజే ఓ కొత్త సినిమా వచ్చిందట! ఫస్టు షోకే వెళ్దాం" అన్నాడు మురళీకృష్ణ.

ఓవైపుగా వెళా లనుకున్న తర్వాత ఈ బండిని మరో వైపుగా మళ్లించడం దుస్తరం. ఒకవేళ మళ్లించినా మతిపోయినంత పనౌతుంది. మురళీకృష్ణను వెంబడించక తప్పింది గాదు.

సినిమా కొత్తదే. అల్లికలో కొత్త డిజైనుల్లా అక్కడక్కడా కొత్త సన్నివేశాలు ఎదురయ్యేమాట నిజమే! కానీ కథావస్తువులో ప్రత్యేకించి చెప్పుకోదగిన నూతనాంశ మేదీ లేదు. గుణం, రూపం, విద్య లాంటి వేవీ లేకపోయినా దండిగా కట్నాలు తీసుకొచ్చే సంబంధాన్ని నిర్ణయిస్తాడు తండ్రి. తన నిర్ణయానికి కట్టుబడకపోతే ఆస్తిలో ఓ చిల్లిగవ్వయినా కుమారుడికి దక్కదంటాడు. కట్నాన్ని తృణప్రాయంగా చూచి, తండ్రిగారి వైముఖ్యాన్ని సైతం భరించి, కపులవాభుణ్ణే, కాల దేశ వర్తమానాలను, శుక్రాచార్యుల శాపాన్ని ఎరిగిఉండి కూడా కోరికోరీ అపాయాన్నే కొనితెచ్చుకున్న బలిచక్రవర్తిమల్లే కథానాయకుడు ఆదర్శవివాహం చేసుకుంటాడు.

భుజంపైన చేయివేసి మురళీకృష్ణ ముఖంలోకి చూస్తూ "నిజ జీవితాలకు విరుద్ధంగా అల్లుకుపోతే సినిమా కథలు తయారవుతాయేమో!" అన్నాను.

"మన మిక్కడ కొచ్చిందెందుకు? సినిమా చూడ్డానికా! దీనికే నిజ జీవితానికి పాటా వేసి చూడ్డానికా! సినిమా ఎంజాయ్ చెయ్ మిత్రమా! మిగిలిన విషయాలు నీ కెందుకు?"

హోటల్లో భోజనంచేసి శరీరాలను గదిలోకి చేరవేసే సరికి పదకొండు గంటలు కావచ్చింది.

"ఒకటి రెండు మాట లున్నాయి మురళీ! చాలా ముఖ్యమైన విషయం" అన్నాను.

"మాటలా! ఇప్పుడా? అబ్బో నిద్ర, నిద్ర. ఇప్పుడు సాధ్యంకాదు" అన్నాడు మురళీకృష్ణ.

"సాధ్యమో అసాధ్యమో నేను చెప్పక తప్పదు. నువ్వు వినకా తప్పదు."

"ఇదేం ముప్పురా బాబూ! ఊఁ కానీయ్ మరి! తప్పుతుందా?"

"ఉదయం మండీల దగ్గర మీ అమ్మ కనిపించింది."

"కనిపించి?"

"ఎలాగైనా నీకు నచ్చచెప్పమని కోరింది ...."

"చెప్పు."

"క్రొత్తగా చెప్పేదేముంది! రాత్రి మన తర్జన భర్జనల్లో నలిగిన విషయమే!"

"నా సమాధానాన్ని అప్పుడే చెప్పినట్టు జ్ఞాపకం ..."

"ఆలోచించు మురళీ! తల్లి అభిప్రాయాన్ని త్రోసిరాజనటం న్యాయంకాదు."

"అందుకు రెడీమేడ్ సమాధానం ఉండనే ఉంది. పెళ్లి చేసుకోబోయేది నేను ...." ఆవులిస్తూ పరుపు పైకి ప్రాలిపోయాడు మురళి.

విస్తరించి చెబుతే మురళీకృష్ణ దారిలోకి రావచ్చునన్న ఆశావేశం కొడిగట్టిన దీపంలా ఇంకా ఏమూలో దాగి ఉంది. కానీ తల్లిని గురించి మురళీకృష్ణకు తెలియని విషయా లేమున్నాయి? తనకోసం ఆమె పడిన పాట్లన్నీ ఏకరువు పెట్టాను. ఆమె ఆశలను ఆశయాలను ప్రతిఘటించకుండా వీలైనంతలో ఓ సమన్వయ పద్ధతిని ఎన్నుకోడం భావ్యమన్నాను.

అస్మదీయుడి కంఠశోష జోలపాటలా పనిచేసిందేమో— మురళీకృష్ణ గురకపెట్ట సాగాడు.

తట్టి లేపి "నిద్రపోయావా మురళీ!" అన్నాను.

"నువ్వింకా మాట్లాడుతున్నావేమిటి? పడుకోవయ్యా బాబూ! కంటారా నిద్రపోతే కాశికి పోయినంత పుణ్యమట!" అన్నాడు మురళి.

* * * *

ఆరు మాసాల అనంతరం ఒకనాటి టపాలో ఆహ్వానం అందింది.

అదే ముహూర్తానికి ఒకానొక దగ్గరి బంధువుల యింట్లో శుభకార్యం తటస్థించింది. తుమ్మితే చాలు, ముక్కు వూడిపోతుం దనుకునే మనస్తత్వం వాళ్లది. ఆ శుభ కార్యానికి వెళ్లకపోతే కలకాలం మాటపడవలసి ఉంటుంది. మురళీకృష్ణ విషయంలో అలాంటి చిక్కు లేదు. అనివార్య కారణాలవల్ల పెళ్లికి రాలేకపోయానని ఓ కార్డుముక్క వ్రాసి పడేస్తే చాలు. ఆపనే చేశాను.

కానీ మురళీకృష్ణ పెళ్లికుమారుడైన వైనమూ, వైభోగమూ ఎలాంటివో తెలుసుకోవాలన్న కుతూహలం మాత్రం లోలోపల లేకపోలేదు. ఎలా తెలుస్తుంది? ఎవరికైనా వ్రాసి తెలుసుకుందామన్న కోరిక యింకా ఆచరణలోకి రానేలేదు. అంతదూరంనుంచీ రామభద్రం నా యింగితాన్ని ఎలాగో పసిగట్ట గలిగాడు. అతని దగ్గర నుంచీ సుదీర్ఘమైన ఉత్తరం వచ్చింది.

నేను పెళ్లికి గైర్ హాజరైనందుకు ఆశ్చర్యం ప్రకటించాడు రామభద్రం. మరు వాక్యంలో 'పోనీలే, పెళ్లి మాత్రం మేమేం బావుకున్నాము?' అంటూ అంతలోనే తన అభియోగాన్ని ఉపసంహరించుకున్నాడు.

పెళ్లికి వెళ్లి ఎవరైనా బావుకునేదేముంది? పెళ్లిళ్ల మూలంగా ఎవరికైనా లభ్యమయ్యేది ఒకటి రెండు పూటల తిండితో బాటుగా ఒక్కింత వినోదం. మరీ మహారాజులైతే ఆ తిండీ, ఆ వినోదం కూడా వాళ్ల అంతస్తుకు తగినంత హుందాగా ఉండేమాట నిజం. లేనిపోని విలువలకు పరిగణన యిచ్చి మురళీకృష్ణ నామర్దా సంబంధాలకు ఒప్పుకోడని నాకు బాగా తెలుసు. మరైతే రామభద్రం అసంతృప్తికి కారణ మేమై ఉంటుంది?

రామభద్రం లేఖ తాలూకు రెండో పేజీలో అందుకు ప్రత్యుత్తరం లభించింది.

".... ఒక్కొక్క పంక్తికీ రెండువందల మందికి చొప్పున వడ్డించగా, మధ్యాహ్న భోజనాలు పూర్తి కావచ్చే సరికి ప్రొద్దు బాగా వాటారిపోయిందంటే అక్కడ చేరిన జనసందోహం ఏపాటిదో వూహించుకోవచ్చు. ఆడపెళ్లివారి బంధు బలగాన్ని గురించి ప్రత్యేకించి చెప్పడం అవసరం. మనుషుల సంగతలా ఉండగా వాళ్లు తమ వెంట తెచ్చుకున్న పెట్టెలు, పరుపులు, బుట్టలు సంచుల్లాంటి సామానులతో విడిదిలోని గదులన్నీ నిండిపోయాయి. మిగిలింది హాలు మాత్రం. హాల్లో ఇసుకవేసినా రాలనంత జనం. ఎవరెటుగుండా యింకా లోపలికి వస్తున్న బంధువులకు తావు చేయడం కోసం గొంతు చించుకుంటున్న పెళ్లి పెద్దల హంగామాను కించపరుస్తూ సంగీత దేవతపైన నిర్దాక్షిణ్యంగా కసిదీర్చుకుంటున్న లౌడ్‌స్పీకర్లు. మధ్యలో అందరినీ ఆకర్షించే విధంగా సింగారాలు తీర్చిదిద్దుకున్న పెళ్లి మండపం. ఆ మండపానికే కొన్ని వందల రూపాయలు ఖర్చయినట్టు వినికిడి. అంతా బాగానే ఉంది. కాని వివాహానికంతా కీలకప్రాయమైన అతి ముఖ్య ఘట్టమేదైతే ఉందో అక్కడే వెలితి కనిపించింది. కంకణధారణ, కాశీయాత్ర, నలుగులు నాగవల్లి లాంటి ఆచారాలేవీ లేవు. ఆఖరుకు ఎవరైనా అయిదు నిమిషాలపాటు కళ్లు మూసుకుని పరధ్యానంలో పడిఉంటే, వాళ్లు కళ్లు తెరిచేసరికి పెళ్లి జరిగిపోయిందన్న వర్తమానం తెలిసి ఉంటుంది. ఇదివరకే నిర్ణీతమైన కార్యక్రమానికి దారిలో అడ్డుతగిలినవారి సంతృప్తికోసం కారు దిగి ఆదరా బాదరాగా ఒకటి రెండు మంచి మాటలు పలికిపోతున్న నాయకోత్తముల్లా వధూవరులు ముచ్చటగా కొద్ది నిముషాలు మాత్రమే పెళ్లి పందిరిలో కనిపించారు. కనిపించారట—అనడం భావ్యం. ఎందుకంటే తమ పార్టీకి చెందని నాయకుడి 'ఉపన్యాసాన్ని దూర దూరంగా నిల్చుని వింటున్న రాజకీయవాదుల్లా పెళ్లికుమారుడి మిత్రులు లోపల తావులేక పోవటంతో వసారాలోనూ, వీధుల్లోనూ నిల్చోవలసి వచ్చింది.

తలిసెట్టి రామారావుగారంటూ ఓ వ్యంగ్య చిత్రకారులుండేవారు మునుపు. పెళ్లిళ్లలో వ్యక్తుల హోదాలను గురించి ఆయన ఓ చిత్రం వేశారు. ఆ చిత్రంలో పెళ్లి కుమారుడి తల్లిదండ్రులు గలివరు బ్రాబ్డింగుకు నాగు దేశంలో కనుపించిన మహాకాయుల ఆకారంలోనూ, పెళ్లి కుమార్తె తల్లిదండ్రులు అదే యాత్రీకుడికి మరొక దేశంలో ఎదురైన లిల్లిపుట్టుల లాగానూ గోచరిస్తారు. సజీవులై ఉండి మురళీకృష్ణ పెళ్లికి గనుక విచ్చేసి ఉండినట్టయితే రామారావుగారు ఆశ్చర్యాతిరేకంతో నిర్ఘాంతపోయి ఉండేవారు. పెద్ద ఎత్తున మహాసభలు నిర్వహిస్తున్న ఆహ్వానసంఘ అధ్యక్ష ఉపాధ్యక్షులకు మల్లే వధువు తల్లి దండ్రులు దర్పంగా మాట్లాడుతూ, హడావిడిగా తిరిగేస్తూ విడిదిలో ఎక్కడ బడితే అక్కడ కనిపించారు. వరుడి తల్లిదండ్రు లెక్కడవున్న ప్రశ్న నిరుత్తరంగా ఉండిపోయింది. వాళ్లు ఏమూల ఒదుగుళ్లు పోయారో తెలియదు ...."

నవ్వొచ్చింది నాకు. తమవల్ల ఏం తప్పిదం జరిగిందని వాళ్లలా ఒదుగుళ్లుపోయి ఉంటారు? కుమారుడికి విద్యాబుద్ధులు చెప్పించడమే తల్లిదండ్రుల తప్పిద మనుకోడానికి మనసు అంగీకరించదు. కుమారుడికి సంఘంలో ఓ ఉన్నత స్థానం కల్పించి తా మక్కడికి చేరుకోలేక పోవడం వాళ్ల తప్పిదమైతే కావచ్చు!

ఉన్నత విద్యాలయాల్లోనూ, కళాశాలల్లోనూ చదువుకుంటున్న తమ కుర్రవాళ్లకు జాబులు వ్రాసిపెట్టమనీ మని

యార్డరు ఫారాలు నింపమనీ యింటికి వచ్చే తల్లిదండ్రుల వైపు చూస్తుంటే విస్మయం కలిగేది నాకు! వాళ్ల ముఖాల్లో ఎందుకింత ఆనందం తాండవిస్తోంది ? వీళ్ల కేపాటి న్యాయం జరుగుతుంది ? అనాగతంలోకి తొంగిచూసే దూరదృష్టినే గనుక భగవంతుడు ప్రసాదించి ఉన్నట్టయితే, వీళ్లు తమ బిడ్డలను ఊరి పొలిమేరలైనా దాటించేవారు కారేమో ! ఇలాంటి సందేహాలు కలిగినప్పుడల్లా స్మృతిపథంలో మెదిలే వాడు మురళీకృష్ణ. ఒకటి రెండుసార్లు పట్టణానికి వెళ్లినా అతణ్ణి కలుసుకోడం కుదిరింది గాదు. పెళ్లయిన కొత్తలో అత్తగారింట కొన్నినాళ్లు హాయిగా 'అల్లరికం'' గడిపినవాడై, ఆ తరువాత అతడు సతీసమేతంగా కొంత దేశం తిరిగి వచ్చాడన్న ఉదంతం మాత్రం మిత్రుల మూలంగా తెలిసింది.

ఓరోజు సాయంకాలం పట్టణంలో బస్సు దిగాను. ఆఫీసునుంచీ యింటికి వెళ్తూ ఎట్టఎదుట తారసిల్లాడు రామభద్రం. రాజకీయ, సాంఘిక, సాహిత్యాద్యనేక విషయాల్లో కొత్త పరిణామాలను గురించి తెలియజెప్పడానికి వీలుగా నాలాంటి పల్లెటూరి వ్యక్తి ఒకడు ఎదురైన రోజు రామభద్రానికి పర్వదినం. మిగిలిన పరిణామాల మాట కేమిగానీ, మురళీకృష్ణ కథలో నూతనాంశాలను వినడానికి నేను సైతం శ్రద్ధాళువునుగా లేకపోలేదు.

''విశేషాలు చాలా ఉన్నాయి'' అన్నాడు రామభద్రం. ఆ విశేషాల కన్నింటికీ అప్పటి కప్పుడే ఓ ఉపక్రమణిక తయారు చేశాడు.—'' కొండనాలుకకు మందు వేస్తే అసలు నాలికే ఊడిపోవడానికి ఓ తార్కాణం చెప్పగలరా మీరు ?''

''వినేవాడికి చెప్పేవాడు లోకువంటారు. నేను చెప్పను. వింటాను'' అన్నాను.

రామభద్రం గొల్లున నవ్వేశాడు. ''ఐతే నేనే చెబుతాను. ఇంతకాలానికి కుమారుడు తల్లి కష్టాన్ని గుర్తించాడు ....''

సామెతకూ దృష్టాంతానికి బొత్తిగా పొత్తు కుదరడం లేదు !

''పోనీ, వివరిస్తాను'' అన్నాడు రామభద్రం. ప్రతి రోజూ పల్లెకూ పట్నానికీ తిరగడంవల్ల ఆరోగ్యం చెడిపోతుందట ! పైగా వృద్ధాప్యమాయె ! తల్లిని యింటిదగ్గరే వుండి పొమ్మన్నాడు కుమారుడు....''

''ఇందులో అసలు నాలుక వూడిపోవడానికి ఆస్కారం లేదే !''

''అప్పులెవరు తీరుస్తారు ?''

''అప్పులేం చేస్తాయి . ఆస్తిని ఆవరించగల వంతే గదా ?''

''ఆ తెంపు వాళ్ళకుండద్దూ! చచ్చి షున్నమైనా సరే, కుమారుడికి ఆ ఆస్తి దక్కించి వెళ్లాలన్నది వాళ్ళ తాపత్రయమైతే ?''

''అప్పులు పెరగ్గూడదు. ఆస్తులు తరగ్గూడదు. పాము బడితా సామెతలా వుంది. ఈ చిక్కునెలా విప్పడం ?''

''చిక్కు విప్పినంత పుణ్యం ! అప్పుల మాట దేవుడెరుగు ! పట్నానికి రాకపోతే పల్లెటూళ్లో ఆ కుటుంబానికి జరుగుబాటెలాగో ఆలోచించరేమీరు !''

అదీ ఆలోచించవలసిన సంగతే !

ఆలోచనకు అడ్డుతగిలాడు రామభద్రం—
ముందు 'కాకరకాయ' అనీ చదువుకున్న తర్వాత 'కరకరకాయ' అన్న వాడిలా వుంది మీ వ్యవహారం ! ఏమిటండీ మీరుమరీనూ...'' రామభద్రం విసుక్కుంటున్నాడు.

నా అజ్ఞతను నేను ఏవిధంగా వ్యక్తం చేశానో తెలియడం లేదు !

''నిజమే అప్పుడే నగరప్రవేశం చేసిన 'జింతోడు' అనేక విషయాలకు మన్నించవలసి వుంటుంది'' అన్నాను.

క్షమాపణ కోరుకున్నట్టుగా తటాలున నా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు రామభద్రం— ''ఎంతమాట ఎంత మాట ! ఇచ్చిన క్లూల సాయంతో మీరు అసలు సంగతి ఆకళించుకోగలరనుకున్నాను....''

''ఎదుటి వారి తెలివి తేటలను గురించి గొప్పగా అంచనా వేయడానికి పూనుకుంటే యిక లోకంలో ఎవరి పనులు వాళ్ళు చేసుకోడం దుర్లభం ! రాజకీయోపన్యాసాలకు తరచుగా వెళ్లేవారు మీరు ! మీకు తెలియని విషయమేమీగాదు....''

''చంపేశారండీ మేష్టారుగారూ ; ఇక పది నిముషాలు నేను తేరుకోలేను.....''

బుజ్జగించి రహస్యమంటూ ఏదైనావుంటే చెప్పమన్నాను.

''మీరైనా వూహించలేనిదేమీగాదు. పట్టణానికి తిరగడంవల్ల ఆరోగ్యం చెడిపోతుం దనుకోడం మురళీకృష్ణ స్వభావానికి విరుద్ధం ! మీదు మిక్కిలి అందువల్లనే ముసలావిడ ఆరోగ్యం బాగున్నదని చెప్పగలగడం అతడితత్వం. పోగా వార్ధక్యమనేది హఠాత్తుగా యిటీవల మూడు మాసాలనుంచీ ప్రారంభమైన దేమీగాదు. అప్పులు పెరగనిమ్మనిగానీ, ఆస్తి తరగనిమ్మనిగానీ అనుకునే అవివేకిగూడాకాడు మురళీకృష్ణ. ఈ పై బురఖాలన్నీ తీసిచూస్తే—వాస్తవం కనిపిస్తుంది.''

''అదే అదే— అదే నాకు కావలసింది'' అన్నాను.

'' ఊళ్లో శ్రీమతికి దండిగా బంధువులున్నారు. ఫలానా వ్యక్తి పాలు పెరుగూ అమ్ముకుంటోందని తెలిస్తే అవమానం ఎవరికి ?''

బదులుకు బదులు ! జోడుగుండ్ల తుపాకీని ఆయువు పట్టుకు గురిపెట్టి ఠాఠమని కాల్చినంత పనిచేశాడు రామభద్రం. ఈ దెబ్బనుంచీ కోలుకోడానికి పదినిముషాలు చాలవు.

పట్టుగగ్రతతో నరాలను బిగ్గరగా లాగిపట్టుకున్నట్టుగా బుద్ధిస్తబ్ధమైపోయి, మనసుమంచు గడ్డలా బిగుసుకుపోయి, కాలదేశ వర్తమానాల స్పృహలేక మరమనిషిలా నడుస్తున్నానేమో, లారీలక్రింద సాగిలపడకుండా సైకిళ్ళకు ఢీ యివ్వకుండా రామభద్రం రోడ్డు ప్రమాదాలనుంచీ నన్ను రక్షించాడు.

“అన్నట్టు ఈ మధ్య మీరు మురళీకృష్ణను కలుసుకో లేదా మేష్టారుగారూ ?”

“నేనా! మురళీ కృష్ణనా!” శూన్యంలోనుంచీ ప్రయాణం చేసివచ్చి వాతావరణంలోపడి ఊపిరి పీల్చుకోడానికి ప్రయత్నిస్తున్న ప్రాణిలా గిలగిలలాడి పోతున్నట్టున్న నా వైఖరి రామభద్రానికి ఆశ్చర్యం కలిగించి వుంటుంది. కారణం చెప్పలేను. ఎందుకోగానీ నా అంతరంగంలోని కల్లోలాన్ని ఎదుటి మనిషి గుర్తించడం నాకిష్టంలేదు.

“వీలైతే ఈసారి కలుసుకోవాలి. కానీ అంతకంటే తొందరైన పనులున్నాయి. బజార్లో కొన్ని వస్తువులు కొనుక్కోవాలి. ఉదయం ఆరుగంటలరైల్లో ఓ మిత్రుడు తిరుపతి నుంచీ హైదరాబాదు వెళ్తున్నాడు. ఏదో మాట్లాడాలని స్టేషనుకువచ్చి కలుసుకోమన్నాడు. ఆ మాటలేవోవిని, ఆ పైన తరువాత పెదకాపుగారికోసం సర్కారెరువు సంగతి వాకబు చేయాలి. ఓ కుర్రవాడి స్కాలర్‌షిప్పు కోసం తాశీల్దారుగారిని సంధించాలి....”

వెళ్తొస్తానని చెప్పి ముందుకు సాగాను. పది బారల దూరం నడిచానో లేదో వెనుకవైపునుంచీ మళ్ళీ పిలుపు వినిపించింది.

“నా నోట్లో నువ్వు గింజయినా నానదండీ మేష్టారుగారూ! మీపాటుకు మిమ్మల్ని వదిలిపెట్టవచ్చుగదా! ఉఁహూ, నా మనసొప్పదు....” మరీ దగ్గరగా వచ్చి ఈ సారి నిజంగానే ఏదో రహస్యం చెబుతున్నట్టుగా కొనసాగించాడు రామభద్రం “ఇటుచూస్తే కుమారుడి ఆజ్ఞ. అటుచూస్తే సంసారం జరగదు. నుయ్యికీ గొయ్యికీమధ్య ముసలావిడ ఏం చేస్తుందో తెలుసా మేష్టారూ! బహుశా యిది నా కొక్కడికి మాత్రమే తెలిసిన రహస్యం. ఒకటి రెండు గంటలు ముందుగానే యింటిదగ్గర నిద్రలేస్తుంది. వచ్చి యథాప్రకారంగా వాడుకలవాళ్ళకు చల్ల పోసి, సూర్యోదయం కాకముందే తిరుగుదారి పడుతుంది.

* * *

ఆరోజు రాత్రి నాకు తిన్నగా నిద్ర పట్టినట్టు జ్ఞాపకం లేదు. మానవరక్తం రుచి మరిగిన మశకాలకు మత్కుణాలకు ఆటపట్టయిన చోట ఆశ్రమం లభించింది. పీడ కలలు వెన్నంటిన కలత నిద్రలో ఆ గదిలోనే పడుకున్న మిత్రుడి గురక రకరకాల శబ్ద విన్యాసంతో అడవి మెకాల అరుపుల్లా వినిపించింది. దారితప్పి నడవమనే దోషం నుంచీ మానవుడే వైదొలగలేనప్పుడు అతడిచేత నిర్మించబడిన యంత్రాలకు మాత్రం స్వధర్మ పరాయణత్వం ఎక్కడినుంచీ వస్తుందని అపహాస్యం చేసినట్టుగా సరిగ్గా అయిదింటికే లేపగల దమకున్న అలారం గడియారం గూడా అరగంట ఆలస్యం చేసింది. ఆలస్యమైంది గనుక సైకిలు తీసుకెళ్లమని సలహా యిచ్చాడు మిత్రుడు. చలికాలపు ఉదయం. మంచు ముమ్మరంగా ఉంది. ఉండి ఉండీ వినిపిస్తున్న మునిసిపాలిటీవారి పాల సైకిళ్ల హారన్లను మినహాయిస్తే నగరమంతటా నిశ్శబ్దం తాండవిస్తోంది. రాజవీథినే శరణ్య మనుకుంటే సకాలంలో స్టేషనుకు చేరుకోలేక పోవచ్చు. త్వరగా గమ్యస్థానానికి వెళ్లి పడాలన్న తొందరలో సందు గొందుల అడ్డదారినే ఎన్నుకున్నాను. నగరం యింకా నిద్రమేలుకోలేదు గనుక వీధులన్నీ నిర్మానుష్యంగానే ఉండగలవన్న ధీమాతో రివ్వున వెళ్లిపోతోంది సైకిలు. ఉన్నట్టుండి ఒకచోట మలుపు తిరగవలసి వచ్చింది. మలుపులో మనిషే అడ్డు రావడం జరిగిందో, లేక సైకిలే వెళ్లి మనిషిపైన బడిందో చెప్పలేను. తటాలున సైకిలు దిగేశాను. క్రింద పడిపోబోయి గోడ ఒకటి ఆసరాగా దొరకడంతో దాని కానుకొని నిల్చున్న కృశీభూత శరీరం ఒకటి ఆ మసక చీకటిలో దృగ్గోచరమైంది. మనిషికి ముప్పు వాటిల్లని మాట నిజమే! కానీ తలపైని గంప ? అది భూపతనమైంది. కుండలు పెంకులై చెల్లాచెదరై పోయాయి. నేలపాలైన మజ్జిగ నున్నటి గారపైన దీనంగా జారిపోతోంది.

మన్నించమని అర్థించడానికి మాటలు స్ఫురించలేదని చెప్పను. అలాంటి మాటలు భాషలో లేకపోవచ్చు.

అదృష్టవంతులు ఆనందంగా వైమరచి నిద్రించే ఆ ప్రశాంత ఉషఃకాలంలో, ముసలావిడ కళ్లల్లో కన్నీళ్లు నిలిచాయి. ఆ కన్నీటిలోనుంచే ఆమె నన్ను పోల్చుకో గలిగింది.

పోల్చుకున్న మరుక్షణంలో ఎండుటాకుల్లాంటి పెదవులు కంపించాయి.

“పోనీలే నాయనా! ఇది నాకు దక్కాలని లేదు.”

# 'ద్విపద' గణములు



**శ్రీ సంపత్కుమార**

ఆంధ్రపత్రిక శోభకృత్—ఉగాది సంచికలో శ్రీ వంతరాం రామకృష్ణారావుగారి 'బసవ పురాణ కావ్యభాషాఛ్ఛందో విశేషములు' అన్న వ్యాసము ప్రచురింప బడినది. అందులో బసవ పురాణ మందలి ఛందో విశేషముల సూచించుచు—"నగణస గురువుల నింద్ర గణములుగాను, గగసగణములను సూర్య గణములుగాను అక్కరలలో వాడుట కలదని విన్నకోట పెద్దన వాక్యమువల్ల తెలియుచున్నది. సోమనాథుడు వీటిని ద్విపదలో ప్రవేశపెట్టెను." అని యున్నది.

నగణస గురువుల నింద్రగణములుగా, గగ సగణములను సూర్య గణములుగా ద్విపదలో సోమనాథుడు ప్రయోగించుట అలాక్షణికముగా నీవాడు భావింపబడుచున్నది. ఆ యుద్దేశ్యముతోడనే అట్టి ప్రయోగము సోమనాథుని ఛందో విశేషముగా కూడా చెప్పబడుచున్నది. కాని పరిశీలింపగా నిట్టి ప్రయోగము లాక్షణిక సమ్మతమే యని స్పష్టము కాగలదు.

అట్టి ప్రయోగ మెట్లు లాక్షణిక సమ్మతమో తెలిసి కొనుటకు ముందు సూర్యేంద్ర చంద్రగణముల విషయమున లాక్షణికులలో గల మత భేదమును తెలిసికొనవలసి యుండును.

కావ్యాలంకార చూడామణి కర్తయగు విన్నకోట పెద్దన యొక్కయు, తత్పూర్వుడగు కవిజనాశ్రయ కర్త యొక్కయు సూర్యేంద్ర చంద్ర గణములకన్న అర్వాచీనులగు అనంతాదుల సూర్యేంద్ర చంద్రగణములు భిన్నములు. రెండు—మూడు—నాల్గు గురువులను ప్రస్తరించగా నేర్పడు గణములు వరుసగా నాల్గు—ఎనిమిది—పదునారు. ఈ మూడు వర్గములందును లఘువుతో మొదలగు గణముల మొదట అదనముగా ఒక లఘువు చేర్చవలెను. అప్పు డేర్పడిన మూడు వర్గముల గణములకు వరుసగా సూర్య—ఇంద్ర—చంద్ర గణములని పేర్లు. ఈ విషయమే.

"వినుతద్విత్రి చతుర్గురు
జనిత గణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
చను నక్కర జాతుల కె
ల్లను నాదిమ (లఘువు) మొదల లఘువిడ వలయున్"

అని కవిజనాశ్రయమం (పరిష్కృతి—జాతి. 24) నందును.

"ఓలి రెండు మూడు నాలుగు గురువులు
నైన గణములిన సురాధిపేం[illegible]
గణము లక్కరోపకరణంబులవి యాది
లఘు గణంబు మొదల లఘువు నిలువ."

అని కావ్యాలంకార చూడామణి (వేదంవారి ప్రతి 8—51) యందును చెప్పబడినది. అనగా క. జ, కా. చూ. కర్తల మతమున సూర్య గణములు నాలు, ఇంద్ర గణము లెనిమిది, చంద్ర గణములు పదునారు.

ఇక అనంతాదుల మతమున గూడ నీ గణ నిర్మాణ మిట్లే. కాని ప్రతి వర్గమునందును మొదటి రెండేసి గణములను—అనగా, సూర్యగణముల నుండి గగ—నగణములను ఇంద్ర గణముల నుండి మ—నగ గణములను, చంద్ర గణముల నుండి మగ—నగగ గణములను—తొలగించగా వరుసగా మిగిలిన 2—6—14 గణములు గల వర్గములకే సూర్య—ఇంద్ర—చంద్ర గణములని పేరు. దీనివలన క. జ; కా. చూ. కర్తల మతమున సూర్య గణములగు గగ—న గణములు, ఇంద్ర గణములగు మ—నగ గణములు, చంద్రగణములగు మగ—నగగ గణములు అనంతాదుల మతమున సూర్య—ఇంద్ర చంద్ర గణములు కావు.

ఈ భేద మిట్లుండగా మరొక విషయము గమనించ వలసి యున్నది. క. జ; కా. చూ. కర్తల సూర్యేంద్ర చంద్ర గణములు దేశీయ పద్యములం దన్నింటను ప్రయోగించరాదు. అనంతాదు లవిమాత్రము దేశీయములగు పద్యము లన్నింట ప్రయోగించవచ్చును.

దేశీయ పద్యములను క. జ; కా. చూ. కర్తలు అక్కర జాతి పద్యములనియు, తదితర పద్యము లనియు రెండు భాగములుగా విభజించినట్లు కన్పించును. వారి మతమున వారు పేర్కొన్న సూర్యేంద్ర చంద్రగణములు అక్కర జాతి పద్యములందే ఉపయోగించవలసి యుండును. ఈ విషయమే 'అక్కరజాతుల కెల్లను'—అక్కరజాతికి చెందిన పద్యము లన్నింట—అని పూర్వోదాహృత క. జ. పద్యమందు చెప్పబడినది. కా. చూ. యందు 'అక్కరోపకరణంబులు' అని సామాన్యముగా అక్కర యొక్కటే పేర్కొనబడినను క. జ. యందు వలెనే అక్కర జాతికి చెందిన పద్యము లన్నింటి కుపకరించునవి యనియే భావించవలసి యుండును.

అక్కరజాతికి చెందిన పద్యము లేవి యున్నది స్పష్టముగా క. జ; కా. చూ. కర్తలు పేర్కొనలేదు. కాని

సూర్యేంద్ర చంద్రగణముల పేరుల నుపయోగించి లక్షణము చెప్పబడిన పద్యము లన్నియు అక్కరజాతి పద్యములుగా భావించవలెను. అయిదు విధములయిన అక్కరలు, ద్విపద త్రిపద, షట్పద అనునవి అక్కరజాతికి చెందిన పద్యములు. ఈ ఎనిమిది పద్యములకు లక్షణము చెప్పునప్పుడు మాత్రమే కా. చూ. యందు సూర్యేంద్ర చంద్రగణముల పేర్లు గైకొనబడినవి. కావున ఇవియే అక్కరజాతి పద్యము లనియు, వీటి యందే సూర్యేంద్ర చంద్రగణములు (స్వమతము ననుసరించి వవి) ప్రయోగించవలెననియు స్పష్టము. క. జ. ముద్రిత ప్రతియందు అక్కరజాతీ తరములగు సీసాదుల లక్షణము చెప్పునప్పుడు సూర్యేంద్ర నామములు గ్రహించినట్లు ముద్రితమయి యున్నది. మరియు గల—న గణములను మాత్రమే సూర్య గణములుగా, నల—నగ—సల—భ—ర—త లను మాత్రమే ఇంద్ర గణములుగా నిర్ణయించు పద్య మొకటి (సంజ్ఞ. 22) క. జ. యం దున్నది. కాని పూర్వ పరములను సందర్భవంతముగా పరిశీలించినచో నివి యప పాఠము లనియు ప్రక్షిప్తము లనియు స్పష్టమగును. ఈ విషయ మన్యత్ర వివరింపబడును. కావున క. జ; కా. చూ. కర్త లిరువురి మత మొక్కటియే యగుచున్నది.

అక్కర జాతీతర పద్యములకు లక్షణము చెప్పునప్పుడు రెండు విధములయిన గణ వర్గములను క. జ; కా. చూ. కర్తలు పేర్కొనినారు. 1. నలనామక గణములు—అనగా, నల—నగ—సల—భ—ర—త గణములు. 2. నహములు—. అనగా గలము—నగణము. కా. చూ. కర్త అక్కర జాతీతరములగు సీసాదులకీ పేర్లను నుపయోగించే లక్షణము చెప్పినాడు. (క. జ. యందలి ముద్రితములగు నీ సందర్భ మందలి పాఠములు సరియైనవి గావు) అనంతాదుల మతమున నీ నలనామక గణములే ఇంద్ర గణములు. నహములే సూర్య గణములు. (చంద్ర గణములకు అక్కర జాతీతర పద్యములందు ప్రయోగములేదు గాన వాటికి సంబంధించిన గణములు కొన్నింటికి క. జ., కా. చూ. కర్తలు మరొక పేరు పెట్టలేదు.) దీని వలన అనంతాదులు నలనామక గణములకే, నహములని సూర్యేంద్ర గణములని పేరుపెట్టి దేశీయములగు సర్వ పద్యములందు ప్రయోగించవలెనని భావించుట క. జ; కా. చూ. కర్తల మతమునకు విరుద్ధము. క. జ; కా. చూ. కర్తల మత మందలి సూర్యేంద్ర చంద్ర గణములు అక్కరజాతి పద్యము లందే ప్రయోగించవలెను. సీసాదులందు ప్రయోగింప బడునవి నలనామకములు, నహములే గాని, సూర్యేంద్ర గణములు కావు.

ద్విపద అక్కరజాతికి చెందిన పద్యము. కావున అందు సోమనాథుడు ము—నగ (ఇంద్ర), గగ—స. (సూర్య) గణముల నుపయోగించుట క. జ, కా. చూ. కర్తలకు సమ్మతమే. కావున లాక్షణిక సమ్మతమే. ప్రస్తుతము సూర్యేంద్ర చంద్ర గణ విషయమున అనంతాదుల మతము వ్యవహారమం దున్నది. ఈ మతము ననుసరించి పూర్వుల రచనలు చూడరాదు. క. జ; కా. చూ. కర్తల మతము ననుసరించినచో నన్నయగారి మధ్యాక్కరలందు భావింపబడు గణభంగము చాలావరకు తొలగును. సోమనాథుని ద్విపదయందు భావింపబడు గణభంగము పూర్తిగా తొలగును. అవి లాక్షణిక సమ్మతములే యగును. అనంతాదులకన్న పూర్వుల విషయమున వారి మతము ప్రమాణము కాదుగదా.

మరొక విషయము. ద్విపదను అక్కరజాతి పద్యముగా చెప్పిన క. జ; కా. చూ. కర్తలు ద్విపద యొక్క రెట్టింపుచే నేర్పడిన తరువోజను అక్కరజాతి పద్యముగా భావించకుండుటకు కారణము స్పష్టము గాదు. తరువోజకు నలనామక, నహ పేర్ల నుపయోగించియే లక్షణము చెప్పబడినది. (క. జ. యందు 'నలనామ గణము లిన గణంబుతోడ .... ' అని తరువోజ లక్షణ మున్నది. ఇది సరియైన పాఠముగాదు. 'నలనామ గణములు నగణంబుతోడ .... ' అని యుండవలెను. కా. చూ. యందు 'నలనామకంబులు నగణాంతములుగ .... ' అని యున్నది.) అయితే ద్విపదకు రెట్టింపే అయినను తరువోజ యందు క. జ; కా. చూ. కర్తల మత మందలి సూర్యేంద్ర గణ ప్రయోగము కన్పించక యుండి యుండును. లక్ష్యము లేకుండుటచేతనే వారు దానిని అక్కర జాతీతర పద్యము లందు చేర్చియుందురని భావించుట సమంజసము.

---

మ. మొదలం జేసిన వారి ధర్మములు నిర్మూలంబుగాఁ జేసి, దు
ర్మదులై యిప్పుడు వారి ధర్మము లోనర్పం దమ్ముదైవంబున
వ్వాదే, రానున్న దురాత్ములెల్ల దమత్రోవం బోవరే, యేలచే
సెదరో వీరు దలంచి చూడ కథముల్ శ్రీ కాళహస్తీశ్వరా !

# సద్గమయంలో



★

**సతీశ్**

*(గత సంచిక తరువాయి)*

ఆమె వెళ్ళిపోయిన తర్వాత అతనికి అనిపించింది. తను మొదటినుంచీ ఆమెతో గౌరవహీనంగానే వ్యవహరించాడు. సముదాచారం విస్మరించినట్లు మాట్లాడాడు. ఆమె వైపు మింగివేసేట్లు చూశాడు తనకి తెలియకుండానే. మనియార్డరు రసీదు ఇవ్వటానికి వచ్చినప్పుడు కటువుగా మాట్లాడాడు. ఆమె ప్రేమను గురించి, బాధ్యత గురించీ తర్క వితర్కాలతో వాటిని కాస్త చీల్చి, ఆమెని అవమానించి పంపాడు. వెళ్లేటప్పుడు తల ఎత్తి తనవైపు, ఇదివరకు చూసేటంత లాలనగా చూసి వెళ్ళటానికి గూడా అవకాశం లేనంత కటువుగా ప్రవర్తించాడు.

ఆమె గూడా తనతో పరిచయం కల్పించుకోవటం, తన కోసం రావటం తనతో చనువుగా ఉండి మనస్సువిప్పి మాట్లాడటం, ఇవన్నీ తనలాగే వ్యధితమై, క్షుభితమై ఉన్న మనస్సుని తేలిక పరుచుకోవటానికేమో. అట్లా అయితే తన కేదో ఆమె మీద అధికారం ఉన్నట్లు, అధికారం కోరుతున్నట్లు లాయరు ప్రశ్నలన్నీ వేశాడు. తనలాగా బాధ్యతకోసం బ్రతుకుతున్నవ్యక్తి గనుక, తనతో సమానంగాఉన్న ఏకీభావాన్ని పురస్కరించుకొని తాదాత్మ్యత కోరుతూ ఆమెని వ్యథ పెట్టాడు.

ఆమెతో పరిచయం, మిత్రత్వం, సాన్నిహిత్యం తనలో నించి, తనకి తెలియకుండానే బైటికి పోతున్న మానవత్వాన్ని కట్టగట్టి, దానిస్థానే ఆక్రమించిన అమానుషపు స్థాయికి రానివ్వకుండా చేసింది. ఆ విషయం తనకు రూఢిగా తెలుసు. లేకపోతే తను ఏం చేసేవాడో, ఏం అత్యాచారంచేసి, తన కుటుంబానికి అప్రతిష్ట తెచ్చేవాడో గూడా తెలియదు. తనకు అంత సహాయం చేసిన, హృదయ వేదనని గుప్త పరుచుకోలేని అబలని, తనమీద విశ్వాసంతోఉండే ఆమె హృదయం తరిచి, మధించటానికి ప్రయత్నం చేశాడు. తనూ గోపాలరావులు చేసే పనే చేశాడు. తన బాధ్యతని ప్రేమించే నిర్మలను, బాధ్యతాజ్ఞానంగల తనను ప్రేమిస్తున్నదేమోనని అనుకొని, ఆ ప్రేమ నిర్ధారణ చేసుకోవటానికి ఏమో గూడా తెలియకుండా ఆమె హృదయం మధించి వ్యథితం చేశాడు.

తనలో ఈ మార్పు ఎందుకు వచ్చిందో తరచి చూసుకున్నాడు. శకుంతల, శకుంతల వంచన ఇప్పుడు స్మృతిపథంలో లేవు. నిర్మల స్వభావం కలిగి, అందం, ఆకర్షణలతో ప్రలోభపెడుతూ, మనస్సులో చోటు చేసుకున్న నిర్మలకు వెనకగా మరేదో అడుగున ఉన్నట్లు తెలిసింది. అది తండ్రి వ్రాసిన ఉత్తరం. "పాటలు మెతుకులు తిన్నవాడివికావు. తినలేవు" అని మొదలుపెట్టి, చివరకు తేల్చాడు, బాధ్యతాయుతమైన ఈ జీవితంలో అన్ని బాధ్యతలూ అవసరమైనవే అని. అందులో కొన్ని మనస్సుకిమాత్రం అంకితం అయిఉండేవి. మరికొన్ని శరీరంమీద మనకు ఉండేవని. అందుచేత బాధ్యతల నన్నిటికీ తగినంత విలువ ఇస్తూ ఉండాలి. కాని, ఏ ఒక్కటి త్రోసిరాజని రెండవదానిమీద కేంద్రీకృతం చెయ్యకూడదు. ఇంకో విషయం గూడా వ్రాశాడు. జీవితావసరాలలో, విధి ఆపాదితమై ఏదో ఒకటి అక్కరకురాక వ్యర్థమైపోతే, దానిని గురించిన వ్యథా, బాధలతో జీవితాంతం గడిపేకంటే, సమాన ప్రతిపత్తిగల వేరొక వస్తువుతో ముందుది వ్యర్థమై పోవటానికిగల అవకాశాలను రానివ్వకుండా చూసుకుంటూ, అవసరాన్ని గడుపుకుంటూ ఉంటే బాధ్యతలు నిర్వర్తించటంలో కలిగిన అలసట, నిర్వేదం కనబడవుట. తన అభిప్రాయం తెలియజేస్తే, తను ప్రయత్నం చేస్తాడట. లేక అట్లా సారూప్యమైన, సమాన ప్రతిపత్తిగల వస్తువు తనకు లభ్యమై స్వీకరిస్తే తను చాలా ఆనందిస్తాడట. ఇట్లా అంతమైన ఉత్తరంలోని భావాలు, మనసులో ముద్రితమైన నిర్మల శరీర సౌష్ఠవపు, హృదయ నైర్మల్యపు ఛాయల ప్రక్కనించి మెదులుతూ ఉన్నాయ్.

తండ్రి వ్రాసిన ఉత్తరం, అందులో పొందుపరచిన పరమసత్యాలూ, అసమర్థుడూ, వ్యర్థుడూ, అప్రయోజకుడూ అనుకున్న తన జీవితంలో తనూ గర్వించటానికి ఒక అంశం ఉన్నదని నిర్మల చూపెట్టటం, వీటివల్ల కొంత ఉద్వేగంపొంది కాస్త ముందుకు దూకాడు. శకుంతల, తన దగ్గర లేనివి, తనకు విశ్వాసంలేనివీ అయినవన్నీ అవసరమైనవనీ, అవిలేకపోతే జీవితం వ్యర్థమైనదనీ చూపెట్టింది. నిర్మల తన దగ్గర ఉన్నది ఒకటి, తన దగ్గర ఉన్నదనీ, అది ఒక్కటే ఉండటం తనకు నిజంగా గర్వకారణం అన్నట్లు మాట్లాడింది. బాధ్యత ఒక ఆడదానికే గర్వకారణం అయినపుడు మగవాడికి ఇంకెంత గర్వకారణం కావాలి.

క్రొత్తగా తెలిసివచ్చిన ఈ గర్వంతోటే, తండ్రి వ్రాసిన ఉత్తరంతోటే తనను బాధ్యతాయుతమైన వాడుగా గుర్తించి నిర్మల ప్రేమించింది, అనే అపోహతోటే కొంత కలవరపడి చాలా దూరం వెళ్ళాడు. కాని, వెంటనే తెలిసి వచ్చింది ఇక తన బ్రతుకు తాను ఒంటరిగా, బాధ్యతకోసం, కష్టపెట్టే శకుంతల అవసరం లేకుండా సారూప్యమైన బాధలతో ఉన్న నిర్మలను ప్రేమిస్తున్నా ననిగాని, ఆమె ప్రేమిస్తున్నది అనిగాని అపోహ పడకుండా తన ప్రవర్తనలో సభ్య సమాజపు మర్యాదల నతిక్రమించకుండా గడుపుతాడు. ఆ మర్యాద అతిక్రమించినందుకు మర్నాడువెళ్ళి నిర్మలను క్షమాపణ అడుగుదామని నిర్ణయం చేసుకొని, నిరాశ గూడా అణిగిపోయి, దైన్యంతో వచ్చిన శాంతితో హాయిగానే నిద్రపోయాడు.

మర్నాడు అన్నీ మామూలుగానే జరిగినవి. మామూలుగా జరగనిదల్లా నిర్మల ఆఫీసుకు రాకపోవటం, పదిహేను రోజుల సెలవుకి ఆమె పంపిన దరఖాస్తు ఆఫీసరు టేబులుమీద కనిపించడం. ఆమె ఇంటికి వెళ్ళిందన్నమాట. తను ఆమె ఇంటికి ఉదయమే వెళ్ళిఉండవలసింది. కాని వెళ్ళలేదు. వెళ్ళకపోవటానికి కారణంలేదు.

ఆమెమీద ఏ అధికారంలేని తను, ఆమెకు ఏమీకాని తను, ఆమెకు ఏవిధంగా సాయపడలేని తను, ఆమె హృదయాన్ని తరచటానికి, ముక్కలుగాకోసి అడుగున ఏమున్నదో చూడటానికి ప్రయత్నించాడు. అది సహించలేక, సహించలేక చేసేదిలేక, తననించి, తనలోఉన్న కీచకుడికి దూరంగా వెళ్ళిపోయింది. ఆ విషయం స్పష్టమైంది.

ఆరోజు ఆఫీసరు చాలా పెందరాళే ఇంటికి వెళ్ళాడు. ప్రసాదరావు తిన్నగా నిర్మల ఇంటికే వెళ్ళాడు. ఆమె ఊరికి వెళ్ళి ఉంటుంది అనుకున్న తర్వాత గూడా ఎందుకు వెళ్దామనుకున్నాడో, ఎందుకు వెళ్ళాడో గూడా తెలియకుండా వెళ్ళాడు. కాని వెళ్ళాడు. ఇంకా ఊళ్ళోనే ఉండవచ్చు అనే అనుమానంతో,ఉంటే క్షమాపణ చెప్పేసద్దాము, చెబితే తన హృదయం తేలిక పడుతుంది అనే ఉద్దేశ్యంతో వెళ్ళాడు.

ఆమె ఉన్నది. అతను వచ్చినందుకు సంతోషించాడు. ఆమె ఏమనుకున్నదో అతనికి తెలుసుకోవాలన్న ఉత్సాహంలేదు. మామూలుగానే ఏమీ జరగనట్లే ఆహ్వానించింది. ఏదో సర్దుకునే తొందరలో ఉన్నట్లు కనిపించింది. అతను అడిగాడు "ఏం తొందరలో ఉన్నారు" అని.

"ఏడు గంటల బండిలో ఇంటికి వెళ్తున్నాను."

ఇంతకుముందుఅన్నా మళ్ళీ ఒకసారి అన్నాడు "ఉదయమే వెళ్ళి ఉంటారనుకున్నాను"

"లేదు. ఉదయం ఆఫీసరుగారింటికి వెళ్ళివచ్చాను, సెలవు కోసం."

అతనికి అర్థమైంది, అంత సెలవు సామాన్యంగా దొరకదుకాని, ఆమెకు ఎట్లా దొరికిందో అనే విషయం.

ఆమె అటూ, ఇటూ తిరిగి సర్దుకుంటున్నది.

ఎందుకు సెలవు పెట్టిందో, ఎందుకు ఊరికి వెళ్తున్నదో అడుగుదామనుకున్నాడు. కాని, ఆమె విషయాల్లో స్వతంత్రత తీసుకోవద్దు అనే తన నిర్ణయం గుర్తుకు వచ్చింది.

కాని తను వచ్చిన పని చెప్పలేదు. పని పూర్తి చేసుకొని వెళ్ళలేదు. ఆమె ఏదో సర్దుతూఉంది. "మీకేమీ అభ్యంతరం లేకపోతే నేను సర్దుకుంటూ ఉంటాను, మాట్లాడండి."

ఆమెకి సరిగ్గా సర్దుకోవటానికి మాత్రమే టైము ఉన్నట్లు ఉంది. అతనులేచి వెళ్దామని అనుకుంటూనే, కూర్చుని ఉండే అన్నాడు, "నేను ఉంటే మీకు పని సాగదేమో, చికాకుగా ఉండి." అని వెళ్ళటానికి లేవలేదు. ఆ విషయం ఆమె గమనించింది. ఒకసారి అతనివేపు చూసి నవ్వింది. అన్నది, "మీరు అక్కడ కూర్చొనిఉంటే నేను హాయిగా పని చేసుకుంటాను, అని నా నోటంట విందామనా?"

"అబ్బే వెళ్తాను" అని లేవటానికి ప్రయత్నించాడు. ఆమె మామూలుగానే అన్నది.

"ఫరవాలేదు కూర్చోండి. చికాకూ ఇప్పుడేమీ పని లేదుగా" ఆమె గదిలో మూలగా, ఒక పెట్టెముందు కూర్చొని సర్దుకుంటూ అన్నది. అతను వచ్చిన పని,ముగించుకొని వెళ్దామనుకున్నాడు. ఇంకా ఆ పని ఆరంభించనేలేదు. పూర్తి ప్రయత్నంచేస్తూ, ఇందాకటినించి గడిపాడు. కాని ఏ ప్రయత్నం చేశావు అని ఎవరన్నా అడిగితేమాత్రం, అతని దగ్గర సమాధాన మేదీ లేదు.

ఆమె వైపు చూడకుండా అన్నాడు, "నిన్న మీ మనస్సుని చాలా కష్టపెట్టాను. క్షమించండి" వచ్చిన పని అయిపోయినట్లుగా కదిలాడు కుర్చీలోనించి.

"ఈ మాట చెప్పి వెళ్ళటానికే వచ్చారా?" అంది అతని వేపు చూస్తూ.

"మిమ్మల్ని ఎంత కష్టపెట్టానో ఈ ఉదయమే అర్థమైంది, మీ సెలవు లెటరుచూసి. నిన్న ఏ ఉద్దేశ్యంతోనూ ఆ సంభాషణలోకి దిగలేదు" అన్నాడు తలవంచుకొని.

ఆమె ఈసారి బాగా నవ్వింది. హృదయం తేలిక పడ్డట్టు నవ్వింది. అన్నది, "ఇంకా ఏం అర్థమైంది? ఇంకా ఊరినించి వెళ్ళలేదని గూడా అర్థమైందా?"

అతను అడిగిన దానికి సమాధానం ఇవ్వటంకోసం అన్నట్లు చెప్పింది. "మీరేమి అన్నారని క్షమించటానికి. ఏం తప్పు చేశారని?"

ఇక్కడే ఇబ్బంది వస్తుంది. ఆ సందర్భంలో అతనికి వచ్చిన ఇబ్బందే ప్రతివారికీ వస్తుంది. కొన్ని మనం చాలా గొప్ప అపరాధాలు అనుకుంటాం. అనుకొని, దానికోసమై వ్యథ పడతాము. కాని, అవి ఎవరికి చేశామో వాళ్ళు గూడా ఆ అపరాధం తీసుకున్నారనే అనుకుంటాము. కాని నిజంగా అపరాధంగా తీసుకున్నారో, లేదో ముందుగా తెలియదు. తీరా తీసుకున్నారని దాన్ని సర్దుకోవటానికో, క్షమాపణ చెప్పటానికోవస్తే వాళ్ళ

# సద్గమయంలో

ఆ అపరాధం అపరాధంగా తీసుకోకపోవటమో, తీసుకున్నా తీసు కున్నట్లు ఏమాత్రమూ కనబడక పోవటమో, లేకపోతే దాన్ని పూర్తిగా పట్టించుకోక పోవడమో చేసినట్లు తెలుస్తుంది. అప్పుడు వెళ్ళిన వాళ్ళ పని మరీ సంకటావస్థలో పడుతుంది. ఇప్పుడు అతని పని గూడా అంతే అయింది.

తను ఏం తప్పు చేశాడో, అతను విడమరిచి చెప్పలేదు. ఆమె అతనివైపు వీపుపెట్టి మూలాగా ఉన్నపెట్టె ముందు కూర్చుని బట్టలు సర్దుకుంటున్నది. వెనక్కు తిరగకుండానే అన్నది. ఇందాకఉన్న తేలికయిన వాతావరణంలేదు ఆ మాటల్లో. "మీ ప్రశ్న నాకు క్రొత్తకాదు. నా బాధ్యత అక్కర్లేకుండా, నేను మాత్రం కావాలనుకున్న ప్రతి ఒక్కరూ ఆ ప్రశ్నే వేశారు. మరొకర్ని ఎవర్నో ప్రేమించి ఉంటానన్న అసూయసడ్డ ప్రతి ఒకర్కరూ వేశారు."

ఈ మాటలు వింటూనే అతను ఉలిక్కి పడ్డాడు. ఉలిక్కిపడి ఒకసారి ఆమెవైపు చూశాడు, కుర్చీలో వెనక వాలి ఉన్న వాడల్లా, ముందుకు వంగి, ఆమె తన వైపు చూస్తున్న దేమోనని. ఆమె దృష్టి అతని వైపు లేదు. ఆమె చెబుతూనే ఉంది. "నాకు పైపై మెరుగులమీద, ఆకర్షణలమీద ఆకర్షణ ఎప్పుడో పోయింది. లేకపోతే ఎప్పుడో నాశనం అయిపోయి ఉందును, తోబుట్టువుల్లో మగ పిల్లలు లేకపోవటం, మగ పని ఆడపని చేసుకోవలసి రావటం, బస్తీలో పెరిగి, నాలుగూ చూడటం, అర్థంచేసుకోవటం, ఇవి నన్ను త్వరలోనే ఆకట్టు కున్నయ్. ఏ ప్రవాహంలోనూ పడకుండా కాపాడినయ్." ఆమె దృష్టి పెట్టె మీదనే ఉంది. ఆమె స్వరం కొంచెం ఆవేశంగా ఉంది.

ఒక్కసారి పూర్తిగా దగ్గి, గుండెలు తేలిక పరుచు కుందామనుకునే రోగిలా ఇంకా చెబుతూనే ఉంది "ఎన్నో ఆకర్ష ణలలో, చనువుగా, చొరవగా లాగి నాశనం చేస్తారు. ఏమాత్రం అజాగ్రత్తగా ఉండి దెబ్బతిన్నా క్షమించేటంత ఉదారులా ఉదా త్తులా చెప్పండి, మీరూ మీరూ నిర్మించిన సమాజమూ."

ఈ మాట అని వెనక్కు తిరిగింది. అది అతన్ని చురు క్కున కొట్టినట్లు అయింది. ఆమె అన్నది, " ఏ ఒక్కరి విషయమూకాదు చెప్పటం. మామూలు పద్ధతి చెబుతున్నాను. భ్రష్టం చేసేటప్పుడు చూపెట్టిన ఉదాత్తత క్షమించవలసిన అవసరం వచ్చినప్పుడు ఉండదుకదూ. అందుచేత కళ్ళని నమ్ముకుని భ్రమపడి, నాశనమై పోతే ఎట్లా చెప్పండి"

మగవాళ్ళ మీద పడ్డ ఈ తీరని అపవాదు, అతనికి గూడా తగిలింది. ఇంకేదో మాట్లాడుదామనుకున్నా, ముందు మరొకటి వచ్చింది. అన్నాడు, ఆడవాళ్ళలో మాత్రం లేరూ అట్లాంటి వాళ్ళూ, ఆడవాళ్ళు అంతకంటె ఎక్కువకదూ."

ఆమె సర్దటం మానేసి, పూర్తిగా వెనక్కి తిరిగింది, "ఉంటారు. ఎందుకు ఉండరూ. ఉన్నా మొదటి తరహావాళ్ళే ఉంటారు. రెండవ తరహావాళ్ళు ఉండరు. అదే ఆడవాళ్ళ బల హీనతో గొప్పతనమో, ఏదో ఒకటి అనండి. క్షమించే విష యంలో మాత్రం ఆడదానికి ఉండే శక్తి, మగవాడికి ఎప్పుడూ ఉండదు. అందుచేతనే వాళ్ళు ఇంకా ఎక్కువ జాగ్రత్తగా ఉండాలి. క్షమ, జాలి అనే పదార్థాలు విరివిగా, వితరణ చెయ్య గలిగిన జాతి దగ్గర, జాగ్రత్త ఉండకపోతే ప్రమాదమే" అన్నది.

అతను మధ్యలోనే అందుకోవటానికి ప్రయత్నించి, ఆమెని అక్కడదాకా చెప్పనిచ్చే అన్నాడు. "అయితే ఎంత తప్పు చేసినా, క్షమించమనే మీరు అంటారు" అంతకంటే ఎక్కువ అనలేకపోయాడు. శకుంతల మనస్సులోనూ, శకుం తల గొప్పతనం సగర్వంగా చెప్పుకునే నిర్మల ఎదుటా ఉండి అతన్ని మాటలు తెంచుకొని రానంత ఉద్వేగ పెట్టారు. ఇంకా ఏదో చాలా అందామనుకున్నాడు. కాని, ఏమీ అనలేక పోయాడు.

ఆమె అన్నది, "ఆ విషయం నేను ఏమీ అనను. ఆడది క్షమించినంత మగవాడు క్షమించలేడనే నేను అనేది" ఆమె మామూలు ధోరణిలోనే అన్నది. వాళ్ళిద్దరికీ సంబంధించే విషయంకాదు, అని ఆమె అనుకోటంతో ఆమె అతనివైపు పూర్తిగా తిరిగే మాట్లాడుతున్నది. ఆమే అన్నది, "పోనీ యండి ఆ విషయం. వాదనకి అనవసరమైన విషయం అది"

అతను, ఆమె చెప్పిన విషయం ఆలోచిస్తున్నాడు. ప్రతివాదం చెయ్యటానికి సిద్ధపడిగాని, ప్రతివాదం చేసే ఉద్దేశ్యంతోగాని అక్కడికి రాలేదు. అంతకుముందు ఎప్పుడు మాట్లాడినా, తన విషయం ఏమాత్రం బైట పడకుండా తెలియటానికి అవకాశం లేకుండానే వ్యవహరిస్తూ వచ్చాడు. కాని, ఇప్పుడు ప్రతివాదంచేసి, శకుంతల విషయం బైటకి వస్తుందేమోననే భయం గూడా లేకపోలేదు. ఏమాత్రం వచ్చినా, నిర్మల ఇట్టే పసిగట్టేస్తుంది. ఆ అవకాశం ఆమెకు ఇవ్వటానికి ఎప్పుడూ ఇష్టం ఉండదు.

అక్కడినించి త్వరగా వెళ్ళిపోతే మంచిది అనుకున్నాడు. ఆమె ఏమీ సర్దుకున్నట్లు కనబడలేదు. ట్రైనుకి అట్టే ఆలస్యం లేనట్లు గుర్తుకి వచ్చింది. ఈసారి లేచాడు. "మీరు ఏమీ సర్దుకున్నట్లులేదు. నేను వచ్చి మిమ్మల్ని మాటల్లో పెట్టాను. వెళ్తాను", అని లేచాడు.

ఆమె మామూలుగానే ఉంది. ఏ రాగ ద్వేషాలు లేకుండా, ఉద్వేగం చల్లారిపోయినట్లుగా మాట్లాడింది. "లేదు, పూర్తి అయిపోయింది. కాఫీ పెట్టాను. తీసుకొస్తున్నాను. కూర్చోండి, కాఫీ త్రాగి వెళుదురుగాని" అని లోపలికి వెళ్ళింది. ఎప్పుడు కాఫీ పెట్టిందో గూడా అతనికి తెలియలేదు. అతను, ఆలో చనలన్నీ లోపలే ఉండి, ఏ ఒక్కదాన్ని గురించి ఆలోచించలేక, చిక్కుపడ్డ దారపు కండెలో మొదలు ఎటా అని చూసేవాడిలా కూర్చున్నాడు.

ఆమె కాఫీ కప్పు తీసుకొచ్చి, అతనికిస్తూ, అన్నది, "చాలా మాట్లాడానుకదూ. ప్రసంగవశాత్తూ వస్తే, దాని

విషయం పూర్తి అయ్యేదాకా వదలలేం" అంత ఎక్కువ మాట్లాడినా, దానికి క్షమాపణగా చూసింది.

అతనికి ఆ విషయం నిజమేననిపించింది. క్రిందటి రోజు గూడా మనస్సు ఒక భావంలోపడి, దాని విషయం తేల్చుకునేదాకా వదలలేదు. ఇప్పుడు గూడా అట్లాగేఉంది. అప్రయత్నంగా మాట్లాడాడు. చిక్కుపడ్డ దారంలోనించి, ఏదో పుచ్చుకు లాగితే మరేదో తెగి వచ్చినట్లు వచ్చింది. "ఆఖరికి భరోసా మీద పెట్టిన విశ్వాసాన్ని, ఊడ్చి పారేసినా, నిస్సంకోచంగా త్రోసి పారేసినా క్షమించాలా" అన్నాడు.

"అక్కడే మనం పొరపాటు పడతాం అంటాను. ఆ విశ్వాసం ఉంచే చోట జాగ్రత్తగా చూసి ఎంచుకుంటే ఆ ప్రమాదం అసలు ఎప్పటికీరాదు. ఆ అవకాశాలు ఎక్కువగా ఉండనూ ఉండవు. కాని, బాధ్యత తెలిసిన వాళ్ళమీద విశ్వాసం ఉంచుతున్నామా, లేదా అనేది తెలుసుకొని బాధ్యత తెలిసిన వాళ్ళను వెతుక్కుంటే ఇక నిశ్చింతగా ఉండవచ్చు."

అతను బాగా అర్థమైనట్లు చూశాడు. ఆమె చెబుతూనే ఉంది. "ఆ నిశ్చింత జీవితంవస్తే ఇంకా కావలసినది ఏముంది. దానికోసమేగా అందరూ అన్ని పాట్లూ పడేది" ఆమె కంఠంలో ఆర్ద్రత కనిపించింది. "మీ కిచ్చిన దాంట్లో పదోవంతు గూడా చనువు ఇవ్వకుండానే, చికాకు పరిచేటంత స్వతంత్రం తీసుకోవటానికి ప్రయత్నించారు. బాధ్యత తెలిసిన వ్యక్తులు గనుక మీరు తీసుకో ప్రయత్నించారు." ఆమె ఇక అక్కడ ఉండలేక పోయింది. ఖాళీ కప్పు తీసుకొని లోపలికి వెళ్ళింది.

ఆమె తిరిగి రావటానికి కొంచెం ఆలస్యం పట్టింది. ఈ కొంచెం సేపట్లో అతను యుగాల ఆనందం పొందాడు, తను నిర్దిష్టంగా ఏమిటి అంటే చెప్పలేని సంతోషం అది. తన బాధ్యతని తన జాగ్రత్తని ఆమె పొగిడింది. దానికి ఆమె సంతోషించింది. శకుంతల ఒకసారి గుర్తుకు వచ్చింది. శకుంతలకు, నిర్మలకు తెలిసినంత తెలిస్తే, అసలు శకుంతల తన జీవితంలో ప్రవేశించకుండా, ఏ నిర్మలో ప్రవేశించిఉంటే, లేక నిర్మల ప్రవేశానికి అవకాశం ఇచ్చి ఉంటే........అతని మనస్సు బరువుగా ఉంది.

ఆమె తిరిగివచ్చి పెట్టె మూస్తున్నది. అతను అన్నాడు, "మీరు చెప్పిన బాధ్యత, బాధ్యత తెలిసిన వ్యక్తులకే అర్థమయ్యే విషయం. అది రెండు వేపులా ఉండకపోతే మీరు చెప్పిన నిశ్చింతరాదు. చింతే మిగులుతుంది."

అతనివైపు, ఈ మాటలు విని ఒకసారి చూసింది. తను చెప్పింది ఏమైనా అర్థమైందో, లేదో అని వెతికినట్లు చూసింది. అతను చెప్పిన దాంట్లో అర్థం ఏమిటో చూడటానికి ప్రయత్నించింది. ఆమెకు ఏమీ అర్థం కాలేదు, అన్నది. "మీరు చెప్పిన విషయం నిజమే. నా చిన్నప్పటి స్నేహితురాలు ఈమధ్య కలిసింది. ఆమెని మొగుడు వదిలేశాడు. బాధ్యతగల వాళ్ళు అయితే అట్లా చేస్తారా చెప్పండి"

అతనికి వదిలి పెట్టటం అనటంతోటే శకుంతలే గుర్తు వచ్చింది. అన్నాడు, "ఆమె ఏదో చేసి ఉంటుంది. లేకపోతే ఎందుకు అట్లా జరుగుతుంది." ఆమె వెళ్ళవలసిన టైం అయినట్లు, వచ్చిన ప్రసంగం కాలయాపన చేసేటట్లు ఇద్దరికీ అర్థమైంది. ఈసారి ఆమె అన్నది, "ఆఁ చేసే ఉంటుంది. పుట్టింటినించీ అతను తెమ్మన్నవన్నీ తీసుకరాకపోవడమో, మొగుణ్ణి వేళకు ఇంటికివచ్చి, తనను గూడా గుర్తు పెట్టుకోమనటమో, కాస్త దుబారా తగ్గించమనటమో, మీతో మాట్లాడుతుంటే ఇక ఇవ్వాల్టికి ప్రయాణం సాగినట్లే. మీరేమీ అనుకోకుండా ఉంటే–రిక్షా ఒకటి కేక వేసుకవస్తారూ"

అతను లేస్తూనే అన్నాడు, "ఇవిగాక చేసేవి ఇంకేవీ లేవా?" ఆమె నవ్వుతూనే అన్నది, "లేకేం. ఆ లిస్టు మీరు వచ్చేటప్పటికి నేను తయారు చేస్తాగా. మీరు వెళ్ళిరండి" అన్నది.

సంభాషణకు సంబంధించిన ఉద్రేకం ఇంకా అణగక పోయినా, మనస్సు అతనికి ఎంతో సంతోష పడ్డట్టు అనిపించింది. చివరి మాటల్లో నిర్మల తీసుకున్న చనువు, ఆమె చూసిన చూపు ఎక్కడో తగిలి, ఏదో అనుభూతిని గుర్తుకు తెస్తున్నయ్. ఆమె తీసుకున్న చనువు చాలా ఆనందంగా ఉంది. అతను వెళ్ళి రిక్షా పిలుచుకు వచ్చాడు. రిక్షాస్టాండులో ఒకటే రిక్షా ఉంది. ఇంకోటి గూడా ఉంటే బాగుండు ననుకున్నాడు. త్రోవలోనైనా దొరికితే బాగుండుననిపించింది.

రిక్షావాడు సామాన్లు రిక్షాలో పెట్టాడు. ఆమె తాళ వేసివచ్చి రిక్షాలో కూర్చుంది. అతను రిక్షాలో ఆమె కూర్చున్న ప్రక్కగాఉన్న అంచుమీద చెయ్యిపెట్టి అన్నాడు, "అక్కడ ఒకటే రిక్షా ఉంది". స్టేషనుదాకావచ్చి పంపించి వద్దామనే అతని ఉద్దేశ్యం ఆమెకి అర్థమైంది. అర్థంకాక మిగిలిపోయిన విషయం మరొక్కటిఉంది. దానికోసం అతని ముఖం చూడటానికి అవకాశం లేదు. అతను తన హృదయం తెలుసుకొని అంటున్నాడో, తెలుసుకోవటానికి అంటున్నాడో ఆమె నిర్ధారణ చేసుకోలేక పోయింది.

అతని చెయ్యిమీద తన చెయ్యి ఉంచి అన్నది, "ఎందుకూ అంత శ్రమ. నేను ఒక్కదాన్నే వెళ్ళగలనుగా. దయ ఉంటే మీ బాధ్యతల లిస్టులోవేసి, ఒక ఉత్తరం ముక్క వ్రాయండి" ఈమాట అనే ఆమె ముఖం అతనికి కనబడకపోయినా, ఆమె కంఠస్వరంలోఉన్న ఆర్ద్రత మాత్రం అతనికి స్పష్టంగా తెలిసింది.

తన రెండో చెయ్యి ఆమె చేతిమీద వేసి నొక్కుతూ అన్నాడు, "నీకు తెలియదు నిర్మలా—ఆ విషయంలో నువ్వు తెలుసుకోవలసింది చాలా ఉంది."

రిక్షావాడు ఆలస్యం భరించలేక అన్నాడు, "బాబూ పోనిమ్మంటారా బండి టైము అయింది". వాడికి ఇట్లాంటివి అలవాటే అయినా, వాడికి నిత్య జీవితం ముఖ్యం. అతను 'ఆ' అన్నాడు.

ఆమె తన రెండో చెయ్యి అతని చేతిమీదవేసి, అదుముతూ అన్నది. రిక్షా కదిలింది. "ఇంకేమీ తెలుసుకోక్కర్లేదు, నేను తెలుసుకున్నది చాలు."

రిక్షా కదిలినప్పుడు చేతులు విడిబడిపోయినా, ఎప్పుడో కలిసిపోయిన హృదయాలు లతుక్కుపోయినయ్.

అతను రిక్షా వెళ్ళిన వైపే చూస్తున్నాడు. దూరంగా ప్రకాశిస్తున్న లైటు క్రిందిగా రిక్షా పోయేటప్పుడు, ఆమె ఇంకా వెనక్కు తిరిగే చూస్తున్నది, తను కనబడకపోయినా, తనవేపే చీకట్లోకి చూస్తున్నదని అతనికి అర్థమైంది. కాని, తను చీకట్లో ఎటువైపు చూస్తున్నాడో, ఆమెకు అర్థమైనా తెలియదు. తనను గురించి ఏమీ తెలియదు. తను ఏమీ చెప్పలేదు. ఆమె తనను గురించి ఏమీ దాచకపోయినా, తను, తనని గురించి ముఖ్యమైనది అంతా దాచాడు.

## 7

ఏ మాట వినదామనుకొని, తన అయోగ్యత గుర్తుకు వచ్చి, వినటం అసంభవం అనుకొని సరిపెట్టుకున్నాడో, ఆ మాట విన్నాడు. ఆ మాట వినటం చాలా సంతోషంగా ఉన్నా, దాని కంటె ఎక్కువ ఆనందం కలిగింది. ఇంతకుముందు ఏనాడూ కలగని ఆనందం కలిగింది. తను నెల నెలా తమ్ములూ, చెల్లెళ్ళు కోసం డబ్బు పంపటంలో ఉన్న తృప్తి, తండ్రిబాధ్యతని తన మీద వేసుకుని, తండ్రికి గర్వకారణంగా ఉన్నాననే సంతోషం, శకుంతలతోటి గడిపిన జీవితంలో పొందిన ఆనందం, వీటన్నిటి కంటె కొన్ని వేల రెట్లు ఎక్కువ ఆనందం కలిగింది. తనలో ఏదో లుప్తమైపోయింది అనుకున్నది పూరమైనట్లు, అసలు లుప్తమైపోలేదు అనుకునేంత ఆనందం కలిగింది.

తను గోపాలరావు కాకపోయినా, తనకు ఉంగరాల జుట్టూ, విశాలమైన ఛాతీ, టెరలిన్ చొక్కాయి ఏవీ లేకపోయినా, తన దగ్గరఉన్న వస్తువు, నిరుపయోగమైనది అని శకుంతల త్రోసి పారేసిన వస్తువు, ఎంతో యోగ్యమైనదీ, అవసరమైనదీ, విశాలమైనదిగా శకుంతలకంటె అందమైన నిర్మల ఆఖరిసారి స్పష్టంగా చెప్పివెళ్ళింది.

తనను గురించి నిర్మలకు ఏమీ ఎక్కువగా తెలియదు. అసలు ఏమీ తెలియనట్లే లెక్క. తనకు ఇంకా తమ్ములు, చెల్లెళ్ళు ఉన్నారని, వాళ్ళకోసం తను నెల నెలా డబ్బు పంపుతున్నానని తప్ప ఇంకేమీ తెలియదు. అంతకంటె తను ఇంకేమీ చెప్పలేదు. ఆమె కూడా అదే చేస్తున్నది. ఇద్దరూ మితంగానే వ్యయం చేస్తారు. ఆమె వ్యక్తిగతమైన జీవితం తనకి తెలుసు. తన వ్యక్తిగత జీవితం ఆమెకు తెలియదు. అయినా తెలుసుకో నక్కర్లేదు అంది. తెలుసుకున్నది చాలు అన్నది.

తనకు జీవితంలో మొదటిసారిగా తెలిసింది, తనను ఒక అందమైన అమ్మాయి ప్రేమించింది అని. అతనికి ఆమె వెళ్ళిన ఆ మూడు రోజుల వింత ఏకాంతంలో, నిశ్చితంగా చెప్పలేని ఆనందం, అంతే నిశ్చింతగా నిర్వచించలేని బాధా కూడా తెలుస్తున్నయ్. మొదటిరోజు, రెండోరోజు బాధ ఏమీ తెలియలేదు గాని, ఆ మూడోరోజు తెలుస్తున్నది. అప్పుడు తలచిచూస్తే తెలిసింది కూడా, తన ఏకాంతంలోకి నిర్మలవచ్చి ఎక్కువకాలం కాకపోయినా, నిర్మల కనబడటం గూడా లేని ఆ ఏకాంతంవల్ల అని. మునుపటిలాగే ఏకాంతం దుర్భరంగా ఉంది. మునుపుఉన్న భావాలే రాకపోయినా, ఈ ఏకాంతం గూడా బాధాకరంగా ఉంది. మొదటి ఏకాంతానికి కారణమైన శకుంతలగాని, ఆమెని గురించి ఆలోచనలుగాని ఈ ఏకాంతంలో గుర్తు రావటంలేదు. ఈ ఏకాంతానికి కారణమైన నిర్మల, మాత్రమే మనస్సులో నిలిచిపోయింది.

ఇంత ప్రేమించిన నిర్మల ఎందుకు వెళ్ళిపోయిందో చెప్పలేదు. తనను గురించిమాత్రంకాదు. మరి ఎందుకో అడిగితే బాగుండిఉండేది అనిపించింది. కాని, అడగలేదు. ఎందుకో అర్థం కాలేదు. తను ఆపలేదు. ఆగిపొమ్మంటే ఆగిపోయేదో, లేదో తెలియదు. ఆగి, తను చెప్పదలచుకున్న విషయం చెప్పింతర్వాత ప్రేమించేదో, లేదో తెలియదు. అప్పుడైతే చెప్పేవాడు. కాని ఇప్పుడు చెప్పాలో లేదో తెలియటంలేదు. చెప్పకుండాఉంటే ఇబ్బంది. చెబితే ఆమె తను గూడా అయోగ్యుడు అనుకొని తన ప్రేమని తిరిగి తీసుకుంటే తను అది భరించలేడు. ఈ ఆలోచనలతో అతనికి పిచ్చి ఎక్కుతున్నట్లు అనిపించింది. కనీసం నిర్మల దగ్గర్నించి ఉత్తరంవస్తే బాగుండుననుకున్నాడు. తను ఉత్తరం వ్రాద్దామనుకున్నాడు. ఆమె అడ్రసుఇచ్చి వెళ్ళలేదు. తనకు ఆఫీసులో అడిగి తీసుకోవటానికి ఇష్టంలేదు. ప్రతిరోజూ ఉత్తరంకోసం ఎదురు చూశాడు. ప్రతిరోజు గూడా, కలిసి ఎన్నో రోజులు కాలేదు కాని, యుగాలు అయినట్లు ఉంది. ఆరోజే ఉత్తరం వచ్చింది. యుగాల తర్వాత వచ్చిన ఉత్తరం చదివాడు.

ఆ వచ్చింది ఆహ్వానం. ఆహ్వానంతోపాటు కలిసిన ఉత్తరం వాళ్ళ అక్కయ్య కూతురు బారసాలట. తప్పక రమ్మని వ్రాసింది. తప్పక వస్తారు కదూ, రారూ, అని ముగించింది. ఆ మాటల్లో ఆ ముగింపులో రిక్షాలో దూరంగాఉన్న లైటు క్రిందగా వెళ్తూ వెనక్కి తిరిగి చూసిన నిర్మల, తనని విశ్వసించి, ఇంకేమీ తెలుసుకో నక్కర్లేదు అనుకున్న నిర్మల కనిపించింది. తన బాధ్యత తీసుకోమని మౌన భాషలో చెప్పి వెళ్ళిన నిర్మల కనిపించింది. ఎక్కువగా కాకపోయినా, తియ్యగా, కమ్మగా ఉండేట్లు వ్రాసింది.

ఇంకా వ్రాసింది. తనకు, ఆమెకు వెళ్ళే రోజు జరిగిన సంభాషణ పురస్కరించుకున్నట్లు వ్రాసింది. మొగుడు వదిలేసిన తన స్నేహితురాలు, వాళ్ళ అన్నయ్య దగ్గర ఇంకా అక్కడే ఉందట. ఆమెని చూసినప్పుడల్లా ఏదో భయం, ఆ భయంలో నమ్మకంగా కనిపించే తనూ గుర్తు వస్తారట. ఆడజాతి నిరుపాయత, అసహాయతకు ప్రతిరూపంగా కనిపించే తన స్నేహితురాల్ని చూస్తే కానరాని భయ సందేహాలు మనసంతా ఆవరిస్తయ్యట. ఏమాత్రం లోట్లు కనిపించినా సహించకుండా నిర్దాక్షిణ్యంగా దండించే పురుష జాతి దయా ధర్మ భిక్షంతోపడి

ఉండవలసిన ఆడది, శిక్షాస్మృతి తెలిపి ఉండి గూడా ఏం అకార్యం చేస్తుంది చెప్పండి అని ప్రశ్నించింది.

తర్వాత తమాషాగా వ్రాసింది. తనకు నమ్మకం ఉన్నవి తమ జాతిమీద. మీరు వస్తారుగా మీరే అడుగుదురుగానిలెండి. ఏం తప్పుచేస్తే అంత శిక్ష వేశారు. నేను ఎప్పుడూ అడగలేను. అడగలేదు కూడా. అతను తెలుసుకోవలసిన విషయం అన్నట్లు ఇంకా వ్రాసింది. ఒక్క విషయం చెప్తాను. మీ దయా దాక్షిణ్యాలతో బ్రతకవలసినవాళ్ళు, మీరు లేకుండా బ్రతుకలేనివాళ్ళు, మీరు నిశ్చింతగా బ్రతుకనివ్వనివాళ్ళు, మీతో ముడి పడటం కోసం తప్ప, మీకోసం మీ తృప్తి సుఖాలకోసం తప్ప యితరత్రా ఏం చెయ్యగలరు. ఏ అకార్యం చెయ్యగలరో చెప్పండి. యుగాలుగా అలవాటైన, తప్పనిసరియైన ఈ అస్వతంత్రం నించి స్వతంత్రం కావాలి అని మీనించి తెగదెంపులు చేసుకుందామనుకుంటే తప్ప యింకేం అకార్యం చేయుటానికి అవకాశం ఉంది. ఒకవేళ పొందినా, మీరు నిలవనివ్వని ఆ స్వతంత్రం మాత్రం ఎన్నాళ్ళు ఉంటుంది. దాన్ని ఏ స్వైర్యవిహారంగానో పేరుపెట్టి, హైన్యంగా లాగేస్తారు. అది మాత్రం ఏం సుఖం? ఎవరి మెప్పుకోసం?

ఉత్తరం చదివినంతసేపూ ఆనందిస్తూ, మధ్యమధ్య కలుక్కుమని ఉలిక్కిపడ్డ ఏకీభూతమైన అతని అభిమానం నిర్మలమీద స్థిరీకృతమైంది. తన జీవితంలో అడుగుపెడదామనుకునే నిర్మలను అడుగు పెట్టనిస్తే, యింతకుముందే అడుగుపెట్టి అది జారి ప్రక్కకు పడిపోయిన శకుంతలవల్ల ఉండే యిబ్బందిని గురించి ఆలోచించాడు. ఎంత ఆలోచించినా ఆలోచన తెగలేదు. ఇబ్బంది వస్తుందో రాదో తెలియదు. వస్తే ఏం చెయ్యాలో తెలియదు. ఎల్లా పరిష్కరించాలో అంతకంటే ఆలోచన రాలేదు. ఉభయ సంకోచాల మధ్యలో పడేనేమో, తండ్రి ఉత్తరం వ్రాసినా, నిర్మల తన జీవిత బాధ్యత తన మీద వదిలేసి నిశ్చింతగా ఉంటానన్నా గూడా, తన నిశ్చయం మనస్సు అడుగునించి తేలి పైకి రాలేదు. దానికి చాలా ఆలస్యమున్నట్లు అనిపించింది. 'తన ఆలోచన మార్చి యింకోటి ఆలోచించాడు.

వెళ్ళవద్దు అని నిర్ణయం చేసుకున్నా, వెళ్ళకుండా ఉండగలగటం అసంభవం అయ్యేదేమో. కాని అతను అంత అసంభవమైన పనికి పూనుకోలేదు. రెండు రోజులు సెలవుపెట్టి బయలుదేరాడు. వెళ్ళటంలో గల మరొక ఉద్దేశ్యం కోసమే తను బయలుదేరుతున్నానని సమాధానపడ్డాడు. ఇంతదాకా నిర్మలకు చెప్పని విషయం, చెప్పకుండా జాగ్రత్తగా పరిరక్షించిన విషయం, చెప్పి ఆమెమీద దాని ప్రభావం ఎట్లా ఉందో చూసి, ఆమె అభిప్రాయం సేకరించటం, అది తన విషయంలో జరిగిందని నేరుగా చెప్పటమో, లేక వాళ్ళ స్నేహితురాలి సందర్భంలో మాటాడటమో అక్కడికి వెళ్ళాక ఆలోచిస్తాడు. ఇది ఎప్పుడో చెయ్యవలసిన పని. అప్పటికే చాలా జాప్యం జరిగింది. అదిగూడా తెలుసుకొనిగాని తనొక నిర్ణయానికి రాడు. అతను తృప్తిగానే బయలుదేరాడు.

మర్నాడు పది గంటలకు బారసాల. నిర్మల వెళ్ళిన బండి ఉన్నదీ, తెల్లవారుఝామున బయలుదేరే మరొక బండి కూడా ఉంది. అయినా అతను ఆరోజు సాయంత్రమే అక్కడికి వెళ్ళాడు. చీకటి పడింది. అయినా గుర్తులు వ్రాసింది గనుక నేరుగానే వెళ్ళాడు. గేటు తీసుకొని లోపల అడుగుపెట్టేటప్పటికే వసారాలో మరొక రిద్దరెవరితోనో మాట్లాడుతున్న నిర్మల లేచివచ్చి చేతిలో సంచి తీసుకుంది. హృదయమంతా ఒక్క మాటలో పెట్టింది. "వచ్చారా. అసలు రారేమోనని చాల బాధపడ్డాను." అతనికి మనసంతా సంతోషం పూసినట్లయింది. "ఎందుకు రాననుకున్నారు". అప్పటికి గేటు ముందు నుంచి వసారా దగ్గరగా వచ్చేశారు. యాదాలాభంగా వసారాలో ఉన్న మిగిలిన యిద్దరివేపు చూశాడు. మొదటి ఆమె మీదనించి రెండో ఆమె వైపు పూర్తిగా వెళ్ళకుండానే చూపులు తిరిగి వచ్చేసినయ్. సంచి లోపల పెట్టి కుర్చీ తీసుకరావటానికి నిర్మల అతనికంటె ముందుగానే వసారా దాటి లోపలికి వెళ్ళింది.

మసకగా ఉండి పెద్ద కాంతిగా లేని ఆ వెల్తురులో, మసిబారినట్లు ఉన్న చీరమధ్య కొడిగట్టినట్లు కాంతి విహీనంగా ఉన్న శకుంతల ముఖం గుర్తుపట్టటానికి, అతని చూపులను ఎక్కువ ప్రయత్నం చెయ్యటానికి అవసరం లేకపోయింది. శకుంతల యిక్కడా ! అతని మనస్సు క్రితంసారి ఆమెతో ఆఖరిసారి ఉన్నప్పుడు, అయినంత అచేతనంగా మారిపోతున్నట్లుంది. కాని నిర్మల కుర్చీ తీసుకొచ్చి మారనివ్వలేదు. కుర్చీ క్రిందపెట్టిన చప్పుడుతో అతను నిర్మలవైపు చూశాడు. నిర్మల సముదాచారమైన పరిచయం మొదలుపెట్టింది. 'ఇది మా అక్కయ్య'. అక్కయ్యకు తన పేరు చెప్పలేదు. అతను చెయ్యెత్తి నమస్కరించాడు, చాలా కష్టంగా చేతులు కూడదీసుకుని. శకుంతలవేపు తిరిగి పరిచయం చెయ్యబోతూ చెప్పింది, "వీరు ప్రసాదరావుగారు" అతనివైపు తిరిగి చెప్పింది, "ఈమె శకుంతల. నేను చెప్పానే, మా స్నేహితురాలు.

ఆమె చెప్పిన మాటలు అతనికి వినబడ్డయ్యో లేదో గాని, చేతులు మాత్రం జారి, ఇక నిలవలేమన్నట్లు ఎప్పుడో యథాస్థానానికి వెళ్ళిపోయినయ్యి. శకుంతల మాత్రం చేతులెత్తి నమస్కరించింది. సముదాచారం సరిగ్గా పాటించటం అతనికి అలవాటులేని విషయమేనని తెలిసిన నిర్మలకు అతను ఏమీ మాట్లాడకపోవటం క్రొత్తగా కనబడలేదు.

ఏమాత్రం తొట్రుబాటు కనబడకుండా శకుంతల నిర్మలవైపు తిరిగి, "నేను వస్తానే నిర్మలా" అంటూ వెళ్ళటానికి వెనక్కి తిరిగింది.

చనువుగానే అంది నిర్మల "అదేమిటే, అల్లా పారిపోతానంటావు. కాస్సేపు కూర్చో" అన్నది. "కాదే పనిఉంది వెళ్తాను" అన్నది శకుంతల ఎటువైపు చూడకుండా. అప్పటికే నిర్మలవాళ్ల అక్కయ్య కాఫీ తీసుకొస్తాను అని చెప్పి లోపలికి వెళ్లటం ఎవరూ పూర్తిగా విన్నట్లు లేదు. లేక విని ఊరుకున్నారో. నిర్మల అన్నది "ఆయన గూడా వచ్చారా, కాఫీ

తీసుకొస్తాను. ఉండు, కాఫీ తీసుకొని వెళ్ళుదువుగాని'' అని లోపలికి వెళ్ళబోయింది.

లోపలికి వెళ్ళబోయే నిర్మలను పట్టుకొని ఆపి శకుంతల అన్నది, ''కాదే వెళ్తాను, తర్వాత వస్తాను'' అని వెళ్లిపోయింది. ఎప్పుడూ తనమాట కాదనకుండా ఉండే శకుంతలని, వెళ్ళిపోతుంటే ఒకసారి చూసి ''కాఫీ తీసుకొస్తాను'' అని ప్రసాదరావుకి చెప్పి లోపలికి వెళ్ళింది.

ప్రసాదరావు ఎటువైపూ చూడటంలేదు, ఏమాటా వినిపించుకోవటమూ లేదు. అతను ఒక సందేహంలో పడి దాన్నించి బయటపడటానికి ప్రయత్నిస్తున్నాడు.

నిర్మలకు అంతా తెలిసి, యీ ఆహ్వానం పంపిందా! నిర్మలకు అంతా పూర్తిగా తెలుసా అని. కాని ఆ పరిచయం చేసే పద్ధతిలో అదేమీ గమనించినట్లు లేదు. గమనించే స్థితిలో లేడు. అయినా ఆడవాళ్లని గురించి నిర్మల పరిచయంతో కాస్త కప్పబడి, పూర్తిగా మారని అతని అభిప్రాయం వెంటనే తిరిగి వచ్చింది. శకుంతల మాత్రం పట్టుబడేదాకా కనిపించిందా? తను అనుమానించాడా? ఇంకాసేపు ఉండమని శకుంతలను బలవంతంచేసే నిర్మల ముఖంలో, యాదాలాభంగా చూశాడు గనుక ఏం ఉన్నదో పోల్చుకోలేక పోయాడు. శకుంతల ముఖం అటువైపు తిరిగి ఉన్నది.

నిర్మల త్వరగానే కాఫీ తీసుకొచ్చింది. అతను కాఫీ త్రాగుతుంటే అన్నది, శకుంతల ఆమె మనస్సులోనించి పోయినట్లు లేదు. ''చూశారా? ఏ అకార్యం చేసినట్లు కనిపిస్తున్నది? ఎప్పుడూ దైన్యంగా, సామాన్యంగా, జీవితంలో అంతా పోగొట్టుకున్నట్లు ఉంటుంది.''

అతను యాంత్రికంగా అన్నాడు. ''ఏదైనా జరిగిన తర్వాత మనుషులు ఎట్లా ఉంటారు ఏమీ జరగనట్లే ఉంటారా'' అతను నిర్మల కళ్లలోకి చూస్తూనే ఉన్నాడు, తన సందేహానికి ఏమైనా సమాధానం దొరుకుతుందేమోనని. ఉంటే రాబడదామనే ఉద్దేశ్యంతోటే మాట్లాడటానికి మొదలుపెట్టాడు.

కాని ఆ అవకాశం లభించలేదు. నిర్మల కళ్లలో తనకు పనికివచ్చే భావం ఏమీ కనబడలేదు. లోపలినించి కేక విని వచ్చి నిర్మల లోపలికి వెళ్ళింది.

తను నిర్మల బాధ్యత స్వీకరిస్తే, శకుంతలవల్ల యిబ్బంది మాట అల్లా ఉంచి, ఏమీ అవకముందే శకుంతల అడ్డుగా వచ్చి నిల్చుంది. ఇదంతా ఏదైనా మంత్రాంగమో, అనుకోనివిధంగా ఉండే సంఘటనో గూడా తెలియటంలేదు. శకుంతల నిర్మలకు స్నేహితురాలు కావటం, అయినా నిర్మల శకుంతలని మొగుడు ఎందుకు వదిలిపెట్టాడు అని అడక్కపోవటం, అడగకపోయినా శకుంతల స్నేహితురాలికి చెప్పకపోవటం, తను వచ్చేటప్పటికి ఆమె ఊహించటానికి వీలు లేనట్లుగా అక్కడ ఉండటం, యివన్నీ మామూలుగా జరిగే విషయాలు కావు. అయినా జరిగాయి. మామూలుగా ఏ ఆడదీ, మొగుణ్ణి వంచించటం, అందులో శకుంతల వంచించినట్లు నమ్మకంగా వంచించటం గూడా తను మామూలుగా వినాలేదు, చూడనూ లేదు. అయినా జరిగింది.

మిగతావన్నీ సరిపెట్టుకున్నా ఒక్క విషయం మాత్రం సరిపెట్టుకోలేక పోతున్నాడు. నిర్మలకు ఏమీ తెలియకుండా ఉంటుందా? శకుంతల దగ్గర్నించి ఏమీ గ్రహించకుండా ఉంటుందా? మిగతా అన్నీ సంభవాలతోపాటే, అదీ సంభవమే ననిపించింది. తను మాత్రం చెప్పాడు యిన్నాళ్లనించీ? తన దగ్గర్నించి మాత్రం గ్రహించిందా? తనే యివ్వాళ చెప్పటానికి వచ్చాడు. ఆ వచ్చింది తన అసమర్ధతని గురించి చెప్పటానికి వచ్చాడా? ఆ వంచకి వంచనని గురించి చెప్పటానికి వచ్చాడు. శకుంతలా అంతే! ఏమీ చెప్పిఉండదు. చెబితే మాత్రం తన తప్పుచెప్పి తనను న్యూనత పరచుకుంటుందా? చెబితే అంతా తనమీదనే, తప్పంతా తనమీదనే పేర్చి చెప్పి ఉంటుంది. వాళ్ళయింట్లో గూడా అదే చెప్పిఉంటుంది. లేకపోతే వాళ్లవాళ్లు తన దగ్గరికి రాకపోయారా. తన దగ్గర ఉండటం కంటె చచ్చిపోవటానికి సిద్ధపడతాను అని చెప్పి ఉంటుంది. లేకపోతే యీ రెండేళ్లు వాళ్లు ఎందుకు ఊరుకుంటారు? తను కిరాతకుడుగా, రాక్షసుడుగా చిత్రించి ఉంటుంది.

దాంతో అతని కోపం శకుంతలమీద కట్టలు తెంచుకొని ప్రవహించింది. తనన్నీ, తన పరువుప్రతిష్టల్నీ, తన జీవితాన్ని సర్వనాశనం చేసింది కాకుండా, తనని సరిగ్గా అర్థం చేసుకోనివ్వటానికి గూడా అవకాశం లేకుండా, తన జీవితం పునర్నిర్మించుకోవటానికి అవకాశం లేకుండా యిక్కడ దాపురించింది. తన జీవితానికి అశనిపాతంలా దాపురించింది.

వాళ్లనాన్న వచ్చిన సవ్వడి విని నిర్మల రావటం, తండ్రికి పరిచయం చెయ్యటం, అన్నీ సవ్యంగానే జరిగినయ్. తనూ గూడా అన్నీ యాంత్రికంగానే, అయినా సవ్యంగానే జరిపాడు. మనస్సుకి ఎప్పుడో తప్ప, మిగతా సాధారణ పరిస్థితుల్లో తప్ప, తనమీద అధికారం లభించదు. దేనిలోనూ లోపం రాలేదు. ఇంతకంటే మరీ విపత్కర పరిస్థితుల్లోనే యాంత్రికంగా పనిచేశాడు.

భోజనం చేసిన వెంటనే బడలికగా ఉందని, తను తనకై నిర్దేశించిన గదిలో విశ్రమించాడు. అతని విలువ తెలిసిన నిర్మల అక్కగారు గాని, తండ్రిగాని అతన్ని విసిగించటానికి ప్రయత్నించలేదు. నిర్మల బెజవాడలో తీసుకున్నంత స్వతంత్రం యిక్కడ తీసుకోలేదు. అయినా ఒకసారి వచ్చి అడిగి వెళ్ళింది. తలనొప్పిగా ఏమన్నా ఉందా అని, ఉంటే అమృతాంజనం తెస్తానని. అక్కర్లేదని ఆమె వెళ్లిన వెంటనే తను మళ్లీ ఆలోచనలో పడ్డాడు, తెల్లవారబోతుండగా చంటివాడి తండ్రి వచ్చాడు. ఆయన వచ్చినప్పుడు గాని ప్రసాద్రావుకి అంతదాకా తను మేలుకొనే ఉన్నానని తెలియలేదు. ఆయన కాస్త హడావుడి మనిషి. కాఫీలు పూర్తి అయ్యేలోపలే కాస్త అందర్నీ తొందరపెట్టి, పెందరాడే కాఫీ త్రాగి

కావలసినవి తీసుకురావటానికి బజారుకు వెళ్లాడు. మావు గారు వెంట వస్తానంటే అఖ్కర్లేదని, ఆడవాళ్లవెంట వెళ్లి పిలుపులూ అవీ కానిమ్మని వెళ్లిపోయాడు.

శకుంతల మామూలుగానే వచ్చింది. నిర్మల తనే వద్దామనుకుంటున్నానని చెప్పింది. తన పెద్దక్కయ్య, చెల్లెలూ రావటంలేదని కూడా చెప్పింది. ఆలోచనలలో సతమత మవుతున్న ప్రసాదరావు యిది గమనిస్తూనే ఉన్నాడు.

నిర్మల అన్నది, ''ఇంకా నాలుగు యిళ్లూ మిగిలిఉన్నయ్, పిలిచివద్దాం రావే. బట్టలు మార్చుకో''. శకుంతల నిష్కర్షగానే చెప్పింది. ''అవసరంలో సాయపడదామనే వచ్చాను. ఇంకేమన్నా పని ఉంటే చెప్పు. చేస్తాను. పిలుపులికి మాత్రం నేను రాను.''

నిర్మల తనకు అర్థమైనట్లు చెప్పింది. 'ఫరవాలేదు రావే. నిన్ను వేసే ప్రశ్న లన్నిటికీ నేను సమాధానం చెబుతాగా. పద లోపలికి, ఆ కనకాంబరం చీర కట్టుకుందువుగాని''

ఈ మాటలు దూరంగాలేని, తలుపులు తెరిచిఉన్న గదిలో కూర్చొనిఉన్న ప్రసాదరావుకుకూడా వినిపించినయ్. అడిగినవాళ్లకీ, అడగనివాళ్లకీ, తనని గురించీ, బాధ్యతలేకుండా తను వదిలిపెట్టడాన్ని గురించీ, తన నిర్దాక్షిణ్యం గురించీ చెప్పి తన వంచనని, తనమీదకి నెట్టుతున్నదన్నమాట. ఎదటివాళ్లు వేసే అడ్డప్రశ్నలకి, నిర్మల సమాధానం చెబుతుందన్నమాట సవ్యాఖ్యానంగా. ఇంతకుముందే మగవాళ్ల నిర్దాక్షిణ్యం గురించి నిర్మల లెక్చర్లు చాలానే యిచ్చింది. ఆడవాళ్లు ఏం చేస్తారు, ఏం చెయ్యగలరో తెలియని, వూహించలేని నిర్మల తెలిసింది కాస్త చేసి వూరుకుంటున్నది. ఆడవాళ్ల గొప్పతనం, క్షమ మగవాళ్ల నిర్దాక్షిణ్యం బాకావేసుకొని చెప్పి వస్తుంది.

వాతావరణం అంతా అట్లా మారి ఉంది. ఆ మారిన వాతావరణంలో తను అతనే అని తెలియదు కాని, తెలిస్తే తను చెప్పినా సరే శకుంతల చేసినపని ఎవరూ నమ్మరు. ఆమె వంచన, తను నిజంగా చెప్పే ఆమె వంచన, యింతకుముందే తన నిర్దాక్షిణ్యంతోనూ, ఆమెలో కలిగిన జాలితోనూ ఉన్న ఎవరి హృదయాలలోనూ చోటు చేసుకోలేదు. ఆడవాళ్ల బొంకులు వాళ్ల కన్నీళ్లు అన్నీ కలిపి నిజం కంటే బలీయంగా పనిచేస్తయ్. ఆ విషయం అప్పుడే అతని వూహకు వచ్చింది. వాళ్లు రాక్షసులు. వాళ్లు శూర్పణఖలు.

నిర్మల శకుంతలని బలవంత పెడుతూనే ఉంది. శకుంతల రానంటూనే ఉంది. అది చూసి వాళ్ల అమ్మ అన్నది : ''పోనీ నువ్వూ, అక్కయ్యా కలిసి ఒక్క నిముషంలో పోయి వచ్చెయ్యకూడదూ. ఏదో చికాకుల్లో ఉన్న ఆ అమ్మాయిని బలవంత పెట్టటం ఎందుకూ.'' ఇంకా ఆమె పైకి వినపడేట్లుగానే అనుకుంది. ''పెద్దమ్మాయి, జయ వచ్చిఉంటే యీ యిబ్బంది లేకపోయేదిగా.'' ఆమె వాళ్లకు చెప్పాలనే అన్నది : ''శకుంతల చంటివాణ్ణి చూస్తూ నాకు సాయం ఉంటుంది, మీరు త్వరగా వెళ్లిరండి''. ఈ మాటలకి నిర్మల వాళ్ల అక్కయ్య చాలా సంతోషించింది. పేరంటానికి అన్నా, పిలవటానికి అన్నా, ఆడవాళ్లు మరింకేదైనా మరిదేనికీ లేటంత సంతోషపడతారు.

దాంతో నిర్మల, వాళ్ల అక్కయ్య చంటివాడి బాధ్యత తల్లిమీదా, శకుంతలమీదా వదిలేసి, వాన వస్తున్నట్లు ఉంది తడవబోకండే, అసలే పచ్చి ఒళ్లు, అనే సలహా ఒక్కటే పుచ్చుకొని, వాన వచ్చేదాకానా, యిట్టే తిరిగి వచ్చెయ్యమూ అని, వాన వచ్చినా తడవం అన్నట్లు ధైర్యం చెప్పి వెళ్లారు, తండ్రిని వెంట బెట్టుకొని.

కాని ఆ వద్దా మనుకున్న వానకి మాత్రం వాళ్లకుండే ఖాతరు ఉన్నట్లు కనబడలేదు. దాని మానాన అది ఎవరే మనుకున్నా సరే అన్నట్లు రానే వచ్చింది, పబ్బంది చూడకుండా. వంటింట్లో మడి గట్టుకున్న నిర్మల వాళ్ల అమ్మ, ఉయ్యాలలో హాయిగా చల్లగాలికి నిద్రపోదామని ప్రయత్నించే చంటివాడూ, అవీ, యివీ అందించటానికి శకుంతల, కోపం మాత్రం మిగిలిపోయిన ప్రసాదరావు ఆ యింట్లో తీరికలేకుండా మిగిలిపోయారు.

లోపల ముసిలామె పురమాయించిన పనుల్తో, శకుంతల ప్రసాదరావు ఉన్న గది ప్రక్కగానే తిరగవలసి వచ్చింది. ఆమె అటు తిరిగినప్పుడల్లా, ఆమె అడుగుల చప్పుడు విని పించినప్పుడల్లా, ప్రసాదరావులో కోపం భరించలేనంతగా విజృంభిస్తోంది. నిర్మల సాన్నిహిత్యంతో రూపరహితంగా ఉండి పోయి, అసలు పూర్తిగా వెళ్లిపోయాయనిపించిన కోపద్వేషాలు ఎక్కడికీ పోలేదు. ఏం చెయ్యమంటావో చెప్పు అని వచ్చి కూర్చున్నయ్.

నిర్మలా, శకుంతలా, శూర్పణఖా, యిప్పుడు ప్రసాదరావుకి అంతా ఒకటే. ఇప్పుడు వాళ్ల ఖాతరు లేదు. ఖాతర చేస్తున్నదల్లా తనలో విజృంభిస్తున్న కోపద్వేషాల్ని గురించే. బైటికి వెళ్తే కొంత సుఖంగా ఉంటుం దనుకుంటున్నాడు. బైటంతా జోరుగా కురిసే వాన చల్లగా ఉంది. తను వర్షానికీ ఖాతరు చెయ్యాలి. లోపల ఉన్న క్రోధ ద్వేషాలు మాత్రం దేనికీ ఖాతరుచేసేట్లు లేవు. శకుంతల అడుగుల చప్పుడు వినిపించినప్పుడల్లా అతను కదిలిపోతున్నాడు.

వచ్చిన అతిథిలాంటి చుట్టంయొక్క విలువ తెలిసిన నిర్మల తల్లికి గూడా వర్షం ఆటంకంగానే ఉంది. అతనికి కాఫీ తీసుకెళ్లి యివ్వటానికి నిర్మలని రాకుండా ఆపివేసింది. తడి గుడ్డలతో తను అతని ఎదుటికి రాలేదు. కాఫీ యివ్వకుండా ఉండటానికి వీలులేదు. మర్యాదకు మారుపేరుగా వ్యవహరించబడే కాఫీ ఆ మర్యాదని కాస్త తగ్గించటం, పెంచటం గూడా చేస్తుంటుంది. ఇప్పటివాళ్ల పరిస్థితితో తగ్గటం అంటే నిర్మల శాశ్వతంగా ఏకాకిగా ఉండిపోవటం అన్నమాట. మర్యాద పెరిగితే అది ముందు కొంత మంచికి దోహదం చెయ్యవచ్చు. కేవలం కాఫీకి యింత శక్తి లేకపోయినా, కాఫీ మర్యాదకి ఒక భాగమే అయినా మర్యాదకోసం కాఫీ యిచ్చి తీరాలి. మర్యాద నిలబెట్టుకొని తీరాలి. ఆ విషయం ఆమెకి బాగా తెలుసు.

# స ద్గ మ యం లో

కనీసం వర్షంలోకి వెళ్తేనన్నా తగ్గి ఉండే లోపం ముసురుతున్న కోపద్వేషాల మధ్యలో ఉడికిపోయి బైటికివచ్చే వేడి నిశ్వాసాల దగ్గరికి, బైట వర్షధారలో తడవని, లోపల దైన్యం, సంకోచాలలో తడవకుండాలేని శకుంతల, అణచుకోలేని వేడిని బైటికి తరుముతుండే కాఫీ కప్పుతో వచ్చింది. అతను కూర్చున్న మంచం దగ్గిరగా, దూరంగా ఉన్న స్టూలు ఒక చేత్తో లాగి దానిమీద కప్పు ఉంచుతూ అన్నది "ఇదుగో కాఫీ తీసుకోండి."

క్రుద్ధుడై ఉన్న ప్రసాదరావు అన్నాడు "అయితే అందరికీ నేను క్రూరంగా నిన్ను వదిలేశానని చెబుతున్నావన్నమాట."

ఆమె తెల్లబోయి, గర్జిస్తున్నట్లు ఉన్న అతని ముఖం వేపు ఒకసారి చూసి, తల దించుకొని అన్నది "నేను ఎవ్వరికీ ఏమీ చెప్పలేదు."

"చెప్పలా ! చెప్పకుండానే వాళ్లంతా అనుకుంటున్నారు. నువ్వు ఎందుకు చెప్పలేదు, తప్పంతా నాదేనని, నేనే కారణం అని."

ఈ మాటలు అనకముందే అతని చేతులు బల్లమీదికి వంగి కాఫీ కప్పు ఉంచి పైకి లేవబోతున్న ఆమె బుజాలని బలంగా ముందుకూ వెనక్కూ వూపుతున్నయ్.

ఆమె నిశ్చలంగా అన్నది, "అదే శ్రేయస్కరం" అని. శకుంతల అతనివైపే చూడలేదు. వాళ్లని అనుకోనివ్వమని వూరుకున్నా ననటంతో అతని ప్రకృతి విజృంభించింది. తన గౌరవంమీద ఉదాసీనత చూపిన ఆమె భుజాలమీద నుంచి అతని చేతివ్రేళ్ళు ఉదాసీనంగా కాకుండానే గొంతుదాకా జరిగినయ్. అతను అన్నాడు "ఎవరికి శ్రేయస్కరం. నాకా, నీకా" వ్రేళ్లు బలంగా కదులుతున్నయ్. ఆమె తల ఎత్తలేదు. అతని క్రోధమంతా చేతులూ, వ్రేళ్లు భరించలేక పోతున్నయ్. అయినా ఆమె మాత్రం అతని చేతుల వత్తిడి, , వ్రేళ్ల తాకిడి భరిస్తూనే ఉంది. భరించటానికే ఉన్నట్లు నిశ్చలంగానే ఉండి అన్నది, తల ఎత్తకుండానే.

"మీకే."

అతనికి ఆ మాట స్పష్టంగానే వినిపించింది. ఆశ్చర్యం వేసింది. చేతులు వెనక్కు జరిగి తిరిగి వచ్చినయ్. ఆమె చెబుతూనే ఉంది. "ఆ అనుకునే ప్రతివాళ్లూ అనుకుంటూనే ఉంటారు. దూరానికి వినపడేలాగా గూడా అంటారు. ఇదేదో చెయ్యకపోతే వదిలేస్తాడా అని. అది చాలు ప్రతి నిమిషం నా పతనం గుర్తు తేవటానికి, మీ గౌరవం పెరగటానికి."

తన ఆవేశంలో విన్న ఆ మాటలు అర్థంచేసుకోవటానికి అన్నట్లు అతను తిరిగి ప్రక్కమీద సరిగ్గా కూర్చున్నాడు. ఆమె అప్పటికే ఒకసారి గుమ్మంవైపు చూసి తిరిగి అతని పాదాలు తాకుతూ అంది. "మీరు క్షమించారు, అది చాలు. క్షమించరాని నాకు, క్షమించలేని యీ సమాజం మధ్యలో జీవితం మొండిగా లాగటానికి, చావలేని నాకు, బ్రతకటానికి ఆ తృప్తి ఒక్కటే చాలు."

అతనికి తన ముఖం కనబడకుండా తిరిగి వెళ్లిపోటానికి వెనక్కు తిరిగింది. అతను ఉదుటున ఆమె చెయ్యి పట్టుకుని "శకూ" అన్నాడు. అతని నోటివెంట మాట రావటంలేదు. ఆమె అతనివైపు తిరిగింది. చేసిన తప్పుకు క్షోభించిపోయి క్షమారహితమై ఆమె కళ్లలో నించి జారే దైన్యం, నిస్సహాయత అతనికి కనబడ్డయ్. అతని చెయ్యి శకుంతల చేతిని యింకా బలంగా నొక్కుతున్నది.

చేయి విడిపించుకోవటానికి ప్రయత్నంచేస్తూ అన్నది షీ, ఛీ! వెర్రి వ్యామోహంలో పడి నేను నాశనమైతే; అది తెలిసిన తర్వాత గూడా మిమ్మల్ని నాశనం కానిస్తానా, అల్లా ఎప్పుడూ జరగనివ్వను. నిర్మలతో మీరు సుఖపడతారు. నిర్మలకు నాలాంటి వెర్రి వ్యామోహం లేదు. ఎప్పుడూ పడదు."

మాటలు వింటూంటే చేతులు గూడా పరధ్యాన్నంగానే ఉంటయ్. ఆమె చెయ్యి జార్చుకొని వెళ్లిపోయింది. అప్పటికే గదిలోకి వెళ్ళిన ఆ కొద్ది నిముషాలలోనే భయసందేహాలతో తనకు తెలిసినా, శకుంతల ఏ దొడ్లోనో ఉన్నట్లు పిలిచిన నిర్మల వాళ్ల తల్లి కేక అతనికి స్పష్టంగా వినిపించింది. కేక వేసింది నిర్మల తల్లి అయినా, కేక వేసింది నిర్మలకోసమైనా, ఆ కేక అనిర్వాచ్యమైన మరో ప్రపంచం నించి అతన్ని యీ ప్రపంచంలోకి పడేసింది. అతను లేచి గుమ్మందాకా వెళ్లి ఒకసారి వంటింటివేపు, ఒకసారి బైటవేపు చూచి వచ్చాడు. అక్కడ అంతా మామూలుగానే ఉంది. ఎక్కడా ఏమీ జరిగినట్లు లేదు. అతను తిరిగి వచ్చి ప్రక్కమీద కూర్చున్నాడు.

క్షణంలో మెరుపు మెరిసి, మాయమైనపుడు చుట్టూ ఉన్న అంధకారం మధ్యలో గూడా మనస్సులో మాత్రం ఆ మెరుపే మెరుస్తుంది. అతను మంచంమీద కూర్చుంటే విద్యుల్లతలా, మనస్సులో మెరిసిన సందేహం అడిగింది "నువ్వు నిజంగా క్షమించావా ?"

తను క్షమించాడో లేదో, క్షమాపణ అంటే ఏమిటో అనే విషయం తేల్చుకోనీకుండానే, వర్షాన్ని పరిపూర్తిగా తగ్గనివ్వకుండానే పేరంటానికి వెళ్లినవాళ్లు బజారుకు వెళ్లిన చంటివాడి తండ్రీ అంతా వచ్చారు. వర్షం ముందంత కుండపోత పోయకపోయినా, సన్నగా పడుతూనే ఉంది. అతని మనస్సుమీద గూడా పెనుతుఫాను తగ్గినా సన్న, చిన్న ప్రశ్నల తుంపర మాత్రం పడుతూనే ఉంది.

తర్వాత కార్యక్రమం అంతా సవ్యంగానే, మామూలుగానే జరిగిపోయింది. భోజనాలు అయి మగవాళ్లు విశ్రమించారు. ఆడవాళ్లు విశ్రాంతిలాంటి కబుర్లాడుకుంటున్నారు, విశ్రాంతికోసం.

ప్రసాదరావు తన ప్రక్కమీద మేలుకొనే పడుకున్నాడు. హడావుడిచేసే చంటివాడి తండ్రి భోజనాలు చేసిన వెంటనే హడావుడి అయిపోయినట్లు, హడావుడిచేసి విశ్రాంతి తీసు

కున్నట్లు రాత్రంతా నిద్రలేకపోవటంవల్లనేమో ప్రసాద రావుని విసిగించకుండా నిద్రపోయాడు. ముసలాయన ఎక్కడికో వెళ్ళాడు. వర్షం తగ్గిపోయింది' పోతూ పోతూ కనపడ్డ వాటిని, ఖాళీగా ఉన్నవాటినీ నింపి పోయేటట్లు. ప్రసాదరావు ఖాళీగా ఉన్న మనస్సును కూడా ఆగిపోయిన యింకో వర్షం నింపే పోయింది.

ఏం మాట్లాడుకుంటున్నారో సరిగ్గా వినపడకపోయినా మాట్లాడే నిర్మల గొంతు, మాట్లాడలేక ఓరగా, మర్యాదగా వినవస్తున్న శకుంతల గొంతు మధ్య మధ్య వినిపిస్తున్నయ్. లోపల పడ్డ ప్రశ్న జల్లులు అంతా ఒకే పెద్ద ప్రశ్నగా ఘనీభవించినట్లు ఉంది. అది అతనికి భరించలేనట్లు అనిపించింది. తను నిజంగా క్షమించాడా ? క్షమించటం అంటే ఏమీ జరగనట్లే, అంతా మరిచిపోయినట్లే సమాధానపడి, శకుంలతో కొత్త జీవితం ప్రారంభించటమా ?

సమాధానంకోసం వెతుక్కొంటున్న ప్రసాదరావుకి, సమాధానం యివ్వలేని ఆ ప్రశ్న, సమాధానంరాని ఆ వాతావరణం, అన్నీ అక్కడ తను ఉండటానికే అవకాశం లేనంత చికాకు పరుస్తున్నయ్. తను తిరిగ్గా సమాధానం వెతుక్కోవాలి, లేకపోతే యీ అశాంతితో కష్టం.

తిరిగ్గానే పని ఏమీ లేకుండానే పడుకున్న ప్రసాదరావు, తిరిగ్గా సమాధానం వెతుక్కోవటానికి ఆ దొరికిన సమాధానంతో కలిగిన అశాంతి పోగొట్టుకోవటానికి బయలుదేరాడు.

అర్థాంతరంగా బట్టలు వేసుకొని సంచితో బయటకు వచ్చిన ప్రసాదరావునుచూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. నిర్మలే సంబాళించుకొని అడిగింది. ''ఇదేమిటి యీ బయలుదేరటం.''

అతను నవ్వు తెచ్చుకొని చెప్పాడు ''వచ్చిన పని అయిపోయిందిగా.''

''పోనీ రాత్రిబండికి వెళ్లకూడదా'' అంది నిర్మల, ఈ బయలుదేరటం ఎందుకో, ఆగటానికి ఏంచెయ్యాలో వెంటనే తోచక.

''మీ నాన్న ఎక్కడికి వెళ్లారే ?'' అన్నది నిర్మల తల్లి. ఆయనైతే సర్ది చెబుతారనే ఉద్దేశ్యంతో. ఆమె శకుంతల వైపు ఒకసారి అనుమానంగా చూడటం పట్టించుకున్న ప్రసాదరావుకి తప్పు పట్టించుకోని ఎవరికీ తెలియదు.

''అఖ్కర్లేదండీ, ఏదో పనిమీద వెళ్లిఉంటారు. వస్తే చెప్పండి'' అంటూనే గుమ్మంవైపు నడిచాడు. అర్థంలేని ప్రసాదరావులో వచ్చిన యీ అర్థంకాని మార్పు తెల్లబోయి చూస్తూ నిర్మల అతని వెంట వీధిగుమ్మందాకా నడుస్తూ అన్నది ''ఏ విషయంలో లోపం జరిగినా క్షమించండి. ఈ వెళ్లిపోవటానికి కారణం అదే అయితే'' అంది.

గుమ్మందాటిన ప్రసాదరావు, గుమ్మంలోకి వచ్చి ఆగిన నిర్మలని ఒకసారి తిరిగి చూశాడు. నిర్మల వెంటనే వచ్చి గుమ్మానికి దూరంగా నిలబడిపోయిన శకుంతల గూడా కనిపించింది.

ప్రసాదరావుకి ఆమె అన్న మాటలు వినిపించినయ్యో లేదో తెలియదు. వినిపించింది తనతోపాటు గుమ్మందాటిన ప్రశ్న ఒక్కటే, 'తను క్షమించాడా.''

గుమ్మంలో స్థానంలేని శకుంతలవైపు నించీ, గుమ్మంలోకి వచ్చి ప్రవేశం కోసం ఆగిన నిర్మలవైపునించీ చూపు మళ్లించుకొని, గుమ్మం దాటి ప్రవేశించిన సందేహాలనీ, అశాంతినీ వెంట తీసుకొని శాంతికోసం, సమాధానం కోసం వడివడిగానే నడిచి వెళ్లాడు.

---

మ. అయవారై చరియింపవచ్చు, తన పాదాంభోజ తీర్థంబుల్
దయతో గొమ్మనవచ్చు, సేవకుని నర్థప్రాణ దేహాదుల
న్నియు నా సొమ్మనవచ్చుగాని సిరులన్నిందించి నిన్నాత్మని
ష్ఠప్రియతం గానంగరాదు పండితులకున్ శ్రీ కాళహస్తీశ్వరా!

# భరతపక్షి

శ్రీ దాశరథి

వలలు తెగినవనెదు? పైడి పంజరములు
విరిగి పడినవనెదు? భరతపక్షి!
వ్యాధుడొకడు మంచు బండల చాటున
దాగి వలలు విసర సాగినాడు.

రెక్కలుకోయగా కలవరించు నొకానొక రాక్షసుండు; నీ
ముక్కున ముండ్లు గ్రుచ్చదలపోయును వేరొకదానవుండు, నీ
చక్కని రూపరేఖలను, చల్లనిచూపును మెచ్చువాడు నే
డొక్కడు లేడు; మానవ మహోదధి నన్ని మొసళ్లనోళ్లెగా!

కత్తిని చేతపట్టుకొన గల్గినవానికి కేలు మోడ్తురే!
మెత్తని సన్నజాజి కుసుమించిన తోటకు నిప్పుపెట్టి గ
మ్మత్తును చూతురే! మధుర మంజులగానము జిమ్ము కంఠమున్
కత్తెర వేతురే! విషము గ్రక్కెద రే మధుభాండ మందునన్!

నీలాకాశపథాల న్నీ వెగసినన్ నీరెక్కలన్ జేరి ప
ద్యాలన్ పాడును శీత వాతములు సంధ్యావేళ; శీతాచల
ప్రాలేయాంచల చంచలాంబు కణముల్ రత్నమ్ములై వెల్గి హా
రాలన్ వేయును నీ గళమ్మున హరిద్రాకాంతి మంతమ్ములై!

బాణము నెక్కువెట్టి ఒక వ్యాధుడు, బుద్ధునిబోధ విన్న మా
గాణము నుండి నేడు విషకల్మష దృష్టుల నిన్ను చూచెడిన్
గాని, విశాలనీల గగనమ్మున నీదెడి నీదు గుండెలో
తేనెలు నిండియున్నవి వధించెడువారికి పంచిపెట్టగా.

సామ్య వాదమనుచు, శ్రామికా మోద మం
చేదో యేదో నిర్వచించినాడు

కరకుటెరుకువాడు; కడగు బాణముదూసి
పిట్టతల్లికి గురిపెట్టినాడు.

కోప మెరుగబోవు, పాపమ్ము నెరుగవు,
నీదుచూపు దయకు నిలయమగును;
నిన్ను చంప జూచుచున్న వ్యాధుని గుండె,
వాని బాణమునకె వ్రయ్యలగును.

ఎదురుతిరిగెవాని పదను బాణము నేడు
గుండె లోతులందు గ్రుచ్చుకొనెను;
భరతపక్షి! నీవు పరమపావన నభో
గాంగ సైకతముల చెంగలింతు.

మంచుకొండ చెంత మసలిన అగ్గి జం
డాలు శాంతి జడికి డీలువడెను;
వేటకాడు ములికినాటి కూలినచోట
బాష్పకణము రాల్చవచ్చి తీవు!

---

# పొడుగు - గిడుగు

ఆ. వె. పొడుగు రామమూర్తి గిడుగు శ్రీరామమూ
ర్తికని గూడ కర్ణతృప్తి కలుగ,
వీణవాదనమున విఖ్యాతి జెందె న
టన్న నతని విద్య నెన్నగలమె?

అని తిరుపతి వేంకటకవులు.

పొడుగు రామమూర్తి పూర్వ గంజాము మండల నరసన్నపేట వాస్తవ్యుడు-గొప్ప వైణికుడు - సంగీత సాహిత్య చక్రవర్తి అజ్జాడాది భట్ట నారాయణదాసు పొడుగు రామమూర్తి వీణావాద్యవేళ ప్రశంసించినాడన్న నిక నితరుల ప్రశంస లనావశ్యకము.

గిడుగు రామమూర్తి పంతులుగారును గంజాము మండలమున పర్లాకిమిడి వాస్తవ్యుడు. పంతులుగారి చెముడు జగత్ప్రఖ్యాతి—బ్రహ్మచెముడు అనునది యీ భాషా బ్రహ్మయెడల సార్థకము. అట్టి గిడుగు పంతులుగారికి చెవి కింపుగా వీణ వాయింప నేర్చు గల వాడైన పొడుగు రామమూర్తి శక్తి యెట్టిదో సరసముగ తిరుపతి కవులు నిరూపించినారు.

కారుమేఖం (చిత్రము 2)

# శిల్పచిత్రకళలో కవిత్వంచెప్పే జీన్ ఆర్ప్



**శ్రీ ఎస్. వి. రామారావు**

**"నా ఉత్పత్తు శిల్పాలు, నీటి రంగు చిత్రాలు, ఆకారవికారాలు మానవుడు మరచిపోయిన వాటిని తిరిగి నేర్పే సాధనాలు-కండ్లు తెరిచి అతనికి అతను కనే కలలు" జీన్ ఆర్ప్.**

వేలకువేలు చిత్రకారులు శిల్పకారులు యుగ యుగాల నుండి ఉన్నా వారందరిలో బహుకొద్దిమంది మాత్రమే మిగులుతారు, కళల గురించి మాట్లాడుకుంటే. కొందరి జీవితాలు మాత్రమే పదే పదే చదువుతాం వారి వారి రంగాలలో. ఇలా నిలవాలని, తర్వాత తరంవారు తమను తలచుకోవాలనే ఈ అసంఖ్యాక సృజనాత్మక కళాకారులు తమ జీవితాలను వ్యయ పరుస్తారు, తాము నమ్మిన కళల కోసరం. అయినా కాలం వారిలో కొందరిపైనే విజయ పరంపరలు కురిపిస్తుంది. వారే మైలురాళ్లు మనకు. ఒక్కొక్క మైలురాయి ఒక్కొక్క అందానికి, ఒక్కొక్క అనుభవానికి నిదర్శనం. విచిత్రం ఏమిటంటే యిలా మిగిలిన, నిలచిన అజేయులు విభిన్నంగా, ఒకరికొకరు బహు దూరంగా నిలచి కృషి సాగిస్తారు. ఒకే తరంలో ఉన్నా వారు, తమ స్థాయిలో ఉన్న యితరుల ప్రభావం వారిపై బడకుండా ఉండటానికి ఎంతో శ్రద్ధ వహిస్తారు. తమ సాధనకు ఆటంకం కలుగుతుందని, తమ గురి చెయ్యరు

తుందని భయం. అలా కాకపోతే వారి విశృంఖలతకు భంగం కలుగుతుంది. వారి తపస్సు భగ్నం అవుతుంది. అందువల్లనే ఒకే తరంలోని యిద్దరి ప్రముఖ చిత్రకారుల చిత్రాలను చూస్తే కన్పిస్తుంది వారి భిన్నత్వం.

పాశ్చాత్య దేశాలలో కళా రంగాలలో వచ్చిన, వస్తున్న మార్పులు మనకు తెలిసినవే. ఆధునిక విజ్ఞానం ఎంత వేగాన పరుగులు తీస్తోందో అంత వేగాన కళారంగంలోని పద్ధతులు గూడ పయనం చేస్తున్నాయి. ఇలా పరుగులు తీయడం మానవనైజం. లేకపోతే ఏమిటి, ప్రశాంతంగా ఉన్న కాలంలో శాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధి చెందించి మారణ యంత్రాలను తయారుచేస్తాడు మానవుడు ? తన మేధస్సుకు తానే పులకరిస్తాడు. తీరా యివి మానవ విధ్వంసానికి దారితీసే సమయానికి శాంతికాముక ప్రయత్నాలను సాగిస్తాడు. ఎంత వైవిధ్యం అతనిలో ! ఎంతఉన్నా శాంతి లేదు మానవునకు. ఏమి లేకపోయినా శాంతి లేదు మానవునకు. ఇలా మానవుడు చెడుగుడు లాడవలసిందే. లేకపోతే కాలచక్రం ఆగిపోదూ !

చిత్రకళారంగంలో ఎన్నో మార్పులను చూచాం. ప్రకృతిని మానవుని ఉన్నది ఉన్నట్లు ప్రతిరూపాలను తయారుచేశాం. ఆనందించాం. మరల మనకే అందులో తృప్తి కలుగలేదు. ప్రకృతిని ఉన్నది ఉన్నట్లు గాదు, ప్రకృతిని చూచి ఆ అనుభవాన్ని మనోభావంతో జోడించి చిత్రించాలని చిత్రించాం. మరల అందులో ఏదో అసంతృప్తి. అసలు ఎందుకు ప్రకృతిని చిత్రించాలి అని ? మన మేధస్సును చిత్రిస్తున్నాం. ఇలా విభిన్నాతి భిన్నంగా సాగుతున్నది, కళారంగంలోని కృషి. ఏది ఏ పద్ధతిలో సాగినా ఒక భావం కోసరం, ఆ భావనలోని రసోత్పత్తి కోసరం ప్రయత్నిస్తున్నాడు చిత్రకారుడు— సృజనాత్మక చిత్రకారుడు. ఒక నిగూఢ సత్యాన్ని బయలు పర్చాలని తపన. ఇలా తపన చెందిన మేధావులలో ఒకరు జీన్ ఆర్ప్.

జీన్ఆర్ప్ అంతగా ప్రజలందరికి తెలియదు, హెన్రీ మూర్ తెలిసినట్లు. కాని చిత్రకారు లందరికి తెలుసు ఆర్ప్ గురించి. జీవితాన్ని కళ కోసరం ధారపోసిన బహు కొద్ది మంది వ్యక్తులలో ఈయన ఒకరు. మొట్టమొదటిసారి ఆర్ప్ చిత్రాల్ని అన్నిటిని ప్రపంచం నలుమూలల నుండి తెచ్చి ప్రపంచ విఖ్యాత Tate gallery లో ప్రదర్శించి ఇంగ్లండు గౌరవించింది చిత్రకారుణ్ణి. అలా తనను తానే గౌరవించుకుంది. ఇంతటి ప్రదర్శన ఎంతోమందికి అవకాశం కల్గించింది చిత్రకారుని పూర్తి జీవితాన్ని చదవడానికి. బ్రిటన్‌లోని ఆర్ట్స్ కౌన్సిల్ యిలా విశిష్ట ప్రదర్శనలను ఏర్పాటుచేసే కార్యక్రమాన్ని ఈమధ్య తలపెట్టింది. ఇలానే ఈ ప్రదర్శనకు ముందు Kokoshka కళా ప్రదర్శనాన్ని గూడ ఏర్పాటు చేసింది బ్రహ్మాండంగా.

ఆర్ప్ 1887 సెప్టెంబరు 16 న స్ట్రాస్‌బర్గ్‌లో జన్మించారు. మొదటినుండి తీవ్రవాది. ఏది అంతగా అతన్ని ఆకర్షించినట్లు కనిపించదు. అసంతృప్తి ఎక్కువ. ఈ అసంతృప్తే అనుకుంటాను ఒక తృప్తిని వెతుక్కునేందుకు దారి తీసింది. అదే అతనికి ఒక మార్గాన్ని చూపింది జీవితంలో. 1904 లో 'స్కూల్ ఆఫ్ అప్లయిడ్ ఆర్ట్స్' లో చేరాడు కళాభ్యాసానికి. ఆయన వ్రాస్తారు తన స్కూలులో విద్యాభ్యాసం గురించి, "ఎండిపోయిన పువ్వులను, దూది, గుడ్డపేలికలు మొదలగునవి కూరి ఉంచిన నిజమైన పిట్టల బొమ్మలను నిరంతరంగా 'కాపి' (Copy) చెయ్యడం నా డ్రాయింగును విషపూరితం చెయ్యడమే గాకుండా వివిధకళారంగాలలో కృషిని రసాస్వాదనను ధ్వంసంచేసింది. అందుకే కవిత్వంలో తలదాచుకున్నాను" ఇలాంటి వ్యక్తి జీవితం ఎలా సాగుతుందో ఊహించగలరు. తాను శిల్పకారునిగ, చిత్రకారునికంటె ఎక్కువగా రాణించారు. శిల్పకారుడుగా ఎంత పేరుందో రచయితగా, గ్రంథ కర్తగా, కవిగా అంత పేరుంది. అందుకే నాకు ఆయన శిల్పాలు చూస్తుంటే గేయాలు చదువుతున్నట్లుంటుంది. కవిత్వాన్ని ప్రత్యక్షరూపంలో, శిల్పాలుగా చూడడం ఒక అనుభవం.

ప్రదర్శనకు ఉదయమే వెళ్లాను. అంతగా ఎవరూ వచ్చిఉండలేదు. చల్లగా ఉన్న లండన్ వాతావరణంలో థేమ్స్ నది ఒడ్డునే నడచి (Tate gallery) చేరుకున్నాను. మూగగా ఉన్న ప్రదర్శనాలయంలో లైట్లమధ్య నగ్నంగా, నున్నగా శిల్పాలు జారుతూ మెరుస్తున్నాయి. అక్కడక్కడ గోడకు చిత్రాలు రంగులు పొదిగిన జిగినీ గొలుసుల్లా తెల్లని గోడలకు వ్రేలాడుతూ, స్త్రీల మెడలలోని నగలకు ప్రతి రూపాలుగా నిలచాయి. పాము మెలికలు తిరిగినట్లు వంకర టింకరలుగా ఉన్న గదులలో మనల్ని గది నుండి మరొక గదికి శిల్పాలు నడిపిస్తాయి. మొత్తం 189 — చిత్రా లయితేనేమి, శిల్పా లయితే నేమి, వేసిన తివాచీలలాంటి వైతేనేమి, రేఖా చిత్రా లయితేనేమి ఉన్నాయి. పాలరాతిలో మలచినవి, రాతిలో చెక్కినవి చెక్కలతో పేర్చినవి, రంగులు వేసిన శిల్పాలు, పాలిష్ చేసిన కంచు ఆకారాలు ఎంతో అందంగా రంగుల చిత్రాలతో మిళితమై ఒక క్రొత్త శోభతో ప్రదర్శన వెలుగుతున్నది.

హెన్రీమూర్‌కు ఈయనకు సంబంధం లేదు. ఇద్దరు రెండు విభిన్న శిఖరాలు. ఒకరు తృప్తిగా ఒక స్థాయి చెందాక కూర్చుంటే (హెన్రీమూర్), తృప్తి ఎరుగక పరుగులు తీస్తున్నవారు మరొకరు. ఒకరిది సంగీతం అందిస్తే, మరొకరిది గేయాలు వినిపిస్తాయి. ఒకరిది మానవ రూపాలకు ప్రతిసృష్టి అయితే (హెన్రీమూర్‌ది), మరొకరిది మరో రూపాలకు ప్రతిసృష్టి. అయినా యిద్దరూ అజేయులే.

ఆర్ప్ ప్రదర్శనను చూస్తుంటే నాకు ఎంతోమంది ప్రముఖ శిల్పకారులు మనసులో మెదలారు. అందరితో పోల్చి చూచుకున్నాను ఆర్ప్‌ను, ఏవిధంగా ఈయన ప్రత్యేకమైన

# శిల్పచిత్రకళలో కవిత్వంచెప్పే జీన్ ఆర్ప్

ఆర్ప్ అని. ఈయన ఎవరితోనూ కలువలేదు. ఏకాకిగా నిలబడిన సాహసి. ఒకరికి నచ్చినా నచ్చకపోయినా అడవిలో తన మార్గాన్ని తాను చేసుకుంటూ పోయిన బాటసారి. అడవిలోని ప్రతి చెట్టు తనకు తెలుసు. ఏ చెట్టును నరకాలో, దేనిని నరక గూడదో తెలుసుకొని అలా ముందుకు సాగుతూ పోతున్న ఏకాకి. అందుకే ఆయన చిత్రాలలో చెట్ల రూపాలు కనిపిస్తాయి. పండ్లు, పువ్వుల ఆకారాలు పలుకరిస్తాయి. ఆర్ప్ అంటాడు 'నిరంతరంగా ప్రకృతి సృష్టించే వివిధ రకాల ఆకారాలను చూస్తాను. ఆ ఆకారాలను పెంచడం కొరకు ప్రయత్నించాను. నా దృఢ నమ్మకాన్ని చెట్ల విత్తులలోను, నక్షత్రాలలోను, మేఘాలలోను, మొక్కలలోను, జంతువులలోను, మనుష్యులలోను చివరికి నా అంతరాంతరాళాలలోను ఉంచుకొని ప్రయత్నం సాగించాను. ఎంత బలంగా ఆర్ప్ కృషి పెట్టాడో తెలుస్తుంది దీనివల్ల. ఈ పైవన్నీ పెరిగేవే, ఎప్పటికప్పుడు తమ రూపాలను మార్చుకొనేవే. ఇలాంటి మార్పులతోడి జీవితంలోంచి క్రొత్త సృష్టి కొరకు ప్రయత్నించాడు. అతను చెక్కలో చేసిన **Reliefs** ను చూస్తే తెలుస్తుంది. రకరకాల ఆకారాలలో చెక్కలను కోసి, బల్లపరుపుగా ఉన్న చెక్కకు అతికించి వాటికి వివిధ రంగులను వేస్తాడు. అవి చూస్తుంటే విశాల ఆకాశంలో ఎగిరే మేఘాలా అని అనిపిస్తాయి.

ఎన్నో చిత్రకారుల గ్రూపులలో చేరాడు. వాటి నమ్మకాలను బలంగా నమ్మాడు. కాని వాటినుండి విడిపోయే వాడు. దేన్నీ పూర్తిగా నమ్మేవాడు కాదు. అతి చంచలం అతని మనసు. జూరిచ్ 'డాడాయిస్టుల' లో ఈయన ఒకడు. కాని దానికీ దూరంగానే వెళ్ళాడు. ''గార్డియన్'' లో ప్రఖ్యాత కళా విమర్శకుడు ఈతని అనిశ్చల స్థితి గురించి వ్రాస్తూ ''క్రొత్తగా వచ్చిన కళారంగంలోని పెక్కు సంఘాలలో ఇతని స్థానం హాస్యాస్పదంగానే ఉంటుంది ఎప్పుడూ. 1916—1919 ల మధ్య జూరిచ్‌లో వచ్చిన డాడాయిజమ్‌లో యితని స్థానం తల్లిలాంటిదా లేక నర్స్ లాంటిదా ? ఇరువదవ శతాబ్దంలో తన మిత్రులు 'కిరికో', 'ఎర్నస్ట్'లు తమ స్వప్నాలను చిత్రిస్తున్నప్పుడు యితను వారితోబాటు ''సర్రియలిస్టేనా ?'' నిజానికి యితను ఈ క్రొత్త సంఘాల (అంటే (**Dadaism, Surrialism** లకు) స్థాపకులలో ఒకడు కాదు, వీటిపై అభిమాన మున్న వేదాంతి కవి''.

ఏ సంఘానికి చెందినా చెందక పోయినా తను నమ్మిన దానినే ఆసాంతం కొనసాగిస్తూ పోయాడు ఆర్ప్. దీన్ని ఎవరూ కాదనలేరు. ఇంత పట్టుదల గలవాళ్ళు బహు కొద్దిమంది. తన రచనల ద్వారా, చిత్రాల ద్వారా ప్రచారం చేశాడు తన నమ్మకాలను. అతని రచనలు ఎంతోమంది ప్రముఖ చిత్రకారులను మార్చినవి, మలచినవి. స్థిరంగా పాతుకుపోయిన కళా పద్ధతులను విడిచిపెట్టి క్రొత్త భావాలను వెళ్ళగ్రక్కమని నూతన యుగ రంభంలో గొంతెత్తి అరచిన వ్యక్తి. ''చెట్టు నుండి ఉద్భవించే పండులాగ, తల్లినుండి బయలుపడే బిడ్డ మాదిరి కళ మనుష్యుని నుండి ఆవిర్భవించే ఫలం'' అన్న ధైర్యశాలి. ఇతని భావాలను వ్యక్తపరిచే భాష గూడా శిల్పాలంతా గంభీరతను, గట్టిదనాన్ని కల్గి ఉంటాయి.

''సర్రియలిజమ్ నాకు అండగా నిలిచింది కాని మార్చలేక పోయింది.'' ఇలా అనగలిగే ధైర్యం సల్వేడాల్ డాలికి గాని, మాక్స్ ఎర్నస్ట్‌కుగాని మరెవరికైనా సరే లేక పోయింది. మిత్రుడు మాక్స్ ఎర్నస్ట్ వ్రాస్తాడు ఆర్ప్‌ను గురించి, ''ఆర్ప్ మంత్రయుక్తమైన భాష మనల్ని మనం పోగొట్టుకున్న స్వర్గంలోకి, అనంత రహస్యాలలోకి తీసుకువెళ్ళి విశాల విశ్వంయొక్క భాషను అర్థం చేసుకునే పద్ధతిని నేర్పుతుంది.'' ఇది ఎంతవరకు నిజమో ఆర్ప్ తన కళ గురించి తాను చెప్పింది తెలియజేస్తుంది. ''నా ఉబ్బెత్తు శిల్పాలు నీటి రంగు చిత్రాలు, ఆకార వికారాలు మానవుడు మరచిపోయిన వాటిని తిరిగి నేర్పే సాధనాలు—కండ్లు తెరచి అతనికి అతను కనే కలలు''. ఇంతటి భావపూరితంగా చెప్పే చిత్రకారుడు మరొకడను లేడేమో అనిపిస్తుంది. ఇంతటి ప్రజ్ఞాశాలిపై ఎరిక్ న్యూటన్ విమర్శను చూడండి : ''ఆర్ప్ శక్తి అతను ప్రకృతి ప్రసాదించిన అనంత రూపాలను ఆస్వాదించడంలో ఉంది : కాని అతని బలహీనత ఈ అనంత రూపాలను పూర్తిగా వినియోగించుకోలేక పోవడంలో ఉంది. ప్రకృతియొక్క అనంత రూపాలలో గల వైవిధ్యానికి న్యాయం చేకూర్చేందుకు కావలసిన పూర్ణత్వం అతని అంతరాంతరాళంలో లేదు.'' ఈ ప్రదర్శన ఎన్నోసార్లు ఎంతోసేపు విమర్శనాపూర్వక దృష్టితో చూచిన నాకు ఈ విమర్శ విపరీత మనిపించింది. ఏ విమర్శకుడు గూడ ఇలా వ్రాయలేదు ఆర్ప్ గురించి. న్యూటన్‌కు ఎందువల్లనో ఆర్ప్ అంతగా నచ్చలేదు.

ఆర్ప్ వస్తువుల గుండ్రని తనాన్ని ఎంతో ప్రజ్ఞతో మలచగలిగారు. ఈ పద్ధతిలో చేసిన శిల్పాలు చిత్రాలు ఎంతో గొప్పగా ఉన్నాయి. కాని కోణాలను తే ప్రయత్నించినప్పుడు అంత విజయవంతం కాలేదు. ''బార్‌బరాహెప్ వర్త్'' ''గాబో'' ల శిల్పాలు చూచినవారికి ఆర్ప్ యొక్క ఈ పద్ధతి శిల్పాలు పేలవంగా కనిపిస్తాయి. అతనీ మనసు గుండ్రని ఆకారాలపై జారినట్లు పలకల ఆకారాలపై జారదనిపించింది. ''గాబో'' లో ఉన్న వేగం (ఆకారంలో) ఆర్ప్‌లో లేదు. ఆర్ప్ మేఘాలు కదులుతాయి, జారతాయి. కాని పరుగెత్తవు. ఒక నిశ్చలత ఉంటుంది శిల్పాలలో. కాని ఈ పరుగెత్తే స్వభావం చిత్రాలలో తేగలిగారు. ఈ వ్యాసంలో ప్రచురించిన (చిత్రం 3) గోడపై చిత్రాన్ని చూస్తే తెలుస్తుంది దానిలోని వేగం. ఆర్ప్ వాన్‌డోస్‌బర్గ్, సొఫీ తాబర్‌లు కలిసి స్ట్రాస్‌బర్గ్‌లోని అబెట్టే డాన్స్‌హాల్‌ను అలంకరించారు చిత్రాలతో 1926—1928 ల మధ్య. ఆధునిక చిత్రకళ, శిల్పకళ, వాస్తు శాస్త్రాలు అన్నీ సమ్మిళితమై ఒక అపురూపత్వాన్ని ప్రసా



నర్తనశోభ (చిత్రము 3)

దించాయి డాన్స్‌హాల్‌కు. అలన్ బవనెస్ అంటారు ఈ హాలును. "జీవితంలో మరువలేని అనుభవమై ఉంటుంది ఈ హాలులోకి వెళ్లడం. కాని అంత త్వరలో అది విధ్వంసం చేయబడడం ఎన్నటికి మరువలేని విషాదం." ఈ చిత్రం (మిగిలింది ఈ ఫోటో) చూస్తే మనం వూహించగలం ఎలా ఉంటుందో ఆ హాలులో నడవడం. గోడలపై పరుగెత్తే బలమైన ఆకారాల చిత్రమయ భవంతిలో నిరంతరం మెరుస్తూ సాగే వూగే నర్తనాన్ని నర్తకీ, నర్తకులను చూస్తూ హాలులో కూర్చోవడం ఎంతటి ఆనంద దాయకం! అంతటి ఆనందాన్ని మానవుడు భరించలేడనే ఆ భవనం ధ్వంసం అయిందేమో !!

మొత్తంమీద ప్రదర్శనలో ఒక చిరస్మరణీయ ఆనందము, శోభ వెల్లిబుకుతుంది. జీవితాన్ని సుఖమయం చెయ్యాలని పెట్టిన శ్రమగా కనిపిస్తుంది. ఒక్కొక్క రూపం ఒక్కొక్క భావాన్ని మూగగా అందిస్తాయి. గానం చేస్తాయి గేయాలతో—అవి గూడా ఆర్పవే.

చిత్రం : 1 పాలరాతిలో మలచిన ఈ స్త్రీ రూపం చూడండి. పండిన యవ్వనం నవ్వుతుంది. జీవితంలో ముఖ్యమైన దశ జవ్వన దశ. అందులోనే బలం, హుందా, గర్వం, స్వచ్ఛత ఉంటాయి. ఆ దశలోనే మనం సిరకృత్యాలను చేస్తాం. జీవితాన్ని నిజంగా అనుభవిస్తాం. శరీరాన్ని శుభ్రపరచి ఎన్నో సుగంధ ద్రవ్యాలను రాసి శోభామయం, ఆస్వాదనా పూరితం చేస్తాం. ఈ శిల్పం ముఖ్యంగా పాలరాతిలో చెయ్యడం గమనించండి. ఈ శిల్పం చూస్తే యివన్నీ కండ్లముందు కనిపిస్తాయి. ఇంతకంటే భావయుక్తమైన శిల్పాన్ని నేను చూడలేదు. గ్రీకులు చేసారు అద్భుతాలు పాలరాతితో. కాని యిది అత్యద్భుతం. గ్రీకు స్త్రీమూర్తులు మనల్ని చూచేట్లు చేస్తే ఈ ఆర్ప చిత్రం మనల్ని ఊహించి ఆనందించేట్లు చేస్తుంది. జీవిత అనుభవానికి దగ్గరగా తీసుకువెళ్తుంది. మనల్ని గానం చేయిస్తుంది. ఆర్ప యొక్క భావనకు అతని జీవిత పరిపూర్ణతకు యిదే సాక్ష్యం.

చిత్రం 2 లో చెక్కను ఈ రూపంలో కోసి మరొక చెక్కపై అతికించి రంగులు వేశారు. మేఘం శరవేగంలో సాగుతున్నదని దీని భావం. కాని యిందులో మేఘం బరువుగా నీ రితో నిండి ఉన్నట్లు ఉంది. ఎప్పుడు ఎక్కడైనా సరే వర్షించేవాదిరిగా ఉంది. కాని దానిలో వేగం లేదు.. నడక ఉంది. బరువుగా జారుతున్న మేఘం ప్రక్కలకు చిన్న చిన్న పిల్ల మేఘాలు గుంపులు గుంపులుగా ఉండి ఏవో కబుర్లు చెప్పుకుంటున్నట్లుగా ఉన్నాయి. ఈ చిత్రంలో ఆకారాలకు గల అవినాభావ సంబంధం గమనించదగ్గది.

చిత్రం 4 లో పిశాచము తల మలచబడింది కంచులో. వికార రూపమైన ఈ తల కోణాల మొనలతో ఉండి ఒక హేయ భావాన్ని కలుగజేస్తుంది• అందానికి. బరువు బలం ఉంది తలలో. ఈ తల పికాసో శిల్పాలను జ్ఞప్తికి తెస్తుంది. ఈ శిల్పం ఆర్ప గాదు—మరెవరో చేశారంటే గూడ నమ్మేదిగా ఉంది. ఆర్ప యొక్క పద్ధతికి భిన్నంగా ఉంది. ఆర్ప యొక్క సునిశితత్వం యిందులో ఉన్నా అంతగా నాకు నచ్చలేదు. మరొకటి పాలరాతిలో వయ్యారంగ వెనుకకు వంగిన స్త్రీ రూపాన్ని ప్రదర్శించాడు. ఈ శిల్పాన్ని మోకాళ్ల నుండి పైభాగం చెక్కాడు. చేతులు లేవు. కాని నాజూకుతనం, స్త్రీ శరీరంలో ఉన్న సోయగం, అవయువాల నిండుతనం ఎంతో సమ్మోహితులను చేసింది చూపరులను. ఇలా చాల స్త్రీ రూపాలను చేశాడు ఆర్ప.

"సాలీడు" అన్న మరో శిల్పం చాల గొప్పగా ఉంది. బల్లపరుపుగా ఉన్న మందపాటి ఇత్తడి దిమ్మను డిజైన్ మాది



పండిన యవ్వనం (చిత్రము 1)

# శిల్పచిత్రకళలో కవిత్వంచెప్పే జీన్ ఆర్ప్



పిశాచ శిరస్సు (చిత్రము 4)

తివాచీలలో ఆర్ప్ తన చిత్రాలను డిజైనులుగా నేయిం చారు. ముతుక రంగులలో గోడకు వ్రేలాడదీసిన ఇవి ఎంతో రిగా కోసి, పాలిష్‌చేసి గోడకు వ్రేలాడదీశారు. గోడకు కరచు కొని ఉన్న సాలీడు మాదిరిగా ఉంది. సాలీడు కాళ్లు ఒకదానికి ఒకటి పెనవేసుకొని బారుగా, చిక్కుబడినట్లున్నాయి.

నిండు తెచ్చారు ప్రదర్శనకు. చిన్ని రంగుల రేఖా చిత్రాలను అద్దాల బీరువాలో ఉంచి ప్రదర్శించారు.

ఈ ప్రదర్శన కోకోష్కా ప్రదర్శనలా చాలమందిని ఆక ర్షించలేదు. కోకోష్కా ప్రదర్శనలో ఎప్పుడు చూచినా ప్రద ర్శనలో 100 మందికి పైగా ఉండేవారు. నడవడానికి హాలులో కష్టం అనిపించింది. మన తెలుగు సామెత 'ఇసుక వేస్తే రాలడంతేదు' అన్నట్లుగా ఉన్నారు జనం. కోకోష్కా చిత్రాలు ఆ బాలగోపాలానికి అర్థం అవుతాయి. కాని ఆర్ప్‌వి కొంతమందికి మాత్రమే అర్థం అవుతాయి. అందువల్ల ఆ కొంతమంది మాత్రమే ఈ ప్రదర్శనకు వచ్చారు.

ఆర్ప్ ప్రభావం ఇప్పటి యువతరం అమెరికన్ చిత్రకారులపై ఎక్కువ కన్పిస్తున్నది. ఈ మధ్య "American Art-to day" అన్న ప్రదర్శన బ్రహ్మాండంగా జరిగింది. అందులో ప్రముఖ అమెరికన్ చిత్రకారుల చిత్రా లున్నాయి. ఆర్ప్‌ను పోలినవి ఉన్నాయి. ఆర్ప్ చెక్కను, రాతిని, కంచును, స్టెయిన్‌లెస్ స్టీల్, ఇనుము, గుడ్డలు అన్నిటిని ఉపయోగించారు తన భావాలకు. ఏ పదార్థం యిచ్చినా దాన్ని చిత్రకళ శిల్పకళలకు ఉపయోగించగలిగే శక్తి సంపాదించారు.

కొంతమంది చిత్రకారుల శిల్పాలను, చిత్రాలను చూచి ఆనందించాలి. మరికొంతమంది వాటిని చూడడమే గాక ఊహించి ఆనందించాలి. ఈ రెండవ తెగకు చెందిన ప్రజ్ఞాశాలి ఆర్ప్.

~~~~~~~~

మ. పరిశీలించితి మంత్రతంత్రములు, చెప్పన్వింటి సాంఖ్యాది యో
గ రహస్యంబులు, వేదశాస్త్రములు వక్కాణించితిన్, శంకవో
దరయన్ గుమ్మడికాయలోను యవగింజైనంత నమ్మించి సు
స్థిర విజ్ఞానము త్రోవఁ జెప్పఁ గదవే శ్రీ కాళహస్తీశ్వరా!
~~~~~~~~

# హోటల్లో



★

త్రిపుర

ఉదయం ఎనిమిది. పైని చితచితగా వాన. లోపల తడి.

'మా పాప్ యిలాంటి వేషాలువేస్తే పాతేస్తానని రాశే డురా. బుద్ధిలేదు.'

'ముసలాళ్లందరూ అంతేరా. ఇ ఓల్డ్ హాగ్స్‌ని హిట్లర్ జ్యూస్‌ని మెసకర్ చేసినట్లు ఫైరింగ్ స్క్వాడ్‌ముందు పెట్టి టకటుకమని ష్యాట్‌చేసి పారేయాలి.'

ముందు ఖాళీ కప్పులు, పెదిమల చివర్ల సిగరెట్లు.

*　　　　*　　　　*

''ధర్మాబమ్స్'' చదివేరా ?

'పోన్లెద్దురూ. ఈ బీట్‌నిక్స్ మరీ రూట్‌లెస్ ఫెలోస్.

ఏంగ్రీయంగ్‌మెన్ నయమనిపిస్తూంది.'

కప్పుల్లో చల్లారుతున్న కాఫీ.

*　　　　*　　　　*

'యదవనాయాల. పదిరూపాయ లిస్తేగాని ఫైలు ముట్టుకోడాని కీలులేదన్నాడు. మళ్లీ చూస్తే కుర్రకుంక. ఆ యదవ మొగాన్ని ఆ పదీ కొట్టి, సంతక మెట్టించుగొచ్చా. ఏం జేస్తాం. నస్తామా.'

'ఈ కాలం యదవలంతా యింతేనయ్యా. డబ్బు సేతిలో అడయ్యందే పని సెయ్యరు.'

టేబుల్‌మీద ఖాళీచేసిన యిడ్లీ ప్లేట్లు. మొదటా యున జేబులో చుట్టకోసం తణుముడు.

*　　　　*　　　　*

ఒకమూల, దిబ్బగా, టొమాటోలాగ ఎర్రటి ముఖం కుర్రాడు నాలుగిడ్లీల ప్లేటు తింటున్నాడు అటూ యిటూ చూడకుండా.

*　　　　*　　　　*

'సరోజినమ్మగారు రెండు రవ్వ దోసెలు పొట్లాం కట్టించుకు రమ్మన్నారండి. అళ్లబ్బాయి యిటొచ్చినప్పుడు డబ్బు లంపిస్తారంట.'

'రెండు రవదోశా పార్సేల్.... '' నంబుదిరి కేక.

*　　　　*　　　　*

'ఏమిటోయ్, హనుమంతూ. ప్రమోషన్ వచ్చిన తరువాత పార్టీ యివ్వకపోవడమే కాకుండా ఒక్కడివీ అలా బాంబర్‌లాగ కూచుని మేసేస్తున్నావ్.''

కుర్చీ బరబర వెనక్కి లాగి, పారల్లాంటి పళ్లు విశాలంగా విప్పి, గుర్రంలాగ సకిలింపు నవ్వు నవ్వేడు వెంకట్రావ్. గతుక్కుమన్న హనుమంతరావ్—ఉల్లిదోసెలోని అడపా డదపా దంతాలమధ్య పడే ఉల్లి ముక్కల్ని ఒక్కడూ సావకాశంగా అనుభవిస్తున్న హనుమంతరావ్—'యీ వెధవ ఎప్పుడూ యింతే' అనుకుంటూ, పులి కోఱల్లాంటి తన పళ్లు కూడా విప్పి,

'రావోయ్, ఏమిటి శాశ్వతం. ఏదీ యిప్పుడే' అని ''ఒక ఉల్లిదోసె పట్రా, మణీ, మా బ్రదర్‌కి' అన్నాడు.

*　　　　*　　　　*

'క్రాఫర్డ్ దొరని పట్టి మెల్లగా తోసేసేను నా ఎల్డెస్ట్ సన్‌ని కంట్రోలర్‌గా. ఆ కాలం వేరు. ఇంగ్లీషువాళ్ల తరహాయే వేరు. 'వాటీస్ యువర్ బాయ్ డూయింగ్, మేన్' అని అడిగేడు. 'హి యీస్ మెట్రిక్ సార్' అన్నాను. 'వై డోంట్‌యూ పుష్ హిమ్ యిన్ టూ అవర్ బ్లడీ రైల్వేస్, మేన్' అన్నాడు.మర్నాడే ఆర్డరూ., రెండోవాడిది పెద్ద బుర్రలే. ఎమ్మెస్సీ చేసి ఎటామిక్ ఎనర్జి కమీషన్‌లో ఉన్నాడు. బొంబాయి. థర్డ్ ఫెలోవే కొంచెం అల్లర పెడుతున్నాడోయ్. వెధవ, కమ్యూనిస్టులతో చేరి జండాలూ అవీ పట్టుకు తిరుగుతాడు. పొడుస్తాం, నరుకుతాం అని ఏమిటో పాటలూ .... అవేమీ ఒద్దులే. ఉత్త కాఫీ చాలు. అరగవు. ఆ తిండే పడిపోయింది.'

*　　　　*　　　　*

నములుతున్న ముఖాలు.

గానుగలాగే

ఎద్దుల్లా

మెల్లగా .....

'ఇమేజ్ దొరకడంలేదు. ఫీలింగ్‌కి థాట్‌కి డిసోసియేషన్ అవడంలేదు. ఇవాళ పొయిటిక్ వెదర్ లేదు.' అనుకున్నాడు భాస్కర్రావ్ ఖాళీ కాఫీకప్‌లో సిగరెట్ ఏష్ విదులుపుతూ.

*　　　　*　　　　*

# హో ట ల్లో

'శివాజీగాడు ఛాన్స్ యివ్వడంలేదురా. ఎబ్జైన్ టోర్న మెంటులో ముప్ఫయినాలుగు కొట్టేను సెంచ్యుర్యాపాస్‌మీద. టాప్‌స్కోరర్. యూనివర్సిటీమీద త్రీ ఫర్ ఫార్టీ సెవెనూ. ఆల్ రౌండర్లు ఇక్కర్లేకపోతే పొమ్మను. రేపు రాన్‌జీకి సెల క్టయితే గీర అణిగిపోతుందిలే '

*　　*　　*

'ఆరునెల్లయి తిరుగుతున్నాను కాళ్లరిగేలాగ ఈ ఎంప్లాయ్ మెంట్ ఎక్స్‌ఛేంజ్ చుట్టూ. రిన్యూ చేయించుకోడమే గాని యింటర్వ్యూకేనా పిలిచిన గాడ్దెవడూ కనిపించడంలేదు. ఒక్క సారి కాబోలు పిలిచేరు షిప్‌యార్డ్‌కి. ఒక్క క్వశ్చన్‌కి జవాబు చెప్పలేక పోయానంటే నమ్ము. అసలు మొట్టమొదటే, ఇంగ్లీషులో నీపేరేమిటని అడిగితే వాడేమిటన్నాడో బోధపడక తిక మక పడిపోయా ననుకో..... రిక్షా డబ్బులు దండగ.'

*　　*　　*

'మా పాప్ అంతేరా. లాస్ట్ యియర్ సమ్మర్‌లో ఆలిండియా ఎక్స్‌కర్షన్ వెళ్లాలి, సిక్స్ హండ్రడ్ వైరు చెయ్యమని వైరిస్తే 'రిటర్న్ యిమీడియేట్లీ' అని కొట్టేడు. ఆమాత్రం కామన్‌సెన్సుండొద్దూ.'

'సరేగాని, యీ టెరిలిన్ పేంట్ చూశావా. ఆరు లూప్‌లు పెట్టమని ఖచ్చితంగా చెప్తే నాలుగే పెట్టి కూచున్నాడు సన్నాసిగాడు. మళ్లీ మాస్టర్ కట్టర్ అని పెద్ద బోర్డు వీడూనూ.'

*　　*　　*

టర్నిప్‌లా ఉన్న, టొమాటో ముఖం దిబ్బబ్బాయి ఇడ్లీల ప్లేటు పక్కకి నెట్టి, ఒరిగిన తిమింగలంలాగ, ప్లేటుమీద పడి ఉన్న మసాలాదోసెని చిత్రవధ చెయ్యడం మొదలుపెట్టేడు.

*　　*　　*

'ఇవాళ మాటినీ ఏమిట్రా.'

'బర్ట్ లంకాస్టర్, సోఫియా లోరెన్. టైటిల్ జ్ఞాపకం లేదు.'

'కమాన్, లెటజ్ గో.'

'రైటో, బాస్.'

*　　*　　*

"మూడు కేచ్‌లు మిస్సయ్యేడు. మళ్లీ పెద్ద కబుర్లు."

"తాసిల్దారు దగ్గరికి వెళ్లడమంటేనే పెద్ద ఎడ్వెంచరూ వెధవకి."

"నావాడూ రైల్వేలోనే. కానీ ఫిట్టరు. రెండోవాడు కూడా. కాని వాడు ఖరగ్‌పూర్‌లో."

"ఇల్లు దొరక్క నస్తున్నా మనుకోండి."

"లెప్పర్సా, బెగ్గర్సా."

"డీసెంట్ జాబ్‌లురా. క్వార్టర్సా, ఫ్రిజ్, ఓ."

"కెరూ అక్ 'ఆన్ ది రోడ్' చదివేరా ?"

"లంచాలు మీద లంచాలు గుంజి అఫీసనల్ కాల్నీలో ఇల్లు కట్టించేసేడంట."

"రాత్రికి రాత్రి మోసుకొచ్చేమండి టాక్సీలో చిట్టివలస నుంచి. అప్పటికప్పుడు ఆపరేషన్ చేశారు. కాని .... కాని ఆశ లేదు."

"పప్పాస్. పెద్ద డాబులా మువ్వన్నా."

"ఒరే, ఇందులో రేలంగున్నాడూ."

*　　*　　*

మాంచి సారవంతమైన నేలలో పెరిగిన బీట్‌రూట్‌లా ఉన్న దిబ్బ కుర్రాడు దోసెని తినేసి, అప్పుడే సర్వర్ టేబుల్‌మీద పెట్టిన పెసరట్‌ని ముదిరిన బెండకాయల్లాంటి వేళ్లతో ఆప్యాయంగా నిమురుతున్నాడు, మేకని నరకబోయే కసాయి వాడిలా—

*　　*　　*

సరోజినమ్మగారికి కావలసిన దోసెలకోసం వచ్చిన రాములు చుట్టూ ఖాళీ కళ్లతో చూస్తూంది. ఇంట్లో—తన గుడిసెలో చిన్న కొడుకు సింవం చలంకి మందెవరు తెస్తారు.

*　　*　　*

మెత్తగా నల్లగా చుంచులాంటి ముఖాలు. రహస్యంగా నక్కలాంటి ముఖాలు. అప్పుడే చంపిన గేదెని చీలుతున్న పులి ముఖాలు. దుమ్మలగొండు ముఖాలు. బెదిరిన కుందేళ్ళ ముఖాలు. సన్నంగా పగగా పాము ముఖాలు. మార్కోవిచ్ సిగరెట్ పాకెట్‌మీద ముఖంలాంటి ముఖాలు. డిటెక్టివ్ ముఖాలు. దొంగ ముఖాలు.

*　　*　　*

ఉదయం తొమ్మిదీ నలభయి. పైన చిటచిటగా వాన. లోపల తడి, ఉక్క.

# ముక్తగ్రస్తము

శ్రీ జనపాల

ఏదో వ్యథాకులిత సారము
మాధుర్య స్ఫురితా వారము
నిమీలిత లోచనమ్ముల
నీలి నింగిని నిల్పినాలో
నిజ హృత్తటాక తటముల
నిరత తాడన వారణమ్ముల
నటన మ్మొనరించు నిరతము
నాన్యథా నిష్కృతీ యన

మధుకరీ ఝుమఝు మార్భటుల్
మానసాంతర మమత వీచుల
మగత నిద్దుర వీడజేయుచు
మండలాకృతి సంచరింపగ
మోహపాశా కర్షితమ్మై
ముక్తిమార్గాపేక్షితమ్మై
ముందుకేగును తిరిగి వచ్చును
ముక్తగ్రస్తము పాడు మనమిది.

---

# నన్నయ వాగనుశాసనుడా ?



శ్రీ నిడుదవోలు వేంకటరావు

తెలుగులో ఆదికవి అని ప్రసిద్ధి వహించి, ఆంధ్ర భారత రచనా ప్రారంభకుడై, కవిత్రయములో ప్రథముడైన నన్నయ భట్టారకుడు 'ఆంధ్ర శబ్ద చింతామణి' అను వ్యాకరణ గ్రంథమును సంస్కృత భాషలో రచియించెననియు నందువలన నాతడు వాగను శాసనుడయ్యెననియు, నొక వాదము మూడు వందల యేండ్లనుండి తెలుగు సాహిత్య ప్రపంచమున ప్రచారమును పడసినది. ఈ వాదమును తొలుత ప్రవేశ పెట్టినవాడు కాకునూరి అప్పకవి. ఆతడు తన గ్రంథమగు 'నప్ప కవీయమున' (క్రీ. శ. 1656) నీ 'చింతామణి'ని గూర్చి లోకమునకు తెలుపునంత వఱకు వాఙ్మయ ప్రపంచములో నీ గ్రంథము యునికినిగూర్చిగాని, తద్గ్రంథ కర్తయగు వాగను శాసనుని గూర్చి గాని యేవిధమగు సూచనలు లేవు.

నన్నయ క్రీ. శ. 1050 ప్రాంతము వాడని నిర్వివాదముగా నంగీకృతమైన విషయము. అప్పకవి కాలము క్రీ. శ. 1656 అని ముందు తెలిపితిని. ఈ అయిదు వందల యేండ్లలో, పండిత మల్లికార్జున, నన్నెచోడ, పాల్కురికి సోమనాథాది శివకవులేకాక, తిక్కన, ఎఱ్ఱన, శ్రీ నాథ, అల్లసాని పెద్దనాది మహాకవులు విలసిల్లిరి. కావ్యములే కాక, వ్యాకరణ, ఛ్ఛందో లక్షణ గ్రంథములును రచితములైనవి. కాని పై కవుల కావ్యములలో గాని, భారత కర్త నన్నయ వాగనుశాసనుడను తదితర రచనలో గాని, ఆంధ్రశబ్ద చింతామణిని గూర్చిగాని, విషయమునుగూర్చి గాని యుట్టంకింపబడలేదు.

మన ప్రాచీన కవులను గూర్చి, వారి రచనలను గూర్చి చర్చించునపుడు, ఆయా కవుల గ్రంథములే మనకు ప్రధానాధారములు. మన తెలుగు కావ్యములలో ప్రాచీన కవిస్తుతి అనునొక సంప్రదాయము కృత్యావతారికలలో నున్నది. అందు తెలుగుకవిస్తుతులలో, వారి కవితా గుణములలో ముఖ్యగుణమును, వారి బిరుదములు పేర్కొన బడియుండును. కొన్ని కవిస్తుతులలో వారిచే రచితములగు ముఖ్యగ్రంథములును తెలుపబడి యుండును. కాబట్టి ప్రాచీన కవులను గూర్చి, వారి రచనలను గూర్చి చర్చించునపుడు, ఉత్తరోత్తరముగా, కావ్యములలో నా కవులను గూర్చిన విశేషములు మనము తెలుసు కొనుట ప్రధాన కర్తవ్యమై యున్నది.

ఈ దృష్టితో పరిశీలించిన యెడల, కవిస్తుతు లీ విషయనిర్ణయమునకు తొలి ముఖ్యసాధనము. ఒక్క [1] శైవ వైష్ణవ కవులను విడిచినయెడల తెలుగున నన్నయకవిని స్తుతింపని వారేలేరని చెప్పవచ్చును— కాబట్టి ఆ స్తుతులన్నింటిని సేకరించిన యీ వివాద విషయమునకు దోడ్పడునని, నన్నయ కాలము నుండి మొన్నటివఱకు గల నన్నయ స్తుతులను సేకరించితిని. వాని మూలమున నెన్నో విషయములు బయలు పడినవి. అయిన నందులో— నన్నయ 'వాగను శాసనుడా' అన్నదియే చర్చనీయాంశ మగుటచే, నందులకు సంబంధించిన వానిని మాత్రమే యుదహరించుచున్నాను.

అప్పకవి, నన్నయ చింతామణి కర్తృకము కొఱకు పెద్దకథను కల్పించినను—అహోబలపతి దానిని బలపఱచినను, బాల వ్యాకరణకర్త ప్రామాణ్యమునిచ్చినను, [2] 'వఝ్ఝులవారు దాని స్థితి స్థాపకత్వము కొఱకు మహాగ్రంథములు రచించినను— ఆ వాదమంతయు నిరాధారమని, నిష్ప్రమాణమని, యీ క్రింది యంశము చేతనే బుజు వగుచున్నది. ఆంధ్ర భారతము రచించిన నన్నయయే చింతామణి రచించెననిగద వారి వాదము? అయితే

ఆంధ్ర భారతమున గద్యలో— ఏ విశేషములేక, సకల సుకవిజన వినుత నన్నయ భట్టప్రణీతము'' అని యున్నది.

ఆంధ్రశబ్ద చింతామణి గద్యలో

'ఇతి శ్రీ సకల భాషావాగను శాసన నన్నయభట్ట విరచితాంధ్ర శబ్ద చింతామణౌ ప్రథమ పరిచ్ఛేదః'' అని ఉన్నది.

---

1. ప్రాచీనులగు శివకవిత్రయము, (పండితారాధ్య— నన్నెచోడ— పాల్కురికి సోమనాథులు) తప్ప తక్కిన శివకవులు కొందఱు, శివకవులను వేఱుగాను, నన్నయాదులను వేఱుగాను స్తుతించిరి. అయితే యిట్టివారు కొలది మందియే.

2. కథాపూర్ణ వఝ్ఝుల చిన సీతారామస్వామి శాస్త్రుల వారు.

కాబట్టి గ్రంథకర్తృత్వమునకు ప్రధానాధారమగు గద్యమునుబట్టి, భారత రచయిత నన్నయ చింతామణిని రచింపలేదని స్పష్టము.

నన్నయ భారత భాగమున తన్నుగూర్చి చెప్పుకొను నపుడు "శబ్దశాసను" అను నొక విశేషణమును వాడియున్నాడు. అప్పకవికి, యీ 'శబ్దశాసన' శబ్దమొకటి, ఆలంబనమైనది. శబ్దశాసన అనుదానికి పర్యాయముగా "వాగను శాసన" అను పదము వాడుకలోనికి దెచ్చినాడు— ఈ 'వాగను శాసన' పదమే తరువాత యీ వాదమును వ్యాప్తిలోనికి దెచ్చినవారందఱకు ప్రధానాధారమైనది. కాని యీ "వాగను శాసన" పదము చింతామణి నన్నయ రచితమనుటకు దోహదము చేయలేదు సరికదా చింతామణి నన్నయ కృతముకాదని నిర్ధరించుటకు తోడ్పడినది.

ఆంధ్రభారత కర్తయగు నన్నయ వాగను శాసనుడు కాడని యీ క్రింది కవిసూక్తులు నిర్వివాదముగా నిరూపించుచున్నవి.. ఏలననగా, నిందు నన్నయకు నొక విశేషణమున్నను అది శబ్దశాసన పదమేగాని, వాగను శాసన పదముగాదు. మొదట నన్నయ తన్నుగూర్చిచెప్పుకొన్న విషయములు చూడుడు.

సీ. తనకుల బ్రాహ్మణు, ననురక్తు నవిరళ
జపహోమ తత్పరు, విపులశబ్ద
శాసను, సంహితా భ్యాసు, బ్రహ్మాండాది
నానా పురాణ విజ్ఞాన నిరతుఁ,
బాత్రు, నాపస్తంబ సూత్రు, ముద్గలగోత్ర
జాతు, సద్వినుతావదాత చరితు,
లోకజ్ఞు, నుభయ భాషా కావ్యరచనాభి
శోభితు, సత్ప్రతి భాభియోగ్యు,
ఆ. వె. నిత్యసత్య వచను, మత్యమరాధిపా
చార్యు, సుజను నన్న పార్యుఁజూచి
పరమధర్మ విదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁడిట్టు లనియె కరుణతోడ.

ఆది. 1—9

"నానా రుచిరార్థసూక్తినిధి" నన్నయభట్టు"

ఆది. 1—25

ఆశ్వాసాంత గద్యలలో,

ఇది సకల సుకవిజన వినుత నన్నయ భట్టప్రణీతం బైన శ్రీ మహాభారతంబు నందాది పర్వంబున.... ప్రథమాశ్వాసము. ఇట్లే—13 ఆశ్వాసముల యంతములందును గలదు.

దీనినిబట్టి నన్నయ తన్నుగూర్చి— 'నన్నపార్యు' నన్నయ భట్టు' అని మాత్రమే చెప్పుకొన్నట్లు స్పష్టమగుచున్నది.

నన్నయ కాలమునకు నవగా క్రీ. శ. 1050 నుండి మఱి రెండువందల యేండ్ల వఱకు నవగా క్రీ. శ. 1250 వఱకును నన్నయ ప్రశంసయే యాంధ్ర సాహిత్యమున గానరాదు. దీనికి కారణమా రెండు శతాబ్దాలలోను, మల్లికార్జున పండిత, నన్నెచోడ, పాల్కురికి సోమనాథ శివకవిత్రయముచే ప్రపంచితమైన, వీరశైవమత సాహిత్యము విస్తరిల్లుటయే యని గ్రహింపనగును. ఆ సాహిత్యమున నన్నయ భారతము వంటి చంపూపద్ధతి నున్న కావ్య రచనయేగాక, ద్విపద శతకము, ఉదాహరణాది సాహిత్య ప్రక్రియలును వెలసినవి.

ఈ నాటి వాఙ్మయ సాహితీ విమర్శకులు శివకవుల భాషా సాహితీ పథకమున ప్రత్యేక భిన్నమత సంప్రదాయములు గలవా రగుటచేత వారు భవకవులను (శివేతరమతానుయాయులను శైవులు భవులందురు) స్తుతియింపలేదను యభిప్రాయము వెలువఱిచినారు. ఇది యసంబద్ధము నప్రామాణికము.

పండితారాధ్య, నన్నెచోడ, పాల్కురికి సోమనాథుల గ్రంథములను, నన్నయ భారత భాగమును నా మూలాగ్రముగా, కూలంకషముగా చదివి యవగాహన చేసికొన్నవారికి శివకవులకు నన్నయకు సన్నిహిత సంబంధము గలదని యవగత మగుచున్నది. నన్నెచోడ మహాకవికి నన్నయకు, పదములలో, పదబంధములలో, పద్యముల యెత్తుగడలో భావములలో నెన్నో సంవాదములు గలవు. ఇక పాల్కురికి సోమనాథుఁడు తన ప్రాథమిక కృతియగు ననుభవ సారమును నన్నయ భట్టారకుని రచన ననుసరించి, వృత్తరచన సాగించియున్నాడు. చతుర్వేద సారమున "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబన" అను పద్యమునకు ననుసరణగా నట్లే యొక సీస పద్యమును రచించి యున్నాడు. నన్నయ తను చెప్పినరీతి భారతము నంతను పూర్తిచేయలేక పోయినను, పాల్కురికి సోమనాథుడా సద్య మన్వర్థ మగునట్లు మహాభారతమునకు ప్రతిగా వీరశైవ సాహిత్యమున పండితారాధ్య చరిత్రమును సృష్టించియున్నాడు.

ఇట్లున్నను, శివకవులు నన్నయను కావ్యముఖమున నెందుకు స్తుతింపలేదను ప్రశ్న కలుగవచ్చును. దీనికొకటే ప్రత్యుత్తరము. శివకవుల సాహిత్యమంత కావ్యకళా విలాసమైనను నాధ్యాత్మికమై, యలౌకికమైన మతతత్త్వ ప్రచారము ప్రధానోద్దేశముగా గలది. నన్నయ సృష్టించిన సాహిత్యము లౌకికము— కావుననే నన్నయ సంస్కృతమున లౌకిక కావ్యసృష్టి కర్తయగు వాల్మీకిని యావైదిక వ్యాసుని ప్రశంసించియున్నాడు. తరువాతి తెలుగు కవులకు నది యాచారమైనది.

# నన్నయ వాగనుశాసనుడా ?

శివకవుల కాలమునకు నన్నయ భారతములో ఆరణ్య పర్వమైన పూర్తిగాలేక పోవుటచే నట్టి కవిని ప్రత్యేకముగ వారు పేర్కొనలేదని చెప్పవచ్చును. నన్నెచోడుడురే 'దేశి సత్కవుల' అనుచో, నన్నయ యందుండునని నిశ్చయింపవచ్చును.

నన్నయ యెంత లోకోత్తర రచయిత యైనను నాతని గ్రంథమసంపూర్ణముగా నుండుటచే గూడ నాతని స్తుతించి యుండక పోవచ్చును.

## కవిత్రయము

నన్నయకు వెనుక, నాతడు ప్రారంభించిన మహాభారతాంధ్రీకరణమును పూర్తిగావించిన తిక్కన— ఎఱ్ఱనల కాలమునందే, యనఁగా క్రైస్తవ శతాబ్ది 1250 నుండియు నాతని ప్రశంస ప్రారంభమైనదని చెప్పవచ్చును. తిక్కన భారత రచనకు ముందుగా నీ క్రింది కవులు నన్నయను పేర్కొనిరి.

1. మూలఘటిక కేతన— ఆంధ్రభాషా భూషణము "నన్నయ భట్టాది కవిజనంబుల కరుణన్"

2. అవధానము మంచిరాజు— మంచెన— కేయూర బాహుచరిత్ర "వాక్పార్థమేరువులన్ నన్నయభట్టు తిక్కకవి చంద్రులంగొల్చి"—

భారతమున పదునేను పర్వము లాంధ్రీకరించినను తిక్కనయు నన్నయను, భారతాంధ్రీకరణ మహోద్యమ ప్రారంభకునిగా నిట్లు ప్రశంసించియున్నాడు.

ఉ. ఆదరణీయసార వివిధార్థ రసస్ఫు రణంబు గల్గి య
ష్టాదశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొందియుండనం
దాదిదొడంగి మూఁడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండువి
ద్యాద యుతుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు
దక్షతన్. (విరా. 1—6)

తిక్కన భారత రచనకు ముందుగా నన్నయ విడిచిన యారణ్య పర్వశేష భాగమును పూర్తిచేసి యాతని పేరనే వెలువరించిన ఎఱ్ఱన— తొలుత నన్నయ నిట్లు పేర్కొన్నాడు.

ఎఱ్ఱన— ఆరణ్య పర్వము— సప్తమాశ్వాసము.

..............ధర్మైక తత్పరాత్ముఁ

సీ. తే. డెఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁ
డయిన నన్నయభట్టు మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజన హర్షసిద్ధిఁగోరి (7—469)

చతుర్థాశ్వాసము 143వ పద్యమునుండి ఎఱ్ఱన కవిత్వము. ఎఱ్ఱన నన్నయపేరనే గద్య యిట్లు వ్రాసియున్నాడు.

"ఇది సకల కవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునం దరణ్యపర్వమున— చతుర్థాశ్వాసము. పంచమ షష్ఠ సప్తమాశ్వాసముల నిట్లే యున్నది.

తిక్కన భారత రచనానంతరమున నెఱ్ఱన నృసింహ పురాణమును రచించి, యందు నన్నయ తిక్కనల నిద్దఱిని నిట్లు పేర్కొన్నాడు.

"భాసుర భారతార్థ బహుభంగుల నిక్కమెఱుంగ నేరకన్
గాసట బీసటే చదివిగాథలు త్రవ్వు తెలుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగఁ జేసినట్టి యు
ల్లాసన కల్పులందఱకు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్.

పై పద్యమును బట్టి నన్నయను తిక్కనతో కలిసి స్తుతించె ననుట స్పష్టము. కాని భారత ఖిల పర్వమగు హరివంశమున నెఱ్ఱన ప్రత్యేకముగా నొక్కొక్క పద్యముచే వారిద్దఱిని స్తుతించి యున్నాడు. అందు నన్నయను గూర్చినది,

ఉ. ఉన్నతగోత్ర సంభవము,నూర్జిత సత్త్వము,భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్యపరిభావి మదోత్కటమున్న రేంద్రపూ
జోన్నయ నోచితంబునయి యొప్పెడు నన్నయభట్టు
కుంజరం
బెన్న నిరంకుశోక్తి నని నెందును బ్రాలుట ప్రస్తుతిం
చెదన్.

కాబట్టి ప్రత్యేకముగ కవిస్తుతులలో నన్నయను నొక పద్యములో స్తుతించు సంప్రదాయము నెంకొల్పినది యెఱ్ఱనయే. తిక్కన శిష్యుడగు మారనయు నన్నయను—ఆంధ్ర కవితాగురుని పేర్కొన్నాడు.

వాఙ్మయమున కవిత్రయ పద్ధతికి మూలపురుషుఁ డెఱ్ఱనయే. ఇచట మనకు ప్రస్తుతాంశమే మనఁగా కవిత్రయములోని వారై నన్నయ కవితనా మూలాగ్రముగ జీర్ణించుకొన్న మహానుభావులు— తిక్కన ఎఱ్ఱనలు నన్నయ, "వాగనుశాసనుడు" అని పేర్కొనలేదు !

---

3. వాల్మీకి వ్యాసులు సంస్కృతకవులు గద. వారిస్తుతి కాళిదాసాది మహాకవుల కృతులలో గన్పట్టదు. అందుకవిస్తుతి లేదు. ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశములను పాటించినారు. ఇది బాణుని హర్షచరిత్రలో సంస్కృతమున ప్రారంభమై తొలుత కన్నడకవులలో ప్రచారమునంది, తెలుగున ప్రవేశించి, నియతమైన సంప్రదాయముగా నిలిచినది.

## శ్రీనాథ యుగము

కవిత్రయము వారివెనుక నాంధ్రకవితా సింహాసనమ్ము నధిష్ఠించిన శ్రీ నాథ మహాకవి కాలమున ముందువెనుకల నన్నయను వాగను శాసనుడని యెవ్వరు ననలేదు.

శ్రీనాథుడు:
నైషధము— "ధీరమతి నన్నపార్యుని" (1—7)
భీమఖండము— "నన్నయ భట్టోపాధ్యాయు" (1—8)
కాశీఖండము—"నన్నయభట్టు మార్గంబున' (1—13)
'నన్నపాచార్యు' (1—9)
పోతన భాగవతము—"నిఖిలకవిజనమనోహారి నన్నయసూరి"
"ఒనర నన్నయ"

మడికి సింగన:
పద్మపురాణము } 'నన్నయ" (1—8)
ఉత్తర ఖండము }
జ్ఞాన వాసిష్ఠము—'నన్నయార్యు' (15)
జక్కన : విక్రమార్క చరిత్ర— 'శబ్దశాసన వరేణ్యులు నన్నపార్యు' (1—6)

కొఱవి గోపరాజు:
సింహాసన ద్వాత్రింశిక— 'నన్నయభట్టు' (1—9)

అనంతుడు:
భోజరాజీయము— 'నన్నయభట్టు'

నిశ్శంక కొమ్మన:
శివలీలా విలాసము— 'నన్నయభట్టు'

వినుకొండ వల్లభరాయుడు:
క్రీడాభిరామము— "నన్నయభట్టు"

ప్రౌఢకవి మల్లన:
రుక్మాంగద చరిత్ర— "నన్నయభట్టు"

దూబగుంట నారాయణకవి:
పంచతంత్రము— "నన్నయ భట్టారకునకు"

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు:
జైమిని భారతము — 'మా నన్నయభట్టు'
శృంగార శాకుంతలము— "నన్నపార్యుని"

కూచిరాజు ఎఱ్ఱన:
సకల కథా నిదానము— 'నన్నయభట్టు'

నందిమల్లయ, ఘంటసింగయ:
వరాహ పురాణము— "నన్నపాచార్యునకు"

ఈ యుగమునకే జెందిన కొలని గణపతి దేవకవి—తన శివయోగ సారమున—నన్నయభట్టు వ్యాకరణము రచింపలేదని, ఆతడు కావ్యపథము దీర్చినవాడని ప్రశంసించియున్నాడు—
"ఆంధ్రకావ్య పథము
తీర్చిన నన్నయభట్టుగారి"

## కృష్ణదేవరాయ యుగము

అల్లసాని పెద్దన:
మను చరిత్ర. 'నన్నపార్యు'—(1—8)

వెన్నెలకంటి సూరన
విష్ణుపురాణము— "నన్నయభట్టు"

భానుకవి:
పంచతంత్రము— "నన్నయ"

రాధా మాధవకవి:
రాధామాధవము— 'నన్నయభట్టు'
తారక బ్రహ్మరాజీయము—'నన్నయభట్టు'

చరిగొండ ధర్మన:
చిత్ర భారతము— 'నన్నపార్యు'

హరిభట్టు:
వరాహపురాణము— 'నన్నపార్యు'

పింగళి సూరన:
రాఘవ పాండవీయము— 'నన్నపార్యు' (1—4)

దోనూరి కోనేరుకవి:
బాలభాగవతము— 'నన్నయభట్టును'

రామభద్రకవి:
రామాభ్యుదయము— 'శబ్దశాసనసుకవి కుంజరి'

## అప్పకవికి ముందు మరికొన్ని కవిస్తుతులు

పెదపాటి యెఱ్ఱన: కుమార నైషధము—(అలభ్యము)
సీ. గీ: హరుని వినుతులచే బాసలాడఁ జేసి
నట్టి భట్టుని నన్నయభట్టుఁ బొగడి.
ప్ర. ర. 76 ప.

కాకమాని గంగాధరుఁడు: బాలభారతము—
క. శబ్దార్థరస విశారదు
శాబ్దిక మూర్ధన్యు శబ్దశాసన బిరుదున్
శబ్దాయమాన విస్ఫుర
దబ్ద ఘటాంర భటి నన్నపార్యునిఁ దలఁతున్.
130. ప.

ఆంధ్రకవి రామయ్య: విష్ణుకాంచీ మాహాత్మ్యము.
సీ. శబ్దశాసన కావ్య సంఘట్టన క్రమా
నందిత బుధవర్యు నన్నపార్యు— 422. ప.

పెదపాటి సోమయ: అరుణాచల పురాణము—
ప్రతిభా విలంబిత భారత బహుకథా
ఘట్టు నన్నయభట్టుఁ గడుభజించి. 491. ప.

# నన్నయ వాగనుశాసనుడా ?

ఎడపాటి ఎఱ్ఱన: మల్హణ చరిత్ర—
చ. వినుతులొనర్తు నాంధ్రసుకవి ప్రభు నన్నయభట్టు—
ఈ క్రింది నన్నయ స్తుతి యెందలిదో ?

> అంగీకారము ప్రస్తుతింప దగదే యార్యాను కూలంబులై
> మాంగళ్యధ్వనులై ప్రసాద నిధులై మాధుర్య ధుర్యంబులై
> త్వంగత్పూర్ణ జటావిరద్గళ గళద్గంగా తరంగావళీ
> భంగిం బేర్చిన నన్నపార్యుని వచో ప్రాగల్భ్య నిర్వాహముల్. 34.

## వాగనుశాసన పదసృష్టికర్త
## వసుచరిత్రకారుడు

రామరాజ భూషణుడు వసుచరిత్రలో "మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు ద న్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్." (—10) అని శ్లేషలో నన్నయకు 'వాగనుశాసన' అను పదమును నుపయోగించి యున్నాడు. నన్నయకు గల శబ్దశాసన పదము వాగనుశాసనుడు—అని పర్యాయపదముగా వాడబడుట కిదియే మొదలు—వసుచరిత్ర రచనా కాలము—క్రీ. శ. 1570 ప్రాంతము.

రామరాజభూషణునికి ముందు కవులు నన్నయను గూర్చి చెప్పునప్పుడు 'శబ్దశాసన' పదమునే వాడిరి, కాని వాగనుశాసనుడని వాడనేలేదు. ఈ విషయ మొక్కటియే నన్నయ, క్రీ. శ. 1570 వఱకు వాగనుశాసనుడని వ్యవహృతుడు కాలేదని నిశ్చయముగా తెలుపుడు చేయుచున్నది.

వాగనుశాసనుడే లేనప్పుడు ఇక ఆంధ్రశబ్ద చింతామణి రచన మెట్లు ?

అప్పకవి క్రీ. శ. 1656 ప్రాంతమువాడు గావున, నీ వసుచరిత్ర యందలి వాగనుశాసన పద మాతనికి చింతామణి కర్తృత్వము నన్నయకు కట్టిపెట్టుటకు నవకాశ మిచ్చినది. నన్నయ వాగనుశాసనుడని అప్పకవి తరువాతి కవులే చెప్పిరి కాని, యంతకుముందువా రెవ్వరును చెప్పలేదని పై కవిస్తుతులు నిర్ధారణ చేయుచున్నవి—కాబట్టి,

"భారతకర్త నన్నయ వాగనుశాసనుడు కాడు."

ఆంధ్రశబ్ద చింతామణి అతని రచన కాదు. అతని పేర పదునేడవ శతాబ్దిలో వెలసిన యొక కూట సృష్టి యని సిద్ధాంతము.

## ఛందోలక్షణ గ్రంథములు

ఇట్లు కవిస్తుతులలో నన్నయ వాగనుశాసనుడని లేకపోవుటయేగాక లక్షణ గ్రంథములలో, నాంధ్రశబ్ద చింతామణి పేర్కొనబడకపోవుటయు, నిది నన్నయ కృతము కాదని నిరూపించుచున్నది. కేతన ఆంధ్రభాషా భూషణము, విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందోదర్పణము, తాతంభట్టు కవిచింతామణి, లింగముగుంట తిమ్మకవి సులక్షణ సారము, ముద్దరాజు రామన కవిసంజీవని, వీనియం దాంధ్ర శబ్ద చింతామణి సూచితముకాలేదు. ఈ గ్రంథము లన్నియు అప్పకవి పేర్కొనినవియే.

## వ్యాఖ్యానములు

ముద్దరాజు పెదరామన పింగళి సూరనార్యుని రాఘవ పాండవీయమునకు ప్రశస్త వ్యాఖ్యానము రచియించి యున్నాడు. అందు గల లక్ష్యములకు లక్షణము లుదహరించునట్లు తెనుగు వ్యాకరణ గ్రంథములగు ఆంధ్రభాషా భూషణము మొదలగు వానినే యుదహరించెను గాని, ఆంధ్రశబ్ద చింతామణి ప్రసక్తియే లేదు.

అప్పకవికి సమకాలికుడై మహా లాక్షణికుడగు—గణపవరపు వెంకటకవిగాని, అప్పకవికి తరువాతివాడగు కస్తూరి రంగకవి, రంగరాట్ ఛందస్సునగాని యాంధ్రశబ్ద చింతామణి విషయమే తలపెట్టలేదు. ఇక దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమున వెలసిన నన్నయ స్తుతులందును—నీ వాగనుశాసన ప్రశంస లేదు.

అప్పకవి తరువాతి కాలమున కూడ నన్నయ వాగనుశాసనుడను ప్రవాదము లేకపోవుటయే పై సిద్ధాంతము సమర్థింపజాలి యున్నది.

నన్నయ వాగనుశాసనుడుకాడు. ఆంధ్రశబ్ద చింతామణి ఆతని రచనము కాదు. ఇది బహిరంగ పరిశీలన—అంతరంగిక పరిశీలన యింకొకమారు.

## రక్షణ కృషికి సంబంధించిన విషయాలకై చదవండి.....




# ఆంధ్రప్రదేశ్

ఇటీవల ప్రవేశపెట్టిన అనేక నూతన శీర్షికలతోడు రాష్ట్రంలోని ఉన్నతాధికార వర్గం యొక్క యదార్థాభిప్రాయాలను, ఇంగ్లీషు, తెలుగు, ఉర్దు, హిందీ భాషలలో వెలువడే ఆంధ్రప్రదేశ్ మాసపత్రికలో ప్రచురించడం జరుగుతున్నది.

దేశ రక్షణ సన్నాహం కృషికి, వివిధ రంగాలలో ప్రజలు జరుపుతున్న కృషికి సంబంధించిన అనేక వ్యాసాలు కూడా ఇందులో ఉంటాయి.

వీటికితోడు ఉత్తేజాన్ని, ఆనందాన్ని కలిగించే కథలు, గేయాలు మొదలైన అనేక అంశాలు కూడా ఉంటాయి.

దాదాపు వందమంది ఏజంట్లతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ, మారుమూల గ్రామీణ ప్రాంతాలలో కూడా 'ఆంధ్రప్రదేశ్' పత్రిక అధికంగా సర్క్యులేటు అవుతున్నది. అంతే కాక దేశంలోని ఇతర రాష్ట్రాలకూ, విదేశాలకూ ఎక్కువ సంఖ్యలో ప్రతులు వెళ్తున్నాయి. అందువల్ల అన్నిరకాల ఉత్పత్తులకు చెందిన ప్రకటనలకు ఇది లాభం చేకూర్చుతుంది.

వార్షిక చందా రు. 3-00 మాత్రమే. ఏజంట్లవద్ద గానీ, హైద్రాబాదులోని సమాచార పౌర సంబంధాల శాఖ నుంచి గానీ పత్రికను పొందవచ్చు. జిల్లాలలోని జిల్లా ప్రజా సంబంధాధికారులకు కూడా మీ చందా చెల్లించవచ్చు.

**సమాచార పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్**

# స్టాలిన్ నాడు - నేడు



శ్రీ వాల్టర్ లాక్యూయూర్

గొప్పవారిని గురించిన అధ్యయనం ఎలా చేసినా, పరిజ్ఞానాన్ని పెంచుతుంది. ఇది కార్లైలునాటినుంచి తెలిసిన విషయము. వారిని తలచుకుంటూ ఉంటే కొత్త విషయం ఏదో ఒకటి తెలియ వస్తుంది. అయినా గొప్పతనాన్ని నిర్వచించటం ఎలా!

"ఈ ఆ నాయకులలో ఎవరెంత ప్రముఖులైనదీ నిర్ణయించగలది చరిత్ర అన్నది సత్యము" ఇలా అన్నది స్టాలిన్. అయితే సాధారణంగా ప్రజలు ఈ నాయకుల మాట మరచిపోయిన మీదటనే చరిత్ర, తన అంత్య నిర్ణయాన్ని ఇవ్వటంకద్దు. ఈలోపల ఏ తరానికి ఆ తరం తమ రాజకీయ దృక్పథాన్ని బట్టి ఈ నాయకుల గొప్పతనానికి తిరిగి తిరిగి విలువ కడుతూ ఉంటారు. తరువాత తరాలవారికి ఆ నాయకులు ఎలా కనబడుతారో ముందు చెప్పటం, తరువాత శతాబ్ద రాజకీయగతిని గురించి జోస్యం చెప్పడం అవుతుంది. స్టాలిన్ పాత్రను గురించి కమ్యూనిస్టులు, కమ్యూనిస్టేతరుల అభిప్రాయంతో ఎప్పుడూ ఏకీభవించరు. "కీర్తిశేషుడైన ఈ ప్రజాపిత" చేసిన చెడు ఎక్కువా, మంచి ఎక్కువా? అసలు ఆయన అభివృద్ధి దోహదకుడా" అన్న దానిమీదనే కమ్యూనిస్టు వర్గాలలో అభిప్రాయ భేదాలు ఉంటూనే ఉంటాయి. చారిత్రిక పురుషుల తదనంతరము వారిని గురించి జరిగే మదింపులలో హెచ్చు తగ్గులు చాలాకాలం సాగుతాయి. 1930—40 మధ్య వరకు ఇవాన్ IV (Ivan the Terrible) గురించి రష్యను చరిత్రకారులు దాదాపు ప్రసన్నతను చూపలేదు. అతనికి మతిభ్రమణం వ్యాధి ఉన్న దన్నారు. అయితే స్టాలినిజమ్ బాగా ప్రచండంగా ఉన్న రోజులలో ఇవాన్ గురించి పునః మదింపు జరిగింది. రషియను చరిత్రలో అతను మహా పురుషులలో ఒకడుగా చిత్రించబడినాడు. అవసరంవచ్చి క్రూరుడుగా వ్యవహరించాడుగాని, అతని నిర్ణయాలు మాత్రం దూర దృష్టితో కూడినవి అన్న సిద్ధాంతం ప్రతిపాదించటం జరిగింది. స్టాలిన్ మరణించిన మరుక్షణం ఇవాన్‌ను ఉన్నతస్థానంనుంచి క్రిందకు దించారు. మొదట్లో కాస్త జాగ్రత్తగా చేశారు. కాని ఈ మధ్య ఒక్కసారి క్రిందకు గుంజేశారు.

ఇవాను చచ్చిపోయి దాదాపు 400 ఏళ్లయినది. జంగీజ్ ఖాన్ పోయి అంతకు ఎక్కువ కాలేదు. కాని, చరిత్రలో అతని స్థానం గురించి మార్క్సీయులకు ఏకాభిప్రాయం కుదరక పోయినదని ఈమధ్య విన్నపుడు ఆశ్చర్యం వేసింది. మంగోలియా, పెకింగులలో కొందరు అతను అభివృద్ధికి దోహద మిచ్చినవాడని అభిప్రాయపడ్డారు. మాస్కోవారు పూర్తిగా భిన్నమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

చరిత్రను ఇలా తలకిందులు చేయుటం నియంతృత్వంలో అమాంతంగా జరుగుతుంది. ఇతరచోట్లా జరుగుతుంది. ఫ్రెంచి విప్లవాన్ని గురించీ, నెపోలియను గురించి వ్రాయబడిన రచనలు ఇందుకు తార్కాణం. భవిష్యత్తులో పరస్పరము గిట్టని ఇద్దరు చరిత్రకారులలో ఒకరు స్టాలిన్‌ను తెగడి ఒకరు ట్రాట్స్కీనితెగడి చరిత్రను వ్రాయుటం చాలా వరకు జరిగే విషయం కాదా? ఫ్రెంచి విప్లవానికి డాంటన్ నాయకుడని జేలార్డ్ అభిప్రాయం. రాబస్‌ఫియర్ అని మాథియజ్ అభిప్రాయం. ఈయన వర్గానికి చెందినవారు అపుడే వెనకపడిపోయినట్లున్నారు. రాబస్ ఫియర్ హత్యాకాండ వారు కలలుగన్న సౌందర్య ప్రకాశాన్ని ఏమాత్రం నల్లబడనివ్వలేదు. "దేశభక్తి, విప్లవ భక్తి" అనేవి దృష్టి దోషానికి కారణము. అదేవిధంగా తరువాత మరో యుగంలో "సోవియట్ రష్యను" బలపరచటమనేది ప్రతిదానికి గీటురాయి అయినది. ఉత్పత్తి సాధనలను తిరిగి వ్యక్తిపరంచేసే విధానాన్ని పునఃప్రవేశ పెట్టకపోబట్టి, ఆయన ఏం చేసినా, అభివృద్ధి దోహదకుడుగానే చెల్లిపోయినాడు. ఆయన సాధన విధానం 500 లక్షలమంది చావుకుకాక, 40, 50 లక్షలమంది చావుకు మాత్రమే కారణమవుతే తక్కువ సంఖ్యవల్ల దానికి నూతన మహనీయత ప్రాప్తించిందా? దీనికి గతి తార్కికవాదం సమాధానం చెప్పదు.

అయినా, ఫ్రెంచి విప్లవ నాయకులకన్న స్టాలిన్ చెడ్డవాడని అనుకోటానికి తగిన కారణాలున్నాయి. "ప్రజా నాయకులు"—ఇది స్టాలిన్ ప్రయోగించిన పదము—వారికాలంలోని పరిస్థితులనుబట్టి పరిశీలింపబడుతారు. ఇవాన్ చర్యలు కొన్ని సహింపరానివి. కాని, ఆయన యుగము సంస్కారానికి ఆదర్శనీయం కాలేదు. అయితే స్టాలిన్ 20 వ శతాబ్దపు పాలకుడుగా పరీక్షకు గురి అవుతాడు. కాని, 16 వ శతాబ్దపు

దుష్ట పాలకుడుగా పరిశీలింపబడడు. ఇది దృష్టిలో ఉంచుకొని చూస్తే, కిరాత స్థితికి దిగజారినట్లు గుర్తింపక తప్పదు. బంగారు యుగం అనేది ఇంకా ముందు ఉన్నదని నమ్మే చరిత్ర కారులు కొందరికి ఈ విషయమై సందేహ మిండటము ఆశ్చర్యంగానే ఉంటుంది. నాగరికత పెరిగినకొద్దీ ముందు తరములవారు మనకంటే మరింత కఠినంగా ఆయనను పరిశీలిస్తారు. ముఖ్యంగా ముందు రాబోయే కమ్యూనిస్టు చరిత్ర కారులకు స్టాలిన్ గొంతు దిగని పచ్చివెలక్కాయ అవుతాడు. అందుకని ఆయనకు వారు కొంత అన్యాయంకూడా చేయవచ్చు. మొదట మంచిగా కనపడే ఒక నాయకుని లక్షణాలు పోను పోను అతను చేసిన చెడ్డపనులముందు సాధారణంగా లెక్కకు రాకుండాపోతాయి. సూయిటోనియస్ రచనలను చదివిన ఏ కొద్దిమందో తప్ప, కాలిగులా చాలా మంచి మితవాద నాయకుడనీ, అందరినీ ఆహ్వానించాడనీ టైబెరియస్ రద్దు చేసిన రాజ్యాంగ పరిపాలనను పునః స్థాపించాడనీ ఎవరు అనుకుంటారు? ఫ్రాన్సులో శాంతిని ప్రసాదించగల నాయకునిగా మొదట నెపోలియనుని ప్రశంసించారని ఇవాళ ఎవరైనా జ్ఞప్తికి తెచ్చుకుంటారా? చరిత్ర తీర్పు ఏకీభావములో ఉండటము అరుదు. అయినా వేర్వేరు తరాలకు చెందిన చరిత్రకారులు వేర్వేరు అభిప్రాయాలు వెలిబుచ్చటం కద్దు. ఫ్రెంచి విప్లవాన్ని గురించి బర్క్, థామస్ పెయిన్‌లు పెద్ద వ్యాఖ్యాతలుగా నేటికీ పరిగణింపబడుతున్నారు. నేటి Relativist చరిత్రకారులు wait—and—see చరిత్ర కారులు బర్క్, పెయిన్‌లలాగ వారితో సమానంగా నిలబడగలరా అనేది సందేహం. ఈమధ్య ఇ. హెచ్. కార్ హిట్లరును గురించి ఇలా అన్నట్లు చదివాను.

"హిట్లరు ఇప్పుడు మనకి చాలా చెడ్డమనిషిగా కనబడుతున్నాడు. కాని, ఒక నూరేళ్ళ తర్వాత అప్పటివాళ్ళు హిట్లరు చెడ్డవాడని, 1930 నాటి జర్మన్ ప్రజలు చెడ్డవారని అనుకుంటారా?"

ఇవ్వాళ హిట్లరు చెడ్డవాడని మనలో చాలామంది అనుకుంటాము. జర్మను ప్రజ మానసిక వ్యాధి పీడితులని అనుకుంటాము. అయితే ఒక వందేళ్ల తర్వాత అసలు విషయం తెలియని కొంతమంది తప్పంతా జర్మన్ ప్రజలదే అంటారు. ఇలాంటిది వందేళ్ల తర్వాత కాకుండా ఇంకా ముందుగానే జరగడానికి సూచనలు ఉన్నాయి. అయితే దీనిని గురించి ఇవాళ మన మెందుకు పట్టించుకోవాలి? ముందు తరాలవారు ఈ విధంగా అభిప్రాయపడబోతారు, ఈ విధమైన తీర్పు ఇస్తారు అని జోస్యం చెప్పిన చరిత్ర రచనలు ఎప్పుడైనా ప్రసిద్ధ రచనలుగా పరిగణింపబడినవా? రాజకీయంగా నైతిక ప్రమాణాలను వదిలి వేయటం ఎప్పుడూ వినాశకరము. హిట్లర్, స్టాలిన్ పైకి రావడానికి "చరిత్ర విధి" అనే సిద్ధాంతం కారణమని నమ్మేవారు కొంతవరకు బాధ్యులని చెప్పక తప్పదు. రానున్న పొంగుకు ఇది చిహ్నమని, చరిత్ర విధి అనే సిద్ధాంత వ్యామోహంలోపడి, వారి నియంతృత్వాన్ని నిరోధించి ప్రయోజనం లేదని ప్రచారం లేకపోయినట్టయితే అనేకమంది వీరి నియంతృత్వాన్ని ప్రతిఘటించేవారు.

ఇవ్వాళ మన మందరం స్టాలిన్ వ్యతిరేకులము. ఆయనకు బలిఅయినవారి అనేకమంది బంధువులు, మిత్రులు నేటికీ బ్రతికి ఉన్నారు. వారి అంతర్యాని వెల్లడించుకోడానికి ఇప్పుడిప్పుడే రష్యాలో అధికారులు అనుమతిస్తున్నారు. స్టాలిన్ వ్యతిరేక భావాలు పొంగి ప్రవహించడానికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. ఆయన పెట్టిన బాధలు స్మృతిపథంలోనుంచి తొలగిపోయి, గతంలో కలిసి పోవచ్చు. కొంతమంది చరిత్ర కారులు భిన్నమైన దృక్పథంతో ఏవిధమైన ఆవేశానికి చోటివ్వకుండా స్టాలిన్ పాత్రను తిరిగి వేరేవిధంగా మదింపు వేయవచ్చు. ప్రపంచ చరిత్రలో అత నొక మహా మేధావిగా చిత్రింప బడతాడని ఎవ్వరు అనుకోగలరు? ప్రపంచ రంగంమీద అతను ఆక్రమించిన స్థానం అతి దొడ్డది. అతని చేతల ప్రభావం క్రామ్‌వెల్, నెపోలియన్‌ల చేతలకన్న ఎక్కువమంది మన స్సులమీద పని చేసింది. ఆ కారణంగా అతను చరిత్రలో నిజంగా ప్రముఖ స్థానం ఆక్రమించాడు. అతను చేసిన పనులు ఎంత క్రూరమైనా, ఎంత బుద్ధిమాలినవైనా, ఇరవైకోట్ల ప్రజల పాలకుడు కాబట్టి అతను చేసిన ప్రతి పని ప్రాధాన్యత వహిస్తుంది. నేటి చైనా నాయకుల చర్యలు, విధానాలు ఎంత వినాశాత్మకమైనా (వారి జనాభా సంఖ్య తగ్గించుకో గలిగితే తప్ప) చైనా పెద్దదైన, ప్రముఖమైన దేశంగా ఉండి తీరుతుంది. ఒక పెద్ద దేశాన్ని నాశనం చేయడం అనేది చాలా కష్టంగానే కనపడుతుంది. కాని, హిట్లరు ఆ పని చేయగలిగినట్లు కనిపిస్తుంది. అయితే అతను సాధించింది నిలిచేదా అని అప్పుడే చెప్పడానికి వీలులేదు. అయినా ఇరవయ్యో శతాబ్దం ప్రమాణాల ప్రకారం జర్మనీ అసాధారణ రాజ్యం అనడానికి వీలు లేదు. 1914 తర్వాత ప్రతి అమెరికా అధ్యక్షుడు 1880 తర్వాత ప్రతి రష్యన్ పాలకుడు, 1930 తర్వాత ప్రతి చైనా నాయకుడు రాబోయే చరిత్ర పుస్తకాల్లో ప్రాముఖ్యంగా కనపడతారు.

నిరంకుశ పాలకులకాలఅరాధ్యుడుగా, పాపాత్ముడుగా స్టాలిన్, నెపోలియన్‌తోను, రాబస్‌పియర్‌తోను పోల్చబడడు. అతనికి ప్రముఖ సమకాలికుడైన అడోల్ఫ్ హిట్లర్‌తో పోల్చబడతాడు. పోయిన అతని ప్రతిష్ఠను పైకి తీసుకు

# స్టాలిన్ నాడు - నేడు

రావడానికి ఇది తమాషాగావున్నా, మంచి మార్గంగా కనపడవచ్చు. హిట్లర్ తనను గురించి లానే విడ్డూరమైన భ్రమలలో పడ్డాడు. ఏడు కోట్ల ప్రజలకు నాయకుడుగా, ప్రపంచం మీద ఆధిపత్యం చెలాయించవచ్చునని అనుకున్నాడు. జాతీయాధిక్యతను ప్రతిపాదించే ఆయన సిద్ధాంతం ఇతర దేశ ప్రజలతో సహకారానికి అడ్డు వచ్చింది. ఇదే ఒక విధంగా ఆయనకు వెన్నెమ్మ అయింది. వాస్తవిక దృష్టికల స్టాలిన్ తన దేశంయొక్క అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క పరిమితులను తెలుసుకొన గలిగాడు. మార్క్సి సిద్ధాంత అధ్యయనం ఇందుకు బాగా తోడ్పడింది. వారి వారి ఉద్యమ పరిమితులలో హిట్లరు ఎక్కువ ప్రతిభావంతుడు, ప్రముఖుడు. అతను లేకపోయినట్లయితే జాతీయ సోషలిజం అధికారానికి వచ్చేది కాదు. 1933 లో దక్షిణ పక్షాలు అధికారంలోకి వచ్చేవి. మార్షల్ గోరింగ్ నాయకత్వాన నడిచే జర్మనీ మరోవిధంగా ఉండేది. స్టాలిన్ అధికారానికి వచ్చే నాటికే రష్యన్ విప్లవగతి నిర్ణయమై ఉంది. 1921 తర్వాత పశ్చిమ రాజ్యాల సైనిక జోక్యమనేదిలేదు. స్టాలిన్ ఉన్నా, లేకపోయినా బోల్షివిజం అధికారంలో ఉండనే ఉండేది. హిట్లరు మంచివక్త. ఆయన సమక్షంలో మరొకరు మాట్లాడగలిగేవారు కాదు. ఆయన మాట్లాడితే ఏదో అభూతశక్తి ఆవేశించి మాట్లాడించినట్లుండేది. ఒక వశీకరణశక్తి ఉన్నట్లుండేది. స్టాలిన్ దగ్గర ఆ ఆకర్షణ అనేది పూజ్యం. కుట్రలతోను, పన్నాగాలతోను ఆయన అధికారానికి వచ్చాడు. ఒక విస్తృతమైన యంత్రాంగం ద్వారా పరిపాలించాడు. మొదటి పాత బోల్షివిక్కులందరినీ ఒక్కరైనా మిగలకుండా మట్టుం చేశాడు. హిట్లరు పాత సహచరులంటే భయపడేవాడు కాదు. వారంటే ఒక వేధమైన ఈసడింపు భావం కూడా ఉండేది. అందుకనే వారిలో చాలమంది బ్రతికి ఉండడం జరిగింది. 1934 జూన్‌లో జరిగిన ఒక ''రాజకీయ వడపోత'' మినహా, పెద్ద వడపోత అంటూ జరగలేదు. గోబెల్స్, గోరింగ్, హిమ్లర్ చివరదాకా అతనితో ఉన్నారు.

అయినా వీరిని ఒకరితో ఒకరిని పోల్చి చూస్తే నియంతృత్వ పాలనకు స్టాలినే తగిన వాడని అనిపిస్తుంది. అతని మేధా సంపత్తి చాలా కొద్ది అని అతని విమర్శకులు అతిగా చెబుతారు. అతను పెద్ద యోచనాపరుడుకాదని, ఈనాడు చెప్పడం అనవసరం. అతనికీ, పాత బోల్షివిక్కులకు తారతమ్యం కొందరనేటంత ఎక్కువగా లేదు. ఇతర విషయాలలో వలెనే ఈ విషయంలో కూడా అతను మధ్యమ శ్రేణికి చెందినవాడు. కాని, మేధావి అయిన వాడు అధికారంలో అట్టేకాలం ఉండలేకపోవచ్చు. ఒడుదుడుకు సమయాలలో అనిశ్చిత మనస్కుడుగా ఉంటాడు. అనేక విషయాలు ఆలోచించవలసి ఉంటుంది. అనేక పరిస్థితులను పరిగణించవలసి ఉంటుంది. స్టాలిన్‌ది మధనపడని మనస్సు. చిన్నతనంలోనే అతను కొన్ని ప్రాథమిక సత్యాలను తెలుసుకున్నాడు. వాటినిమించి ఆలోచించడు. ఆయన ప్రత్యర్థులకంటే ఆయన కవి బాగా తెలుసు. అధికారానికే ఏదైనా పలుకుతుంది. మిగతాదంతా వట్టి హస్క అని ఆయన అభిప్రాయం.

పార్టీలోని దళం అంతా నిర్ణయిస్తుంది. భారీ పరిశ్రమల వల్ల ప్రయోజనంలేదు అని ఆయన నమ్మకం. ఆయనకు కొన్ని విషయాలు తెలియక పోవడమే వీలుగా పరిణమించింది. కార్యాచరణకు తోడ్పడింది. తరచు తప్పు నిర్ణయాలు చేశామనేది ఆయన నెప్పుడూ బాధించేదికాదు. ఎందుకనంటే ఆ తప్పుకు శిక్ష అనుభవించేవారు వేరుగా ఉండేవారు.

హిట్లర్, స్టాలిన్ ఇద్దరూ కూడా తమ దేశాలకు తాము లేనిదే ,జరగదనుకొనేవారు. జనం అంటే అపనమ్మకం, ఈసడింపు ఇద్దరికీ సమానం. న్యాయం, సత్యం అన్న వాటిమీద వారి అభిప్రాయాలలో ఏ ఒక్కరిదీ మనం ఎన్నుకొనడం కష్టం. హిట్లరు అరుదుగా మాట్లాడేవాడు. ఈ విషయాల ప్రసక్తి వచ్చినప్పుడల్లా హేళన చేస్తూ ఉండేవాడు. కాని స్టాలిన్‌ను గురించిన అధికార, అనధికార రచనలలో అతనిని వినయ భూషణుడని, సత్యవంతుడని, ప్రజాశ్రేయస్సు ప్రాణప్రదమని వర్ణిస్తూ ఉండేవారు. తాను చాలా దయార్ద్ర హృదయుడనని హిట్లరు అనుకునేవాడు. అధికార సాహిత్యం ప్రకారం స్టాలిన్ పార్టీ శత్రువుల పట్ల నిర్దయుడు. మిగతా అందరిపట్ల దయానిధి. హిట్లరు ఏ సందర్భంలో అయినాసరే పెద్ద నిగ్రహం లేకుండా వ్యవహరించేవాడు. స్టాలిన్ నెమ్మదిగా నిర్ణయాలకు వచ్చేవాడు. స్టాలిన్ విషయంలో తీర్పు చెప్పడానికి ఆయన చేష్టలను హేతుబద్ధం చేయడానికి ప్రయత్నించేవారు. ఆయన సమకాలికులకు బ్రహ్మాండంగా కనిపించేవి, భవిష్యత్తులో చరిత్రకారులకువట్టి డబ్బా మోత అనిపించవచ్చు. సాధారణంగా చరిత్ర కపట నటన కన్న, క్రౌర్యాన్ని క్షమించడానికి ఇష్టపడుతుంది. నిజంగా చరిత్రలో పెద్ద కపట నటనధారి స్టాలిన్.

కూర్చుని విడవకుండా పనిచేసే లక్షణం హిట్లర్‌తో పాటు స్టాలిన్‌కూవుంది. హిట్లర్‌కంటె ఎక్కువ శ్రద్ధ, ఓపిక, విసుగు విరామంలేకుండా పనిచేసే లక్షణం వుండడంవల్ల పెద్ద నిరంకుశ ప్రభుత్వ యంత్రాంగాన్ని నడపడానికి హిట్లర్ కన్నా కూడా ఈయన తగినవాడు. వ్యవస్థా నిర్వహణలో చిన్న చిన్న పనులమీద శ్రద్ధ చూపించడం హిట్లర్ తత్వానికి

సరిపడదు. కాని స్టాలిన్‌కి అలాంటి పని అమిత ఇష్టం. సైనిక వ్యూహ రచనలో ఇద్దరి ప్రతిభ ఒక్కటే. అంటే లక్షమంది ఇతరజనం కంటె వారికి తెలిసింది ఏమీ ఎక్కువకాదు. ఎప్పుడైనా సైన్యాధిపతుల సలహాలను త్రోసివేసినా సత్ఫలితాలు వస్తే ఆ సైన్యాధిపతుల నిర్ణయాల విలువ తెలియడం తప్ప మరేమీకాదు. వారిని గురించిన కట్టుకథలు దాదాపు నవ్వువచ్చేటంత తేలికగా అల్లడమూ, నమ్మడమూ జరుగుతుంది. స్టాలిన్ జీవిత చరిత్ర', రచించిన పాశ్చాత్య రచయితలలో అందరికన్న ప్రసిద్ధికెక్కినఆయన స్టాలిన్‌ను వ్యూహ రచయితగా ఈ విధంగా చిత్రించాడు. ''అంతులేని ఓర్పు, పట్టుదల, అప్రమత్తత, సర్వశక్తుడు, దాదాపు సర్వవ్యాప్తుడు'' అని ఒక చోట, ''అసాధారణ మనోనిశ్చయాన్ని పట్టుదలను, నిశ్చలత్వాన్ని ప్రదర్శించారు.'' అని మరొకచోట వర్ణించారు. ఇదే విషయంపైని ఇపుడు రష్యాలో వ్రాస్తున్నదానితో చెబుతున్న దానితో పోల్చిచూడటం అవసరం. హిట్లరు మెరపుయుద్ధం పశ్చిమ యూరపులో బాగా పనిచేసింది. కాని రష్యాలో వినాశహేతువైంది. తన విదేశ విధానంలోలాగే, సైనిక నిర్ణయాలను చేయడంలో స్టాలిన్ బయటనుంచి వచ్చే ప్రమాదాన్ని గురించే ఆలోచించాడు. 1930 సం.లో ఆంతరంగిక విధానాలకు అన్నిటికన్న ఎక్కువ ప్రాధాన్యము నిచ్చాడు. ''ఒకదేశంలో సోషలిజం స్థాపన'' అనే సూత్రానికి ఎప్పుడైతే అంటి పెట్టుకోదలచాడో, అప్పటికి స్వంత దోవ తొక్కాడని అనవచ్చు. సోవియట్ సమాజ పరివర్తనంలో మార్క్స్ వ్రాసినదేదీ ఉపకరించలేదు. లెనిన్ వ్రాసినది ఏ కొంచెమో ఉపయోగపడింది. హిట్లరు పని ఇంతకంటె సులభం. అతనెప్పుడూ సాంఘికంగా పెద్దమార్పు తలపెట్టలేదు. ఆర్థికవిషయాలు, దేశీయ విషయాలు ఆయన అంతగా పట్టించుకోలేదు. ఆయన పార్టీకి విస్పష్టమైన సాంఘిక ఆర్థిక కార్యక్రమాలు ఏమీలేవు. అయినా జర్మనీ ఆర్థిక స్థితి హిట్లరు హయాంలో గడ్డకట్టుక్కుపోయిందా ? నిజానికి అతని హయాములో చెప్పుకోదగిన అభివృద్ధి జరిగింది. సోవియట్ యూనియన్‌లో జరిగిన దానితో పోలిస్తే ఇది తక్కువ కావచ్చు. ఇది సహజము. ఎందుకనంటే జర్మనీ పారిశ్రామికంగా ఆదివరకే బాగా అభివృద్ధి చెందిన దేశం, ప్రపంచ ఆర్థిక మాంద్యం ఒకసారి సడలిన తర్వాత జర్మన్ ఆర్థికస్థితి ఎలాగూ అభివృద్ధి చెందేది. అలాగే ఎవ్వరు అధికారంలో ఉన్నా 1929 తర్వాత సోవియట్ ఆర్థికస్థితి కూడా అభివృద్ధి చెందేది. జర్మన్ పారిశ్రామికోత్పత్తి శక్తిలో చాలా భాగం ఆయుధ నిర్మాణానికి కేటాయించబడింది. అయితే సాధారణంగా అందరూ అనుకున్నంతగా కేటాయింపు జరగలేదు : మహాయుద్ధానికి తగినట్లుగా హిట్లరు ఎందుకు ఇంతకంటె పటిష్టమైన సన్నాహాలు చేయలేదనేది ఇంకా అర్థం కాని క్లిష్ట సమస్యగానే వున్నది. ఆయన నిజంగా యుద్ధం కోరలేదని కొంతమంది చరిత్రకారులు ఇప్పుడు చెబుతున్నారు. ఆర్థిక సంబంధమైన విషయాలన్నింటిని గురించి ఆయన అజ్ఞానమే అన్నింటికి కారణమని నా అభిప్రాయం. రష్యాను పారిశ్రామికం చేయడం స్టాలిన్ చేసిన శాశ్వత మహాకార్యమని తరచు అంటారు. ఒక పదేళ్లలో రష్యాకనుక ఒక బలమైన పారిశ్రామిక దేశంగా పెరగకపోతే, పూర్వం జరిగినట్లే రష్యా వంగిపోవలసి వస్తుందని, అందుకని కాలంతో పందెం వేసుకొన్నట్లు పారిశ్రామిక కార్యక్రమాన్ని సాధించాలనుకున్నాడు. అందుకు ఉపక్రమించాడు. ''1930 లో భారీ పరిశ్రమ పెద్దపెట్టున పెరిగింది. ''ఎర్రసైన్యం'' బలీయమై అన్ని విధాలా సిద్ధమైనట్లు'' 1941లో తేలింది. నాజీ భూతం అణచివేయ బడింది. రాజకీయంగాను పారిశ్రామికంగాను ''యూరపులో రష్యా అన్ని దేశాలకన్న మిన్నగా రూపొందింది.'' ఇదంతా క్రెమ్లిన్‌లో కూర్చున్న ఒక వ్యక్తి పట్టువిడవకుండా, ఎన్ని అడ్డంకులు చిక్కులు వచ్చినా వానిని అధిగమించి ఏకదీక్షతో కృషిచేయడంవల్ల ఫలించినదని అంటున్నారు. స్టాలిన్‌ని గురించి ఇంతకుమించి మంచిచెప్పి నచ్చజెప్పలేము. అయినా ఈ కథకు ఇదివరకే మొట్టికాయలు తగిలాయి. కొద్ది సంవత్సరాల తర్వాత ఈ కథలో మిగిలేది ఎంతో ఉండదు.

మొదటి ప్రపంచయుద్ధం, విప్లవమూ అంతర్యుద్ధమూ రష్యా పారిశ్రామిక అభివృద్ధికి అడ్డుపడ్డాయి. వీటివల్ల కలిగిన గాయాలు 1920 లో చివరకు మానిపోయినవి. అప్పటికి పారిశ్రామికంగా ముందుకు పోవడానికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయి. అప్పుడు ఎవ్వరి నాయకత్వం ఉన్నా అభివృద్ధి సాగిపోయేది. అభివృద్ధి ఎంత వేగంగా జరుగుతుంది అన్నదితప్ప వేరేవిూలేదు. పంచవర్ష ప్రణాళికలు స్టాలిన్ సృష్టికాదు. రష్యాపాలన కనక స్టాలిన్ అంతటి క్రూరుల చేతుల్లో లేకపోయినట్లయితే, పారిశ్రామికోత్పత్తి 1928—40 లలో రెట్టింపు లేకపోతే మరిరెట్టింపు మాత్రమే అయి ఉండవచ్చు. అయితే గత యుద్ధంలో జర్మనీని ఇంతగా ప్రతిఘటించలేకపోయే వారనేది అంగీకరించడానికి వీలులేదు. తూకం వేస్తే స్టాలిన్ చేసిన పొరపాట్లు, తప్పులు ఎక్కువని తేలుతుంది. అవకతవక పద్ధతులవల్ల పరిశ్రమలను గాడి తప్పించడం, ఉన్నత సైన్యాధికారుల విచ్ఛేదంవల్ల సైన్యాన్ని బలహీన పరచడం, బలవంతంగా సాముదాయక వ్యవసాయాన్ని ప్రవేశపెట్టడంవల్ల జనంలో అసంతృప్తి రావడం, (ఇది తప్పుఅని సోవియట్ రచయితలు కూడా ఇప్పుడిప్పుడు ఒప్పుకోవడం మొదలుపెట్టారు) 1941వసంత కాలంలో నాజీ

# స్టాలిన్ నాడు - నేడు

దండయాత్ర రాగలదని ప్రపంచమంతటికీ తెలిసినా, తాను దానిని తిరస్కరించి, తగిన సైనిక సన్నాహం చేయకపోవడం ఇవన్నీ ఆయన సడువును తగ్గించే తూకపురాళ్ళు. ఆతని తప్పులన్నీ కలిపి కూడితే, రాగలదానినంతా చూడగలిగిన కాలజ్ఞుడని ఆయనను గురించి చెప్పే పురాణం వట్టిపురాణమని తేలుతుంది. జర్మనీతో చేసిన యుద్ధంలో మొదట వచ్చిన అపజయాలు రావలసినవి కాదని ఇప్పుడు సోవియట్ రచయితలు అందరూ చెబుతున్నారు. ఏమైనా రష్యా డెన్మార్కు, హాలెండు వంటి చిన్నదేశం కాదుగదా! అందుకని మెరుపు యుద్ధం రష్యామీద పనిచేయదు. అంత సమర్థనీయం కానటువంటి జారుచక్రవర్తుల కాలంలో కూడా రష్యా సైనికంగా పెద్ద శక్తి వంతమైన దేశంగా పరిగణింప బడింది. తనకు అతి విశాలమైన భూభాగమున్నది. అసంఖ్యాకమైన సైనిక దళాలు వున్నవి. ఇవి రష్యాకు ప్రకృతి ప్రసాదించిన శక్తులు, వీటివల్ల వారిసైన్యాలు హిట్లరును మించిన సైనిక నిపుణులను ఓడించాయి. అయినప్పుడు స్టాలిన్‌ను పీఠంమీద వుంచడానికి ఇంత "బలి" ఇవ్వడం కమ్యూనిస్టులకు అవసరమా అన్న ప్రశ్న ఈ మధ్య చర్చకు వచ్చింది. "ఇప్పట్లో ఇది అవసరం" అని ఆదికాలంనుంచి ప్రతినియంత చెపుతూ ఉండడం పరిపాటి. శీఘ్ర పారిశ్రామిక అభివృద్ధికి వేతనాలు తొక్కిపట్టడం, నిత్యజీవితావసర వస్తువుల ఉత్పత్తి పెరగనీయక పోవడం, ఖర్చుఅనేది లెక్కచేయకుండా జీవితావసరలకు పనికిరాని వస్తువుల ఉత్పత్తికి వ్యయపరచడం, మొదలైనవి ఆర్థిక దృష్టితో చేసినవి కాక కేవలం రాజకీయ ప్రయోజనాలకోసం చేయడం జరిగింది. ఇలాంటిది నియంతృత్వంలోనే సాధ్యం. ఈ మధ్య ఒక ఆర్థిక చరిత్రకారుడు చెప్పినట్లు ఈ పద్ధతి ప్రభుత్వానికి సాంఘికంగా పనికల్పిస్తుంది. అధికారం చలాయించడానికి ఆస్కార మిస్తుంది : "నిత్యకృత్యంలో కావలసిన వస్తువుల వాడక ప్రమాణాన్ని శీఘ్రంగా పెంచేటటువంటి విధానం త్వరలో రాజకీయ కష్టాలను తొలగించవచ్చు. అయితే పోనుపోను క్లిష్ట సమస్యలను తెచ్చిపెట్టవచ్చు. ఈ అవసర వస్తువుల సరఫరా పుష్కలమైతే ప్రజలలో ఒక విధమైన తృప్తి, నెమ్మది ఉంటాయి. ఈ వాతావరణం నియంతృత్వాలకు సరిపడదు. నిత్యావసరాలకు సంబంధించిన వత్తిడి తగ్గి మరుక్షణం రాజకీయమైన స్వేచ్ఛావాంఛ తలెత్తుతుంది." అని ఆ చరిత్రకారుడు అన్నాడు.

అవసరమూ అనవసరమూ అనేమాట అలావుంచి, పరిశీలిస్తే, సాంఘికంగా జర్మను ప్రజలమీద పడిన హిట్లరు ముద్రకన్న, రష్యన్ ప్రజలమీద పడిన స్టాలిన్ ముద్ర ఎక్కువ. మేధావుల విషయంలో కూడా అలాగే జరిగింది. హిట్లర్ హయాములో జర్మనీ మేధావుల స్థితిని, స్టాలిన్ హయాంలో రష్యన్ మేధావుల స్థితిని సరిపోలుస్తూ అజాక్ డీశ్చర్ తన స్టాలిన్ జీవిత చరిత్రను పూర్తిచేశాడు. హిట్లరు జర్మను సంస్కృతిని నాశనం చేశాడన్నారు. స్టాలిన్ జాతి నంతటిని స్కూలుకు పంపి, రష్యా మేధాసంపత్తికి బ్రహ్మాండమైన ప్రోత్సాహమిచ్చాడన్నారు. "జర్మనీలో జాతి స్వచ్ఛత పేరుతో డాక్టర్లను ప్రత్యేక నిపుణులుగా తయారుచేశారు. "కలితీ రక్తం ఉన్నవారిని హత్యాకారులుగా చేశారు." యూదు జాతివారు దేశంవదలి వెళ్ళిపోవడంవల్ల జర్మను వైద్య నైపుణ్యం దెబ్బ తిన్నది. అనేక వందల మంది జర్మను వైద్యులు ఊహింపరాని అమానుష కార్యాలను చేశారు. అయినప్పటికి జర్మన్ డాక్టర్లు నూటికి తొంభై తొమ్మిదిమంది వెనుకటి మోస్తరే తమ వృత్తిని సాగించుకు పోయారు. స్టాలిన్ హయాంలో సోవియట్ డాక్టర్లు కనిపెట్టినట్లే కొన్ని పెద్దమందులను కనిపెట్టారు. నారిమోస్తరే కొంత మంచినీ చేశారు. చెడ్డనూ చేశారు. "తన దృక్పథంతో ఏకీభవించని పూర్వ గ్రంథాలను చదవకూడదని హిట్లర్ మోస్తరు, స్టాలిన్ నిషేదించలేదు" అని డూయిశ్చర్ వ్రాశాడు. కాని స్టాలిన్ డోస్టవస్కీ పుస్తకాలు చాలా నాటిని, కొన్ని టాల్‌స్టాయ్ పుస్తకాలు, లెస్కొ ప్పిసమ్‌స్కీ మరితరుల పుస్తకాలు ప్రచురణ కానివ్వలేదు. కొన్నిటిని కొంతమంది కోసం ప్రత్యేకంగా సంక్షిప్త ప్రతులుగా వేశారు. మిగతా పూర్వ గ్రంథాలను జాగ్రత్తగా సంస్కరించి ప్రచురించారు. హేన్ మరితర యూదుల గ్రంథాలను హిట్లరు నిషేధించాడు. ఒక లేసింగ్ పుస్తకాన్ని తప్ప మరే పూర్వ గ్రంథాన్ని హిట్లరు నిషేధించలేదు. నాజీ ఇజానికి ఆదర్శభావ పీడన తక్కువ. కాబట్టి వారు సంస్కృతికి సంబంధించిన వ్యవహారాలను గురించి అంతగా పట్టించుకోలేదు. పరిపూర్ణమైన నియంతృత్వంగా పరిణితి చెందడానికి దానికి ఆరేళ్లకాలం చాలలేదు. నాజీ వ్యతిరేకి కాకపోతే సరి ఎవ్వరైనా సరే నిలవడానికి వీలయింది. సోవియట్ రష్యాలో ప్రతిఒక్కరూ బహిరంగంగా భక్తి ప్రదర్శన చేయాలి. ఇది చాలా ముఖ్యమైన విషయము. కాని దానిని గురించి ఎవరూ అంతగా శ్రద్ధ వహించలేదు. చిత్రకళలోను, వాస్తు శిల్పంలోను, విగ్రహాలు చేయడంలోను మాత్రమే నాజీ జర్మనీలో పాక్షిక దృష్టి కనబడుతుంది. ఈ విషయంలో హిట్లరు జర్మనీకి, స్టాలిన్ రష్యాకి పోలిక ఉన్నది. పెద్ద పెద్ద భవన నిర్మాణంలోను శిలా విగ్రహాలు చేయుటంలోను, పెద్ద చిత్రాలను తయారుచేయడంలోను నియంతలందరికి ఒక విధమైన వ్యసనం ఉన్నట్లు

కనబడుతుంది. రష్యాలో నిషేధించినట్లే నాజీ జర్మనీలో కూడ మానసిక శాస్త్రం నిషేధించబడింది. ఆ కారణంగా ఈ రెండు దేశాలలోను వ్యాఖ్యానయుతమైన జీవశాస్త్రం వ్రాయడం కూడా కష్టమైంది.

నాజీ జర్మనీ, స్టాలిన్ రష్యాలలో సాహిత్య స్థితిని పోల్చి చూస్తే కొట్టవచ్చినంత వ్యత్యాసం కనపడుతుంది. రాజకీయమైన ప్రణాళికా ప్రచార సత్రాలపై సంతకంచేసి అనేక మంది జర్మన్ రచయితలు కొంత దిగజారారు. హిట్లరు హయాంలో పెద్దగా చెప్పుకోతగిన రచన ఏదీ జర్మనీలో రాలేదు. హిట్లరు బాల్యదశను వర్ణిస్తూ వ్రాయమని జర్మను రచయితల మీద వత్తిడి తీసుకురాలేదు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఆయన ధైర్య సాహసాలను గురించి నవలలు వ్రాయవలసిందని బలవంతం పెట్టలేదు. వారివి కేవలం పట్టు, పటుత్వం లేని రచనలు. ప్రత్యేకరచనకు నియమించబడ్డ కొంత మంది తప్ప సాధారణంగా నాజీ పార్టీ చరిత్రను గురించి వారెవ్వరూ వ్రాయలేదు. సోవియట్ రష్యాలో వ్యక్తిపూజలనేది, సర్వ వ్యాప్తమైంది. నాయకుణ్ణి గురించి నవలలేమిటి, నాటకాలేమిటి, పద్యాలేమిటి, ఇదీ అదేమిటి అన్ని రచనలు వచ్చాయి. చెత్తవ్రాసేవారే కాక, మహా రచయితలన్నవారు కూడా అదే చేశారు. సోవియట్ సాహిత్యం కొంత స్వేచ్ఛా ధోరణి అనుసరించాలని ఈ నాడు కోరేవారు, కూడా ఆనాడు అదేపని చేశారు. 1949లో స్టాలిన్ 75వ జన్మదినోత్సవం సందర్భంలో సోవియట్ రచయితలు స్టాలిన్‌ను గురించి ఏమి వ్రాశారని ఈ మధ్య తిరిగి చదివాను. అవి ఎంతో బాధ కలిగించాయి. వ్యక్తి పూజ అనేది చాలా హానికరమైనా, ఆ చీకటి రోజుల్లో కూడా కొన్ని ఉదాత్త రచనలు వచ్చాయి అని కొందరు వాదిస్తున్నారు. ఆ రచనలలో స్టాలిన్ ప్రసక్తి వచ్చిన భాగాలను, సన్నివేశాలను తొలగిస్తే చాలు. వానికి ఏ లోపం ఉండదని వారివాదన. కొన్ని రచనలకు ఈ సూత్రం వర్తింప వచ్చు. అంటే స్టాలిన్ గురించి కథలు సందర్భశుద్ధి లేకుండా ప్రవేశపెట్టిన రచనలను ఈ విధంగా సంస్కరించవచ్చు. కాని మొత్తంమీద చూస్తే అలాంటి శస్త్ర చికిత్స చేయడం సాధ్యంకాదు. ఈ పద్యాలు, ఈనాటకాలు వగైరాలు నాయకుణ్ణి స్తోత్రం చేయడంతోనే సంతృప్తి పడలేదు. రచయితలు కేవలం పరవశులైపోయారు. కృశ్చేవ్‌కు ప్రియమైనది ఆయన తరచు చెప్పే సామెత ప్రకారం ఒక చుక్క విషం ఒక పీపా తేనెను చెరుస్తుంది. మిగతా రంగాలలో కూడా— 1950లో సినిమా విషయం చూచినా వేదాంత విషయం చూసినా, రాజకీయ ఆర్థిక విషయాలు చూచినా పైన చెప్పిన దాని కేమాత్రం భిన్నంగాలేదు. స్టాలిన్ తత్వం సాంఘిక జీవితంమీద ఎంత దెబ్బకొట్టిందో మానసిక జీవితంమీద కూడా అంతదెబ్బ తీసింది : సోవియట్ రష్యా దీనినుంచి కోలుకోవడానికి చాలాకాలం పడుతుంది.

హిట్లరు పాపి అయితే, స్టాలిన్‌లో పాపపుబుద్ధి చాలా తక్కువ. స్టాలిన్ పని కేంద్రాలను నాజీం నిర్మూలనా కేంద్రాలను కొందరు సరిపోల్చుతున్నారు. కాని ఇలా చేయడం వాటికి సంబంధించిన విషయ పరిజ్ఞానంగాని ఊహగాని, లేక రెండూ గాని పూజ్యమవటమని చెప్పాలి. స్టాలిన్ అవసరాన్ని బట్టి పాపికావలసి వచ్చిందని ఆయన అభిమానులు అంటారు. ఒక ఆదర్శస్థితిని చేరడానికి ఆయన భయంకరమైన సాధనాలను ఉపయోగించాడు. ఆయన చేసిన మారణహోమం ఉజ్జ్వల భవిష్యత్తు కోసం, స్వేచ్ఛకోసం, అని అంటారు వీరు. ఇలా చెప్పేది, ఆ మారణహోమంలో బలిఅయిన వారికి పట్టదు కదా ! కాని ఇది ఆయన మార్గంలో కొన్ని అంతరాయాలు కలగజేసింది. ఇలాంటిది హిట్లరు ఎదుర్కొన అవసరంలేక పోయింది. ఆదర్శ సంఘం అనే ఆశయంలో తన చరమదశ నాటికి స్టాలిన్ ఎంతవరకు నమ్మాడనేది ఆలోచించవలసిన విషయం. అప్పటికి కేవలం సాధనలే ఆశయాలైనాయి. "సాధనాలలోటు తప్ప, మూలఆశయం మాత్రం అప్పటికీ ఇప్పటికీ మంచిదే." అని రష్యాలో అనడం నేను విన్నాను. కమ్యూనిజాన్ని ప్రవేశపెట్టడానికి స్టాలిన్ అవలంబించిన మార్గం చెడ్డది. అంతేకాదు. మూల ఆశయంకూడా మంచిది కాదు." అని మరికొందరన్నారు. ఇలా చెప్పే వైఖరి అతి తేలికగా ఉంది.: కాని ఒక విషయం. హిట్లర్ క్రూరత్వం పూర్తిగా స్వయంకల్పితం. స్టాలిన్ నియంతృత్వం అతని ధోరణిని, నడతనీ అనుసరించివున్నది. అయినప్పటికి చాలవరకు చారిత్రక పరిస్థితులు ఆధారమైనాయి. జారుల తర్వాత 1917 లో లెనిన్ ఏర్పరచిన పరిపాలనా విధానముకూడా నిరంకుశానికి మొగ్గింది. ఈ పద్ధతి చివరకు ఎక్కడికి దారితీసేది ఆ మరుసటి సంవత్సరం రోజాలగ్జంబర్గ్ టి. చ. తప్పని, జోస్యం చెప్పాడు. అప్పటికి స్టాలిన్‌లేడు.

మార్క్స్ చారిత్రక భౌతికవాద దృష్ట్యా స్టాలినిజాన్ని వివరించడం ఎలా అనేసందిగ్ధ స్థితిలో 17,000 మంది సోవియట్ రష్యా చరిత్రకారులు పడ్డారు. వీరికి జతగా పై దేశాలవారు కూడా ఉన్నారు. ఒక దేశంలో ఒక సందర్భంలో ఒక వ్యక్తి ముందుకు వచ్చాడంటే, అది కేవలం వట్టి సంఘటనే అని, ఆ వ్యక్తి గనక తొలగింపబడితే, మరుక్షణం మరొకరి కోసం అలజడి ప్రారంభమౌతుందని, ఎవరినో ఒకరిని నిల

బెట్టడం జరుగుతుంది అని ఎంజెల్సు వ్రాశాడు: రష్యా మార్క్సిజానికి జనకుడని ప్రసిద్ధి పొందిన ప్లెఖనోవ్ చరిత్రలో వ్యక్తి యొక్క పాత్రను గురించి ఇలా వ్రాశారు.—"ఎక్కడైతే సాంఘిక పరిస్థితులు అనుకూలంగా ఉంటాయో అక్కడ ప్రతిభగల వ్యక్తులు తయారౌతారని చాలా కాలంగా తెలిసిన విషయం. అంటే ప్రతిభవుండి సంఘంలో పలుకుబడి సంపాదించిన ప్రతి వ్యక్తి ఆనాటి సమాజ స్థితిని అనుసరించి వచ్చిన వాడనే అనాలి. ఒక గొప్ప వ్యక్తి గొప్పతనం పెద్ద చారిత్రక సంఘటనలలో ఆతని వ్యక్తి లక్షణాలు కనబడడం మూలాన కాదు. అప్పటికి ప్రధానమైన సాంఘిక అవసరాలు తీర్చడానికి మిన్నగా కృషి చేసే లక్షణాలు అతనికి గొప్పతనం ఆపాదిస్తాయి."

1920 లో స్టాలిన్, స్టాలినిజం పైకి రావడానికి రష్యాలో సాంఘికమైన, రాజకీయమైన పరిస్థితులు ఏమిటి? స్టాలిన్‌ను సృష్టించిన సమాజ సంబంధాలు ఏమిటి? అప్పటి సాంఘికావసరాలను తీర్చడానికి మిన్నగా పని చేయగల లక్షణాలు ఆయనకు ఏమి ఉన్నాయి? ఇవి ఇరుకైన, కష్టమైన ప్రశ్నలు. అందుకని వీనికి రష్యానుంచి ఇంతవరకు మార్క్సిస్టు సమాధానం రాకపోవడంలో ఆశ్చర్యంలేదు. చరిత్రలో నాయకునియొక్క పాత్రను గురించి మార్క్సిజం సోవియట్ చరిత్రకారులకు తృప్తికరమైన సమాధానాన్ని ఇచ్చే అవకాశం లేదు. కాబట్టి, వారు తప్పనిసరిగా స్టాలిన్ పాత్రను తగ్గించ వలసి వస్తుంది. బహుశా ఆయన అసలంత గొప్పవాడు కాదేమో! మరీ ఈ మధ్య వచ్చిన రష్యా చరిత్ర గ్రంథాలలో స్టాలిన్ చెప్పిన మాటలుగాని, స్టాలిన్‌ను గురించిన మాటగాని లేనే లేదు. ఆయన ప్రాముఖ్యంగా చిత్రించబడవలసిన చోట కూడా ఇది జరిగింది. ఆయన పేరుకు బదులు పార్టీ నాయకత్వం అనే మాట ఉపయోగించబడింది. పార్టీ నాయకత్వం అంటే అనేక సంవత్సరాలపాటు ఒక వ్యక్తి కాదని, అందరికీ తెలిసిన రహస్యమే. ఈ గారడీ చరిత్ర రంగంమీద పని చేయదు. ఎవరో కొద్దిమంది మినహా రష్యనులంతా స్టాలిన్ బాధ పడ్డారు. ట్రాట్స్కీని కూడా నాయకుడుగా తీసివేయవచ్చు. స్టాలిన్‌ను అలా కాదనడానికి వీలులేదు. స్టాలినిజాన్ని తక్కువ చేయ ప్రయత్నించడం నిరుపయోగం. అమానుషం. రష్యనులు కరుణా స్వభావులు అవుటవల్ల తమ గతాన్ని పునఃనిర్మించాలని తొందరపడుతున్నారు. ప్రస్తుత నాయకత్వం మధ్యే మార్గం అవలంబిస్తున్నది. 1953 ఏప్రిల్‌లో క్రెమ్లిన్ డాక్టర్లను విడుదల చేయడం, 1962 నవంబరులో ఇవాం డిన్ నోవిచ్ ప్రకటన ఇందుకు తార్కాణము:

స్టాలిన్ తత్వ నిర్మూలన కార్యక్రమంలో నాలుగు ఘట్టాలను చూడవచ్చు. 1953 మార్చిలో స్టాలిన్ మరణించిన తక్షణమే మొదటి ఘట్టం ఆరంభమైంది. వడపోతలు ఆపబడినవి. నాయకత్వం పునర్నిర్మింపబడినది. కొంతమంది రహస్య పోలీసు అధికారులు బర్తరఫ్ అయ్యారు. ఇదే కాలంలో ఇల్యా ఇహిరెన్‌బర్గ్ The Thaw అనే నవల వ్రాశాడు. ఇంకా అప్పటికి స్టాలిన్‌మీద బహిరంగంగా విమర్శ లేదు. కాని, పేరుమాత్రం రేడియోలోను, పత్రికలలోను ఉపన్యాసాలలోను చాలా కొద్దిగా పేర్కొనబడుతూ ఉండేది. పాత బోల్షివిక్ నాయకులు కొంతమందిని పైకి తీసుకు వచ్చారు. గతించిన కొంతమందిని గురించి గొప్పగా మాట్లాడారు. 1956 ఫిబ్రవరిలో జరిగిన 20 వ పార్టీ సమావేశం తర్వాతనే, పూర్వ నాయకుల ప్రస్తుతి బహిరంగంగా జరిగింది. స్టాలిన్ తత్వ నిర్మూలన కార్యక్రమంలో ఇది రెండవ ఘట్ట ప్రారంభం. ఈ 20 వ పార్టీ సమావేశమే సోషలిస్టు Legality ని సుస్థాపితంచేసి, పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యాన్ని లెనినిస్టు సూత్రావలంబనకు తిప్పింది. పార్టీ అధికార చరిత్ర—సంక్షిప్త గ్రంథం—ప్రప్రథమంగా విమర్శకు గురి అయింది. ఈ సమావేశంలోని ముఖ్య సంఘటన ఫిబ్రవరి 25 న కృశ్చేవ్ ఇచ్చిన ప్రసిద్ధ ఉపన్యాసం. ఇది అనేక వారాల తర్వాత బయటకు వచ్చింది. స్టాలిన్‌ను దుయ్యబట్టడమే ఈ ఉపన్యాససారం. అది రహస్యోపన్యాసం. సోవియట్ రష్యా కూటమి దేశాలలో ఈనాటివరకు అది ప్రకటించబడలేదు. సోవియట్ నాయకులు అతి జాగరూకతతో వ్యవహరించారు. "ప్రజలకు సత్యం చెప్పవలసి వచ్చింది." అని తర్వాత కృశ్చేవ్ చెప్పాడు. స్టాలిన్ తత్వ నిర్మూలన కార్యక్రమంలో రెండవ ఘట్టం 1956 వేసవిలో మిన్నంటింది. కమ్యూనిస్టు పార్టీలలో తీవ్ర చర్చ జరిగింది. ఈ ఉద్యమం అదుపు తప్పి పోతుందని తోచిన క్షణం దానిని ఆపి పట్టవలసిందని తాఖీదులు వెళ్లాయి. 1956 జూన్ 30 న పార్టీ కేంద్ర కార్యవర్గం చేసిన తీర్మానం, ప్రవ్దా పత్రిక సంపాదకీయాలు దీనిని విశద పరుస్తున్నాయి. ఈ పరిస్థితులలో మేధావుల భావ ప్రకటనకు అవకాశం చాలా తగ్గిపోయింది. వ్లాడిమీర్ బుడిన్ట్సేవ్ Not by bread alone అన్న నవల కూడా నిజంగా స్టాలిన్‌కి వ్యతిరేకంగా వ్రాయబడనేలేదు. కొన్ని సంఘ లక్షణాలను గురించి, ఒక రకమైన నాయకుణ్ణి గురించి, విమర్శించడం మాత్రమే జరిగింది. అంతవరకు తొలగవనుకున్న ఆంక్షలు ఒక్కసారిగా తొలగింపబడేటప్పటికి, ఏది సమ్మతం అనేదానికి వ్యత్యాసం తెలియకుండా పోయింది. ఆ కారణంగా కొంతమంది ధైర్య మనస్కులు హద్దులు దాటారు. కాని, అవతలనుంచి శతఘ్నుల కాల్పుల ప్రమాదం తెలిసేటప్పటికి

వెనక్కి జారిపోయారు. మొలటోవ్, కాగ్నోవిచ్‌లతో కూడిన పాత నాయకత్వం, స్టాలిన్ తత్వ నిర్మూలన మరీ అతిగా చేయడం మంచిదికాదని హెచ్చరిక చేశారు. స్టాలిన్ చేసిన కొన్ని పనులు విమర్శించడానికి వారు ఒప్పుకున్నారు. కాని స్టాలిన్‌ని పూర్తిగా ఖండించడానికి అంగీకరించలేదు. కొత్తగా వచ్చిన నాయకుల పద్ధతులలో విశ్వాసం లేకపోవడం మూలాన పూర్వ నాయకత్వంలో వారికి వ్యక్తిగతంగా చాలా బాధ్యతలు ఉండడమే వీరి అయిష్టతకు కారణం. ఈ స్టాలిన్ తత్వ సంహార కాండ ఎక్కడికి దారి తీస్తుందనేది వారి ప్రశ్న. ఇది పరస్పరనిందలకు, రాజకీయ వడపోతలకు కారణమౌతుందని వారి భయం. మికొయాన్, కృశ్చేవ్ కూడా స్టాలిన్ ఆధిపత్యంలో పొలిట్ బ్యూరో సభ్యులుగా ఉన్నారు. అయినా వీరు స్టాలిన్ తత్వ నిర్మూలనకు అందరికన్నా ఎక్కువ తీవ్రంగా తలపెట్టారు. స్టాలిన్ తత్వానికి భిన్నమైన విధానాన్ని సాగించడానికి కావలసిన స్వేచ్ఛను సంపాదించాలంటే ఇది అవసరమని వారు భావించారు. గత విధానాన్ని స్పష్టంగా వదులుకుంటేనే మార్పులు తీసుకరావడం సాధ్యం.

కృశ్చేవ్ వర్గీయులకన్నా కూడా స్టాలిన్ వ్యతిరేకులైనవారిని పార్టీ నాయకత్వంనుంచి తొలగించిన తర్వాత 1961 అక్టోబరులో 22 వ కాంగ్రెసు సమావేశమైనప్పుడు, మరొక ప్రకరణానికి రంగం సిద్ధం చేయబడింది. ఈ పర్యాయం స్టాలిన్ చేసిన ఘోర కృత్యాలను గురించి బహిరంగ ఉపన్యాసాలు చేయబడినాయి. ఈ సమావేశంలో మిఖేయిల్ సుస్లోవ్ ప్రాథమికోపన్యాసం మొదలుకొని, లెనిన్ తనకు కలలో కనపడి, స్టాలిన్‌ను గురించి చెప్పినదంతా మేడం లజూర్కినా నివేదించడం వరకు జరిగింది. ఈ సమావేశం అయిదేళ్లకు పూర్వం జరిగిన దాని మోస్తరే, కమ్యూనిస్టు వర్గాలలో తీవ్ర వాదోప వాదాలను రెచ్చగొట్టింది. ఒక సమయంలో ఇది మరీ రెచ్చిపోతుందేమో అనుకున్నారు. 1956 వేసవిలో మోస్తరే ఇప్పుడు కూడా కాస్త లాగి పట్టవలసి వచ్చింది. అయితే 1956 కు కాస్త భిన్నంగా స్టాలిన్ ప్రతికూల ప్రచారానికి స్టాలిన్ వారసులు అన్న పుస్తకాన్ని మరితర పుస్తకాలను 1962 లో ప్రకటించి, ప్రోత్సహించారు. ఇంతవరకు పశ్చిమ దేశాల వారికి తెలిసిన "పని శిబిరాల సాహిత్యం" ఇప్పుడు రష్యన్ ప్రజలకు కూడా తెలిసి వచ్చింది. ఇది స్టాలిన్ తత్వ సంహార కార్యక్రమంలో నాలగవ ఘట్టం. అనగా పైనుంచి విప్లవాన్ని తీసుకువచ్చే కార్యక్రమంలో ఇది నిర్విరామమైన అతి ప్రధానమైన భాగమా?

దీనిని గురించి ఏదైనా ఇంతముందుగా చెప్పడానికి వీలులేదు. ప్రస్తుతానికి ఈ కార్యక్రమానికివున్న పరిమితులు మనకు బాగా తెలుసు. 1935 తర్వాత స్టాలిన్ చేసిన ప్రతి చర్యను విమర్శించవచ్చు. విమర్శించి తీరాలి. 1917 లో ఆయన తప్పులు చేశాడని, 1923—24 లలో సామూదాయక వ్యవసాయ విధానాలు చాలా కఠినాత్మకమైనవని ఇప్పుడు బహిరంగంగా ఒప్పుకుంటున్నారు. అయినప్పటికి తన అనుచరులుగా వుండి, ఆయనను గుడ్డిగా అనుసరించడానికి సిద్ధపడిన స్త్రీ పురుషులకు ఆయన చేసిన దానిని గురించి ప్రత్యేకంగా తిడుతున్నారు. కాని, పార్టీలో ప్రతికూలురకు చేసిన దానికి ఆయనను ఏమీ అనడంలేదు. 1963 లో కూడా కమ్యూనిస్టు పార్టీకి ట్రాటస్కీ, జినోవివ్, కొలనోవ్, బుఖారిన్ శత్రువులుగానే పరిగణించబడుతున్నారన్నమాట. వారిని హంతకులుగాను, ప్రజా శత్రువులుగాను, జర్మన్, జపానీల గూఢచారులుగాను ఇప్పుడు వర్ణించకపోవచ్చు. కొద్ది సంవత్సరాలలో మరీ మితవాదుల కింద లెక్కగట్టబడ్డవారు కొంతవరకు ప్రతిష్టను పుంజుకొనేటట్టు చేయవచ్చు. వారు తప్పు చేశారంటే స్టాలిన్ మాత్రం చేయలేదా? 1920 ప్రతికూల అతివాద బృందం వల్లనే కృశ్చేవ్‌కు కష్టాలు దాపురిస్తాయి. వాటిని తొలగించటానికి దోవ కనిపించడంలేదు. ఇవన్నీ వ్యూహ వ్యవహారానికి సంబంధించిన సమస్యలు. అసలు మూల విషయాలు వేరే ఉన్నాయి. వాటిని ఇంకా ఎదుర్కొనలేదు.

ప్రస్తుతంఉన్న, చెల్లుబాటు అవుతున్న ప్రచారాన్నిబట్టి, లెనినిజంలో స్టాలినిజం అనేది స్వాభావికంగాలేదని, దానికి స్వాభావికమైన, అసలైన వారసురాలు కాదని, అదొక పైత్యపు తెర అని అంటున్నారు. సోవియట్ సంఘ స్వరూపం సరిగానే నిలిచివుంది. ఆర్థిక పునరుర్నిర్మాణం సాగుతూనే ఉన్నది. అతి క్లిష్ట కాలంలో కూడా విదేశ విధానం అభివృద్ధి మార్గాన్ని అనుసరించింది. ఫ్రెంచి విప్లవం ప్రసాదించిన వాటిని నెపోలియన్ విస్తరింపజేసినట్లు స్టాలిన్ కూడా చేశాడని, స్టాలిన్‌ను నెపోలియన్‌తో కొందరు పోల్చారు. ఇది తప్పు అని నా అభిప్రాయం. ఇది చాలా అసమంజసమైన పోలిక. రష్యామీద నెపోలియన్ చేసిన దండయాత్రను అభివృద్ధికరమైన సంఘటనగా సోవియట్ చరిత్రకారులు అంగీకరిస్తారా? నెపోలియన్ దండయాత్రలు యూరపులో అభ్యుదయ ప్రతికూల శక్తులను, జాతీయ దురభిమానాన్ని పెంచాయి. కమ్యూనిజానికి స్టాలిన్ తిరిగి సరు కోలేనంత హానిని కలగజేయలేదా? నిజమైన సమస్యలు అంత తేలిగ్గా పరిష్కారంకావు. అలాంటివి మరల జరగవని అనేవారు మానవులలోవుండే మంచితనంమీద ఆధారపడు

తున్నారేమో! కాని, ఇలా ఆధారపడడం మార్క్సు సిద్ధాంతానికి వ్యతిరేకంకదా? కాకపోతే రష్యా అవసరస్థితి నుంచి స్వేచ్ఛా స్థితికి గంతువేసిందని, అందువల్ల చారిత్రక భౌతికవాద సూత్రాలు పని చేయడం ఆగిపోయిందని ఒప్పుకుంటే తప్ప, వీలు లేదు. స్టాలిన్ తప్పనిసరి అయిన పీడగా వచ్చాడని, సోవియట్ సంఘం ఇప్పుడు ఉన్నత స్థితికి చేరిందని, అందుకని ఒక స్టాలిన్ అవతరణ అవసరం లేదని అంటే, అది మార్క్సు సిద్ధాంతానికి సరిగా ఉంటుంది. అలాంటి సమాధానం "విధి సిద్ధాంతాన్ని" నమ్మేవారు కూడా అంగీకరిస్తారనేది సందేహం. ఆర్థిక అభివృద్ధి బాగా వున్నందున నిరంకుశత్వం పుట్టిందనడానికి వీలులేదు. అవసరం అనేది లేకుండానే నియంతలు తయారవడం దురదృష్టవశాత్తు తరచు జరుగుతూవుంది.

తిరిగి 1920 కి వెళ్లాలనేది నేడు రష్యా ప్రభుత్వం పార్టీ ధోరణిగా ఉన్నది. 1930, 1940 కంటే 1920 ఉత్తమమని వారి అభిప్రాయం. అయితే అసలు స్టాలిన్ తత్వం పెరగడానికి తోడ్పడింది ఈ దశాబ్దం. స్టాలిన్ తత్వం అనేది పాలితుని పైత్యపు తెర అయితే, ఆయనకు వచ్చినప్పుడే ప్రజలకు కూడా అది వచ్చి ఉంటేనే కదా ఇది సాధ్యం. కలిగులను గురించి లుడ్విగ్ ఫిడ్లే ఇలా అన్నారు: "సీజరుకు వచ్చినటువంటి పిచ్చి, రాజుల హయాంలో పై తరగతి వర్గాలలోను, ప్రజలలోను ఏర్పడిన నైతిక పతన పరిస్థితి కారణంగా పుట్టినది" ఇప్పుడు రాజు హయాం అనే మాట తీసివేస్తే ఆధునిక నియంతృత్వానికి కూడా ఇది సరిగా వర్తిస్తుంది. సోవియట్ సంఘం మూలమట్టంగా మారిందా? కొత్త నియంత రాకుండా ఉండడానికి అడ్డంకులు నిబంధనలు అమలులో ఉన్నాయా? గత దశాబ్దంలో సోవియట్ యూనియన్‌లో పెద్ద మార్పులు వచ్చినా, పై ప్రశ్నలకు "లేదు" అన్నదే సమాధానంగావుంది. రాజకీయాధికారం ఇప్పటికీ, ఇంకా కొద్ది మంది చేతులలోనే వుంది. మిగతావారికి రాజకీయ నిర్ణయాలను రూపొందించడానికి, మార్చడానికి మార్గమేదిలేదు. రాబర్ట్ రొజ్డెస్ట్వెన్‌స్కీ ఈమధ్య వ్రాసిన పద్యంలో ఇలా చెప్పారు:—

We say no longer
That somebody thinks for us
Beacuse we know·now how this ends;

స్వతంత్ర యోచన, స్వతంత్ర చర్యకు భవిష్యత్తులో దారి తీయవచ్చు. కాని, ప్రస్తుతానికి స్వతంత్ర యోచనాపరుడు తన పాలకుల సదుద్దేశ్యాలను విశ్వసించాలి. 1920 లో జరిగినట్లే అనేక విధములైన పరిణామాలు రావచ్చు. నిరంకుశత్వం ఎక్కువ కావచ్చు. స్వేచ్ఛ, ప్రజాపాలన ఎక్కువ కావచ్చు. నాబోటి ఆశావాదులు, స్టాలిన్ అనుభవం ఉన్నవాళ్లు భవిష్యత్తులో మంచి జరగగలదని ఆశిస్తారు. నియంతృత్వ రాజ్యం దానికదే కొంతకాలానికి రాలిపోతుందని, లేకపోతే ఏదో ఒక విధంగా మామూలుకు మారుతుందనే సూత్రం వీరి ఆశకు ఆధారం. ఇలా జరుగుతుందని ఇంతవరకు ఋజువు కాలేదు. కాని, ఇది చాలా ప్రియమైన భావన. కెమల్ పాషా యొక్క టర్కీ దీనికి సరైన ఉదాహరణ కాగలదా? కొన్ని సంవత్సరాల తర్వాత రష్యాలో ప్రజాభిప్రాయమనేది తయారు కావచ్చు. ప్రభుత్వ పక్షంలో కాకుండా బయట ప్రతికూల పక్షం బయలు దేరడమనేది అసాధ్యం. కాని, పార్టీలోనే చీలికలు బయలుదేరి, అలా చీలిన వర్గాలు పార్టీలు అవవచ్చు. వాని పుట్టుక స్వాభావికమైన పరిణామంగా గుర్తింపబడవచ్చు. అంతేగాని, దీనిని పార్టీ ద్రోహంగా ఎంచకపోవచ్చు. బహు పక్షాల కూడిక కాకుండా, బహువర్గాలు కూడి ఉండవచ్చు. కమ్యూనిస్టు దేశాలలో బహుళత్వం ఉన్నప్పుడు, కమ్యూనిస్టుపార్టీలో మాత్రం బహుళత్వం ఎందుకు ఉండకూడదు? అయితే ఇలాంటిది పరస్పర సహనభావం మూలానే సంభవం. కాని, ప్రస్తుతం అలాంటి భావనలేదు.

ఇవన్నీ 1960—అదృష్టంఉంటే 1970, 1980 ల సోవియట్ యూనియన్ రాజకీయ సమస్యలు, వాటి ఫలితాలు ఎలా ఉన్నా, స్టాలిన్‌ను గురించి మనం అనుకొనేది పెద్దగా మార్పు.

ఇంతకూ స్టాలిన్ సాధించింది ఏమిటి? 1930 లో ఉత్పత్తి ప్రమాణం నూటికి 12—14 వంతులు పెరిగింది. ఆర్థిక పాటవం దృష్ట్యా చూస్తే స్టాలిన్ విజయుడని అనవచ్చు. పూర్తిగా కాకపోయినా, కొన్నిటిని సాధించాడు. ఇది ఇలా కనబడుతూ ఉంటే, అవతల చెప్పరానటువంటి బాధ, వ్యథ కోట్ల మందికి (సాముదాయక వ్యవసాయ విధానాలు అమలు జరిపినప్పుడు, రాజకీయ వడపోతలు సాగించినప్పుడు యుద్ధం తొలి భాగంలో) కలిగింది. రాజకీయంగాను, సాంస్కృతికంగాను ఆకాలం కేవలం మరపుకురాని బంజరు భూమి. నేను మధ్య ఆసియా కవులు వ్రాసిన పద్యాలను చదివాను. వారు స్టాలిన్‌ను కొండగద్దగా వర్ణించారు. భవిష్యత్తులో చరిత్రకారులు కొంతమంది సింహంతోలు కప్పుకున్న గాడిదగా వర్ణించవచ్చు. ఇది ఈ రోజు హాస్యాస్పదంగా కనపడుతుందా? అతనిని గురించి సృష్టించిన కొండంత రూపం, సర్వ శక్తివంతుడైన ప్రజాపితగా వ్యాపించిన కథ, ప్రస్తుత తరంవారికి చూపుకు అందనిదిగా ఉన్నదా? నియంతృత్వ దేశంలో ఏ వ్యక్తి రూపమైనా ఎలాగైనా చిత్రించవచ్చు అనేది అతి తేలికగా మరచిపోతూ ఉంటారు.

ఒకసారి కనుక పాత భాండాంగారాలను తెరిచి చూడటం మొదలెడితే, స్టాలిన్ "ఉక్కుసట్టు" ఎంత మిగులుతుంది? ఆయన ఇనుప నరాలు, పట్టుదల ఎంతగా కనబడతాయి? ఆయన పురాణ పురుషత్వ భాండం పగిలిపోదూ? నియంతృత్వంలో పైపీఠాన్ని అధిష్టించడానికి, అసాధారణమైన, కాకపోతే—మానవాతీతమైన లక్షణాలు కావాలనే అభిప్రాయం ఇంకా వ్యాపించి ఉన్నది. కాని ముఖ్యంగా కావలసిన లక్షణాలు—అధికార వాంఛ, ఆత్మ విశ్వాసం ఏకదీక్ష. ఇవి ఏవీ అంత సాధారణమైనవికావు. చారిత్రకమైన అదృష్టం అన్నింటికంటె ముఖ్యమని అనిపిస్తుంది. స్టాలిన్ నిజంగా చాలా అదృష్టవంతుడు.

పాశ్చాత్య నాగరికతా సాంప్రదాయంలో నాజీ ఇజానికి పోటీగా కమ్యూనిజం బహుశా ఒక తిరుగుబాటు. అనాదిగా, సాంప్రదాయబద్ధంగా ఆశిస్తూన్న ఒక కల్పనా స్వర్గం అని నా అభిప్రాయం. అందుకే స్టాలిన్ అమానుష చర్యలతో అమానుష చర్యలను కూడా, కరుణా హృదయంతో చేసినవని సమర్థించవలసి వచ్చింది. స్టాలిన్ మరణానంతరం మాటలు, వాటి అర్థం అడవినుంచి పుట్టుకు రాలేదు. కాని ప్రవర్తనా ప్రమాణాలు కచ్చితంగా మారినవి. రష్యా తిరిగి తన సహజమైన పాశ్చాత్య సంస్కృతిని గురించి ఆలోచించడం ఆరంభించింది. ఇతరులకూ, తమకూవున్న రాజకీయ సాంఘిక వివాదాలను లెక్క చేయకుండా తమ దేశం యూరపు సంస్కృతీ ఖండభాగం అని చెప్పడానికి గట్టిగా కృషి చేస్తున్నారు. రష్యా ఇన్నాళ్లూ నిజంగా ఆసియాకు చెందినదని అనడంకన్న ఎక్కువ అవమానం వుందా? ఇది చాలా ఉత్సాహపరచే పరిణామం. తన దేశాన్ని పాశ్చాత్య సంప్రదాయాన్నుంచి విడదీయ ప్రయత్నించిన పాలకునిగా స్టాలిన్‌ను జ్ఞాపకం ఉంచుకుంటారు. అలా అయితేనే అతని పేరు శాశ్వతంగా కొంతకాకపోతే, కొంతవరకైనా నిలుస్తుంది. గతాన్ని దేవుడు కూడా మార్చలేడు. కాని భవిష్యత్తును మానవులు దిద్దగలరు.

(ఎన్ కౌంటర్ సౌజన్యంతో)

---

## రచయితలకు మనవి

సాహిత్యానికి సంబంధించిన వ్యాసాలనే కాక, రాజకీయ ఆర్థిక సాంఘిక సమస్యలను సమదృక్పథంతో చర్చించే సమగ్ర వ్యాసాలను కూడా ఆహ్వానిస్తున్నాము. [భా. సం.]

# విబంధ విధానము: శ్రీ నెహ్రూ



**'పరిశీలక్'**

*(గత సంచిక తరువాయి)*

ఒకదేశపు వైదేశికనీతి, ఆదేశపు భౌగోళిక పరిస్థితులు, చారిత్రక రాజకీయ పరిణామాలనుబట్టి రూపొందుతూ ఉంటుంది. అలా రూపొందిన విధానాల జయాపజయాలనేవి, ఆ విధానాలను అమలు జరిపే ప్రభుత్వ నాయకుల భావ ధోరణిని బట్టి, వారు అనుసరించే పద్ధతులనుబట్టి నిర్ణయమౌతాయి. అందువల్లనే వైదేశిక నీతి ప్రాతిపదికలకంటె, నాయకుల భావధోరణికి వారు అనుసరించే పద్ధతులకు ప్రాధాన్యం వస్తుంది. అవి పరిశీలనాంశాలు, విమర్శనీయాంశాలు అవుతాయి.

జాతీయోద్యమం రోజులనుంచి కలోనియలిజం, ఇంపీరియలిజం అంటే భారతీయులలో విరుద్ధమైన భావాలు వ్యాపించాయి. ఈ "ఇజా"లను ఖండించడంలో జాతీయవాదులకు, కమ్యూనిస్టు భావధోరణి కలవారికి ఎక్కడా వ్యత్యాసంలేదు. ఈ "ఇజాల" పుట్టుకకు కారణమైన కేపిటలిజాన్ని, దాని మూలశక్తి అయిన ధనిక, భూస్వామిక వర్గాలను ద్వేషించడంలో కూడా జాతీయవాదులు, కమ్యూనిస్టులు సమాన ఉజ్జీలుగా ఉంటారు. జాతీయోద్యమ ప్రభావాలు ఈ స్థితిని తెచ్చిపెడతాయి. జాతీయ స్వాతంత్ర్యం, సాంఘిక న్యాయం, రాజకీయ స్వేచ్ఛ అనే మూల భావాలు, కమ్యూనిజానికి విరుద్ధమైనవనే గుర్తింపు అప్పుడు కలగనివ్వదు. కాని, జాతీయోద్యమం ఫలించి, దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత కూడ ఈ గుర్తింపు కలగక పోవడంలోనే ముప్పు ఉంది. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత రాజకీయంగా జాతీయ సంస్థలో అతివాద, మితవాద వర్గాల చీలిక స్పష్టంగా వచ్చి, ఆ ప్రాతిపదికమీద రాజకీయ శక్తులు పార్టీల రూపంలో బలపడివుంటే, ఈ ముప్పు తప్పేది. అది రాజకీయమైన ఆరోగ్య లక్షణంగా ఉండేది. కాంగ్రెసు సంస్థలో ఇలాంటి చీలికలు వచ్చినా, అవి పలుకుబడి కలిగిన రాజకీయ పక్షాలుగా రూపొందనివ్వని కీర్తి పండిట్ నెహ్రూకు దక్కింది. అతివాద, మితవాద శక్తులకు నిలయంగా, "రాజకీయ అర్ధనారీశ్వరుడు"గా శ్రీ నెహ్రూ భారత ప్రజలముందు నిలిచారు. ఆయనలోని ఈ అర్ధనారీశ్వర భావధోరణి జాతీయంగా "మిశ్రమ ఆర్థిక విధానానికి" (సోషలిస్టు పద్ధతి సమాజ స్థాపన నినాదానికి) అంతర్జాతీయంగా "విబంధ విధానానికి" దారి తీసింది. గత పదిహేను సంవత్సరాలుగా కాంగ్రెసు ప్రభుత్వాల పరంగా ఈ విధానాలు అమలు జరుగుతున్నాయి.

ఈ విధానాలు వాంఛనీయమైనవా, భారత స్వప్రయోజనాలను ఇవి కాపాడగలవా అన్నది ఆదినుంచి చర్చనీయాంశంగా ఉంది. పలు రకాలుగా విమర్శలు జరుగుతూ వచ్చాయి. కమ్యూనిస్టు చైనా దురాక్రమణ జరిగే నాటివరకు విమర్శలకంటె, ప్రశంసలకే మన్నన ఉంటూ వచ్చింది. శ్రీ నెహ్రూ అనుసరిస్తున్న విధానాలవల్ల, భారతదేశం స్వప్రయోజనాలకు వినియోగపడినట్టుగా కనిపించిన రెండు ఫలితాలు ఇందుకు కారణమైనాయి. అందులో ఒకటి ఆర్థికమైనది. రెండవది పండిట్ నెహ్రూ ప్రపంచ ప్రముఖ నాయకుడుగా ప్రచారం కావడానికి సంబంధించినది.

ఆర్థికంగా భారత పంచవర్ష ప్రణాళికలకు అవసరమైన సహాయాన్ని అటు పాశ్చాత్య రాజ్యాలు, ఇటు కమ్యూనిస్టు రాజ్యాలు కూడా ఈ పదిహేను సంవత్సరాలలోను చేస్తూ వచ్చాయి. భారతదేశం అనుసరించిన విబంధ విధానమే ఇందుకు కారణమని సగర్వంగా చెప్పుకొనడం జరిగింది. కాని, అంతర్జాతీయంగా చూస్తే ఆర్థిక సహాయాలకు, వైదేశిక నీతికి ఎక్కడా సంబంధం ఉన్నట్టు కనుపించదు. యుద్ధకాలంలో రష్యాకు పాశ్చాత్య రాజ్యాలు చేసిన సహాయం, యుగోస్లావియాకు, పోలెండుకు, అమెరికా చేసిన ఆర్థిక సహాయం, లెనిన్ నాయకత్వం స్థిరపడిన తర్వాత కమ్యూనిస్టు రష్యాకు అమెరికా, బ్రిటన్‌లు చేసిన ఆర్థిక సహాయం వగైరాలను బట్టి ఈ సంగతి చెప్పుకోవచ్చు. చివరకు ఫాసిస్టు ఇటలీకి, నాజీ జర్మనీకి కూడా పర రాజ్యాలు ఆర్థికంగా సహాయపడిన ఘట్టాలు ఉన్నాయి. కనుక వైదేశిక నీతికి— ఆర్థిక సహాయానికి సన్నిహితమైన సంబంధం ఉందని భావించడం పొరపాటు

కాగలదు. ఒకవేళ ఇలాంటి సంబంధం ఉన్నట్టు కనిపించినా, అది వైదేశిక నీతి ఆచరణను మార్పు చేయించడానికి, దౌత్య సంబంధమైన వ్యూహానికి చెందినదే కాగలదని భావించవలసి ఉంటుంది:

ఇక ప్రధాని నెహ్రూ ప్రపంచ నాయకుడుగా ప్రసిద్ధి చెందడానికి సంబంధించిన ప్రచారానికి, భారత విదేశాంగ విధానానికి కూడా ఎలాంటి సంబంధం లేదనే చెప్పుకోవలసి ఉంటుంది. పండిట్ నెహ్రూకాక, మరెవ్వరు అధికారంలో ఉన్నా, భారత వైదేశిక నీతి ప్రాతిపదికలలో మాత్రము మార్పు ఉండేదికాదు. అందుకు ఆ దేశ చరిత్ర, భౌగోళికంగా దాని ఉనికి, దాని జాతీయోద్యమ చరిత్ర ప్రధాన కారణం. వీటన్నింటి సమష్టి స్వరూపంగా భారతమూర్తి అనేది రూపొందింది. ఆ మూర్తికి ప్రత్యక్షమైన ప్రతిబింబంగా పండిట్ నెహ్రూ తెరమీద నిలచారు. అది ఆయన అదృష్టం. అయితే అదే ఒక రకంగా భారత దేశానికి దురదృష్టంగ తయారైంది. శ్రీ నెహ్రూ అంటే భారతదేశం, భారతదేశం అంటే శ్రీ నెహ్రూ అన్నట్టుగ పదిహేనేళ్ల చరిత్ర నడిచింది. దీనినుంచి "మహా పురుషుడు"—మహత్తర నాయకుడు అనే ప్రజాస్వామ్య విరుద్ధమైన భావాలు వ్యాపించి, వ్యక్తి ఆరాధనను దేశంలో పెంచాయి. నిజానికి శ్రీ నెహ్రూ గొప్పవాడు కావచ్చు. కాని, గాంధీజీ ఆయనను ఆశీర్వదించి, జాతీయనాయకుడుగా పోషిస్తూ, పెంచుకుంటూ రాకపోతే, శ్రీ నెహ్రూ తనకు తానై భారత ప్రథమ ప్రధాని అయ్యేవారుకాదు. శ్రీ పటేల్ డాక్టర్ రాజేంద్రప్రసాద్ ప్రభృతులు గాంధీజీ కోర్కెను మన్నించి, శ్రీ నెహ్రూ నాయకత్వాన్ని మన్నించకపోతే ఇలా సాగేదా? అధికారం లేని కాలంలో కూడా వారు కొన్ని ఉద్యమాలు నిర్వహించారు. కొన్ని సమస్యలు పరిష్కరించారు. కాంగ్రెసు సంస్థను పటిష్టంగా నిర్మాణం చేశారు. ఆ దృష్ట్యా చూస్తే పండిట్ నెహ్రూ సాధించినది తక్కువవే ఇప్పటికీ అనిపిస్తుంది. ఆయన ప్రతిభ, ప్రతిష్ఠ ప్రధాని పదవితో కలిసి ఉన్నాయి. ప్రధాన పదవిని మినహాయించి, పరిశీలిస్తే ఏమనిపిస్తుంది?

దేశాల చరిత్రకు, ప్రముఖ వ్యక్తుల నాయకత్వాలకు ఎంతటి అవినాభావ సంబంధం ఉండేది తెలుసుకొనడానికి కొన్ని ఉదాహరణలు ఇక్కడ చెప్పుకొనడం అవసరం. అమెరికా అధ్యక్షులలో ట్రూమన్‌కంటె రూజ్వెల్టు గొప్పవాడే. కాని, కార్యదక్షతలో రూజ్వెల్టుకంటె మిన్న ట్రూమన్. బ్రిటిష్ ప్రధాన మంత్రులలో అట్లీ చరిత్ర చర్చిల్ చరిత్రకు సరిపోదు. కాని చరిత్రాత్మకమైన పాత్రను నిర్వహించినవారెవ్వరని పరిశీలిస్తే ఆఖ్యాతి అట్లీకి దక్కుతుంది. ఇందుకు కారణ వారి కాలం, అప్పటి చరిత్ర, ఆనాటి ప్రభావాలు. ఇలాగే భారత దేశాన్ని గురించి, దాని నాయకులను గురించి అంచనా వేసి చెప్పుకొనడానికి తగినంత చరిత్ర ఇంకా గడవలేదు. కాలం సాగలేదు. అందువల్లనే ప్రధాని నెహ్రూతో పోల్చి తీర్పు చెప్పుకొనదగ్గ అవకాశం లభించడంలేదు. ఈ పరిస్థితి కూడా ఒక అవకాశంగా పండిట్ నెహ్రూకు సహాయపడింది. అందువల్లనే పండిట్ నెహ్రూకు వారసు లెవ్వరనే ప్రశ్న వినబడుతున్నది. ప్రజాస్వామిక వ్యవస్థలో ఇలాంటి ప్రశ్న ఉదయించడమన్నదే అప్రజాస్వామికం. అందుకే అలాంటి ప్రశ్న ఉదయించే అవకాశ మిచ్చిన పండిట్ నెహ్రూ నాయకత్వం, ఆయన ద్వారా సాగిన జాతీయరథ సారథ్యం విమర్శనీయం.

దేశంలో సంగతి ఇలా ఉంటే అంతర్జాతీయంగా మరొక రకమైన విచిత్ర వాతావరణం పండిట్ నెహ్రూను ఆవరించింది. అది ఆయన ప్రాక్పశ్చిమ దేశాలమధ్య "సారథి" అనే ప్రచారానికి సంబంధించినది. ప్రపంచ రాజధానులకు ఆయన సాగించిన యాత్రలు, అక్కడి నాయకులతో ఆయన కొనసాగిస్తూ వచ్చిన చర్చలు ఈ వాతావరణాన్ని సృష్టించాయి. నిజంగా పండిట్ నెహ్రూవల్ల అమెరికా—రష్యాలు సన్నిహితమైనట్టు, ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణం తొలగినట్టు, ప్రపంచానికి అణ్వస్త్రయుద్ధ ప్రమాదం పోయినట్టు, రెండు అగ్రరాజ్య కూటాలు మిత్రులైనట్టు ప్రచారం సాగింది. కాని, ఇక్కడొకటి రెండు సంగతులు పరిశీలిస్తే, దీని నిజా నిజాలు బోధపడగలవు. నిజానికి పండిట్ నెహ్రూవల్ల అమెరికా - రష్యాలు సన్నిహితం కాగలిగితే, ఐసెన్‌హోవర్—కృశ్చేవ్‌ల సమావేశం' అంత దారుణంగా ఎందుకు విఫలమైంది? పండిట్ నెహ్రూ కృషివల్ల అణ్వస్త్ర యుద్ధ ప్రమాదమే ప్రపంచానికి తప్పిపోతే, సోవియట్ రష్యా తిరిగి హఠాత్తుగా అణ్వస్త్ర పాటవ పరీక్షలను ఎందుకు ఆరంభించింది? కనుక ప్రపంచ రాజకీయ పరిణామాలకు ఆ యా సమయాలనుబట్టి అంతర్గతమైన కారణాలు కొన్ని ఉంటాయి. ఉదాహరణకు: అమెరికాలో రిపబ్లికన్ పార్టీస్థానే డెమొక్రాటిక్ పార్టీ అధికారానికి రావడం. రష్యాలో స్టాలినిజానికి వ్యతిరేకంగా కృశ్చేవ్ కొన్ని రావడం. రష్యాలో స్టాలిన్‌జానికి వ్యతిరేకంగా కృశ్చేవ్ కొన్ని చర్యలు తీసుకొనడం వగైరాలు. ఈ సందర్భంలో మరొక సంగతి కూడా చెప్పుకోవచ్చు. అమెరికాలో కెనడీ ప్రభుత్వం కాక, నిక్సన్ నాయకత్వాన రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పడివుంటే ప్రపంచ రాజకీయాలు నేటి పరిణామ దశలో ఉండేవా? ఇలాంటి పరిణామాలను గ్రహించగల శక్తి, అందుకు సంబంధించిన అవకాశాలు పండిట్ నెహ్రూకు లభించాయి. జాతీయ

# విబంధ విధానము: శ్రీ నెహ్రూ

వ్యక్తిగా ఉన్నప్పటికంటె, భారత ప్రధానిగా ఉన్నప్పుడు ఈ అవకాశాలు ఇంకా పెరిగాయి. వానిని వినియోగించుకున్న పండిట్ నెహ్రూ "ఉభయ మిత్రుడు"గా కీలక సమయాలలో ప్రపంచ యాత్రలు సాగించేవారు. ఉభయ వర్గాలమధ్య "వార్తాహరుడు"గా ఉండేవారు. రాజీ పద్ధతులు సూచించే "సారథి"గా ప్రచారంలో ప్రసిద్ధికెక్కారేకాని, ఉభయకూటాల మధ్య "వారధి" కాలేకపోయారు. అందుకు తప్పు ఆయనదికాదు. ప్రపంచ రాజకీయాల తీరును గ్రహించక, ఆయన అంతర్జాతీయ శాంతి దూత అని దేశంలో ప్రచారం చేస్తున్న వారిది.

పండిట్ నెహ్రూ నాయకత్వం చుట్టూ జాతీయంగాను, అంతర్జాతీయంగాను అల్లుకున్న కీర్తి ప్రతిష్ఠలు తద్వారా భారత దేశంలో పెరిగిన అహంభావ పూరితమైన రాజకీయ వాతావరణం చెల్లా చెదురు కావడానికి ఆట్టేకాలం పట్టలేదు. రెండు సంఘటనలతో హఠాత్తుగా ఈ వాతావరణం మారిపోయింది. ఒకటి: గోవాపై సైనిక చర్య. రెండు: భారత ఉత్తర సరిహద్దులలో అయిదేళ్ళుగా కమ్యూనిస్టు చైనా దురాక్రమణ సాగించి ఉండడం. జాతీయ దృష్ట్యా గోవాపై సైనిక చర్య వీరోచిత చర్య కావచ్చు. కాని, శాంతియుతంగా దీని పరిష్కారానికి 14 సంవత్సరాలు ఎందుకు వేచి ఉండవలసి వచ్చింది? జనరల్ ఎన్నికలకు ముందుగా ఈ చర్యకు ఎందుకు పూనుకోవలసి వచ్చింది? అంతేకాదు. అదే సమయానికి కమ్యూనిస్టు చైనా ఉత్తర సరిహద్దులలో చొచ్చుకొని రావడాన్ని ఎందుకు సహించవలసి వచ్చింది? ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానం ఇంతవరకు వినిపించడంలేదు. కాని, భారతదేశం మాత్రం అసంతృప్తికరమైన విమర్శలకు గురి కావలసి వచ్చింది. "శాంతి దూత"గా నటించే భారత దేశం చేయవలసిన పని ఇదేనా అన్న ప్రశ్న వినవచ్చింది. అంతర్జాతీయ శాంతి సాధనకు భారతదేశం ఘనంగా చేసే సూచనలను స్వవిషయంలో ఎందుకు ఆచరించదన్న ఎదురు ప్రశ్న వచ్చింది. కమ్యూనిస్టులు మినహా పశ్చిమ రాజ్యాల వారందరూ గోవాపై సైనిక చర్యను నిరసించారు. భారతదేశం తన "నైతిక స్థాయి"ని కోల్పోయింది. ప్రచ్ఛన్న కమ్యూనిస్టుగానేకాదు, ప్రత్యక్ష కమ్యూనిస్టుగా వ్యవహరించిందనే ముద్రను వేయించుకున్నది.

ఉత్తర సరిహద్దుల్లో కమ్యూనిస్టు చైనా దురాక్రమణ గాథ కూడా ఈ వాదనను బలపరిచింది. ఇందులో కమ్యూనిస్టు చైనా దురాక్రమణ సాగించడమనేదానికంటె అయిదేళ్ళుగా ఆ సంగతులు భారత ప్రజలకు, పార్లమెంటుకు చెప్పకుండా దాచి ఉంచడమనేది మరింత దారుణంగా కానవచ్చింది.

పండిట్ నెహ్రూ ఎందుకు ఇలా వ్యవహరించారనే ప్రశ్నలు వినవచ్చాయి. ఒక్కమాటలో చెప్పుకోవాలంటే పండిట్ నెహ్రూ "కల్పించుకున్న స్వయంకృతమైన కల్పిత 'వాతావరణం" తొలగి పోయింది: ఆశించిన విధంగా సోవియట్ రష్యా కమ్యూనిస్టు చైనాను గదమాయించలేక పోయింది. కోరుకున్న విధంగా ఆపత్సమయంలో అవసరమైన ఆయుధ సహాయాన్ని సోవియట్ రష్యా పంపించలేదు. అడిగినదే తడవుగా ఆయుధాలు సప్లయి చేసినవి పాశ్చాత్య రాజ్యాలు. దీనితో "నవీన ప్రపంచంలోని యథార్థ పరిస్థితులకు" తమను పండిట్ నెహ్రూ ప్రభుత్వం "ఎంత దూరంగా ఉంచిందో" భారత ప్రజలకు తెలిసి వచ్చింది. ఆచరణలో "విబంధ విధానం" నిజ స్వరూపం స్వానుభవ పూర్వకంగా ప్రత్యక్షమైంది. పండిట్ నెహ్రూ నాయకత్వానికి తుది పరీక్ష వచ్చింది.

ఈ పరీక్ష కూడా రెండు రకాలుగావుంది. ఒకటి. దేశంలో ప్రజల పరీక్ష. రెండు: అంతర్జాతీయంగా ప్రజాస్వామిక శక్తుల పరీక్ష. పండిట్ నెహ్రూ నాయకత్వాన్ని గురించి, ఆయన విధానాలను గురించి భారత ప్రజలలో ఇంతటి పరీక్ష (పరిశీలన) ఇదివర కెన్నడూ రాలేదు. ఆయన తప్పు చేశాడన్న నమ్మకం చాలామందికి కలిగింది. కమ్యూనిస్టు చైనాతో స్నేహ సాధనకు ప్రయత్నించడాన్ని కాక, సరిహద్దులలో సైనికంగా అవసరమైన కట్టుదిట్టాలు చేయక పోవడాన్ని, కమ్యూనిస్టు చైనా—రష్యాలను అతిగా విశ్వసించి వ్యవహరించడాన్ని, విశితంగా విమర్శించారు. ఆయనలో **Political Judgment** ఇంత తక్కువగా ఉన్నదా అని ఆశ్చర్యపోయారు. ఇదంతా శ్రీ నెహ్రూ వ్యతిరేకతగా, ఆయనమీద విమర్శగా కొందరు భావించారు. కాని చారిత్రకంగా పరిశీలిస్తే, ప్రజాస్వామిక వ్యవస్థ ప్రవర్ధమానం కావడానికి ఇలాంటి విమర్శనా శక్తి ప్రజలకు అవసరమని అంగీకరించక తప్పదు. ఆ దృష్టితో ఈ విమర్శలను సహించడమేకాక, సమర్థించడం కూడా తప్పు కాబోదు. ఈ దృష్టితోనే మరొక అడుగు ముందుకువేసి ఆలోచిస్తే—హిట్లర్‌ను సంతృప్తిపరచే విధానాలను అనుసరించిన ఛాంబర్లేన్‌ను రాజీనామా చేయించింది బ్రిటిష్ ప్రజాశక్తి. సూయజ్ కాల్వ దండయాత్రకు కారకుడైన బ్రిటిష్ ప్రధాని ఈడెన్‌ను రాజీనామా చేయించింది బ్రిటిష్ ప్రజావాణి. ఇంకా చెప్పాలంటే కమ్యూనిస్టు శక్తులను సంతృప్తిపరచే విధానాలను అనుసరించిన రూజ్వెల్టు పార్టీని—డెమొక్రాటిక్ పార్టీని— కాదని కమ్యూనిజాన్ని గట్టిగా నిరోధించగల రిపబ్లికన్ పార్టీని ఎన్నుకున్నారు అమెరికా ప్రజలు. కనక దేశం, దాని భవిష్యత్తు, భద్రతకు సంబంధిం

చిన సమస్యలలో నాయకుల గొప్పతనాన్ని, పార్టీ ప్రతిష్ఠలను సహించిన ఘట్టాలు ప్రజాస్వామిక దేశాల చరిత్రలలో ఎక్కడాలేవు. అలాంటి ఘట్టాలువున్న సందర్భాలలో ఆవిర్భవించింది నియంతృత్వం. ఇది చరిత్ర చెబుతున్న సత్యం. కాలం నేర్పుతున్న పాఠం.

ప్రజాస్వామిక భావాలను జీర్ణింపచేసుకున్నవి కనుకనే ప్రజాస్వామిక దేశాలు (పాశ్చాత్య రాజ్యాలు) కూడా భారత దేశ నిజ స్థితిని గుర్తించాయి. భారత ప్రజల ప్రజాస్వామిక భావాలను గమనించాయి. తమ మధ్యగల భావ సమైక్యతను పరిగణించాయి. ఆవిధంగా ఏర్పడిన మానసికమైన అనుబంధంతో సహాయపడడానికి ముందుకు వచ్చాయి. అవి ఆర్థిక సహాయం చేయడానికైనా ఆయుధ సహాయం చేయడానికైనా ఇదే ప్రధాన కారణం. (ఇదే కారణంవల్ల కమ్యూనిస్టు రాజ్యాలు సహాయపడవు.) ఇందులో వానికిగల స్వప్రయోజనం అనేది కూడా ఈ భావాలకే పరిమితమై ఉంటుంది. ఈ భావాలతోనే పండిట్ నెహ్రూ ప్రభుత్వ విధానాలను అవి విమర్శిస్తాయి· అవసరాన్నిబట్టి సమర్థిస్తాయి. ఇందులో పండిట్ నెహ్రూ, ఆయన ప్రభుత్వం అనేవి నిమిత్తమాత్రం. భారత ప్రజాస్వామిక వ్యవస్థ, భారత ప్రజానీకం అనేది శాశ్వతం. ఇది చారిత్రక దృష్టి. దీనిని గమనించకుండా పాశ్చాత్య రాజ్యాల ఆయుధ సహాయంలో వాటిని స్వప్రయోజనం కలదని విమర్శించడం చరిత్ర గతికి విరుద్ధం. "షరతులు లేకుండా సహాయ పడాలి" అవడం "విదేశ సైన్యాల రాకను విదేశ సైనిక నిపుణులను అంగీకరించము" అనడం కూడా—ఇలా అనడం కూడా విబంధ విధానంలో ఒక భాగం—చారిత్రక దృష్టి లేకపోవడం వల్లనేనని చెప్పవలసి ఉంటుంది.

ఎందుచేతనంటే—శత్రువు వచ్చి, మనమీద పడినప్పుడు మించిన బలంతో శరవేగంతో ముందుకు చొచ్చుకువస్తూ ఉన్నప్పుడు పరాయివారిని ఆయుధ సహాయం అడిగాము. వారు ఇచ్చారు. మందుగుండు అడిగాము. వారు పంపారు. సైనిక నిపుణులను పరిశీలకులుగా ఆహ్వానించాము. వారు వచ్చారు. దేశంలోనే ఆయుధోత్పత్తికి శాశ్వత ఏర్పాట్లు అవసరమన్నాము. వారు కొంతవరకు సరే నన్నారు. పరాయిదేశ సైనిక నిపుణుల ద్వారా మన సైనిక రహస్యాలు, బల సంపత్తి వివరాలన్నీ పాశ్చాత్య దేశాలకు చేరాయి. వారి ఆయుధాలు లేనిదే వారి నిపుణుల ద్వారా శిక్షణలేనిదే మనం సైనికంగా బలపడలేము. శత్రువును ఎదుర్కొనలేము. ఈ సంగతి వారికి తెలుసు. మనకూ తెలుసు. అయినా ఇంకా పాత విధానపు పునశ్చరణ దేనికి? పాత సిద్ధాంతాలను ఏకరువు పెట్టడం ఎందుకు? "విబంధం" అనేది ఎవ్వరితో? "సంబంధం" కాకుండా ఉండగలిగేది ఎవ్వరితో?

భారతదేశపు భౌగోళిక పరిస్థితులనుబట్టి, ఒక వైపున పాకిస్తాన్, మరొకవైపున కమ్యూనిస్టు చైనాలు శత్రువులుగా ఉండడాన్నిబట్టి, 1963 తర్వాత భారత శ్రేయస్సుకు విబంధ విధానం అవసరం. విబంధ విధానపు అవసరం ఎంతమాత్రమూలేదు. కాని, ప్రధాని నెహ్రూ భావ ధోరణిమాత్రం దీనికి అనుకూలంగాలేదు. కమ్యూనిజంవేరు, కమ్యూనిస్టు ప్రభుత్వంవేరు, ప్రజలువేరు, అన్న ధోరణిలో ఆయన ప్రసంగిస్తూన్నారు. కమ్యూనిజం మంచిదేకాని చైనా కమ్యూనిస్టులు మంచివారుకారు అని అంటున్నారు. కాని, ప్రపంచ కమ్యూనిజం నిజస్థితిని గ్రహించిన వారెవ్వరూ ఇలాంటి వ్యత్యాసాన్ని చూపడంలేదు. పైగా ఇలా వ్యత్యాసం చూపడం ప్రమాదకరమని హెచ్చరిస్తున్నారు. కమ్యూనిజం—కమ్యూనిస్టు ప్రభుత్వ ఒక్కటే అని, అది రష్యా కమ్యూనిజం అయినా, చైనా కమ్యూనిజం అయినా వాటి అంతర్జాతీయ లక్ష్యం ఒక్కటేనని గుర్తించినప్పుడు భారత దేశానికి విబంధ విధానం ఎంతగా ప్రమాదకరం కాగలదో సులభంగా గ్రహించవచ్చు.

ఈ గ్రహింపు భారత పాలక వర్గంలోకంటె ప్రజలలో ఈనాడు హెచ్చుగావుంది. జాతీయోద్యమ ప్రభావంలో కలోనియలిజం, కేపిటలిజం అనే వారికి వ్యతిరేకంగా పెరిగిన భావాలు గత పదిహేను సంవత్సరాలలోను మార్పుచెందాయి. Sectarian దృక్పథం స్థానే Welfare దృక్పథం ఏర్పడింది. ఆ దృక్పథం బలపడుతున్నది. కాని, దాని ప్రభావం రాజకీయంగా ప్రస్ఫుటం కావడంలేదు. ఫరూకాబాద్, అమ్రోహా, రాజకోట ఉప ఎన్నికల ఫలితాలు, ఆచార్య కృపలానీ, డాక్టర్ లోహియా, మినూ మసానీవంటి వారు లోకసభకు ఎన్నిక కావడంలో ఇది కొంతవరకు ద్యోతమైంది. ఇది ప్రజలలోను, దేశ పరిస్థితులలోను వచ్చిన మార్పుగా ప్రధాని శ్రీ నెహ్రూ గుర్తించడంలేదు. ఇదంతా ప్రతీపశక్తుల విజృంభణగా భావిస్తున్నారు. కలోనియలిజం, ఇంపీరియలిజం, కేపిటలిజం, చివరకు కమ్యూనిజంలలో వచ్చిన మార్పును గుర్తించి, దానికి తగ్గట్టుగా వైదేశిక నీతిని సవరించలేకపోతున్నారు. ఆ కారణంగానే పొరుగునవున్న శత్రువు స్వభావాన్ని సరిగా అంచనా వేయలేకపోతున్నారు. శ్రీ నెహ్రూలోవున్న రాజకీయమైన ఈ బలహీన స్థితి కమ్యూనిస్టు చైనా దురాక్రమణను మించిన ప్రమాదాన్ని ఈనాడు భారత దేశానికి తెచ్చిపెట్టుతున్నదంటే తప్పు కాదేమో! ఈ సందర్భంలోనే ప్రధాని శ్రీ నెహ్రూను గురించి లూయీ ఫిషర్ చెప్పిన మాటలు ఉదాహరిస్తే సరిపోతుంది:—

# విబంధ విధానము: శ్రీ నెహ్రూ

"**Nehru is an Englishman" Gandhi once said to me. He is an Englishman and an Indian; an agnostic ruling over several hundred million religious Hindus and Moslems; an intellectual with little taste for power, but love for the drama, adula - tion, and stage—strutting that go with it; an indecisive man compelled to make decisions daily; a proud impulsive, tempestuous person who nevertheless yields to argument and apologizes when he has caused pain; an apparently stubborn leader who bends to the demands of reality; a supreme egocentric yet an idealist."**

(Russia. America and the world)

నాయకుడు ఉత్తమ భావకుడు అయితేనే సరిపోదు. ఆయన తనకుగల భావాలను పదేపదే పునరుద్ఘాటన చేయడంతోనే అదొక విధానంగా రూపొందదు. ఒకవేళ ఆ నాయకుడు తనకుగల పలుకుబడిని బట్టి తన భావాలకు అనువైన విధానాన్ని రూపొందించి, అనుచరులచేత ఆమోదింప జేసినా, ఆచరణలో చివరకు అది అక్కరకు రాకపోవచ్చు. ఇందుకు గాంధీజీని ఆయన ప్రబోధాలను ఉదాహరణగా తీసుకోవచ్చు. దాదాపు ముప్ఫయ్ సంవత్సరాలు హిందూముస్లిం సమైక్యత, భారత ఖండ సమైక్యతను గురించి చక్కని ప్రబోధనలు చేశారు. కాంగ్రెసుద్వారా నిర్వహించిన జాతియోద్యమాలలో దానినొక అంతర్భాగం చేశారు. కాని చివరకు, జరిగినదేమిటి ? భారత, పాకిస్తాన్‌ల విభజన జరిగింది. తన విధానానికి విరుద్ధంగా దేశ విభజనకు కాంగ్రెసు అంగీకరించింది. అంటే గాంధీజీ ఆశయాలు, ప్రబోధాలు ఆచరణలో విఫలమైనట్టే కదా ! చివరకు ఆయన తన జీవితాన్ని కూడా అందుకోసం బలి ఇచ్చారు కదా ! ఈ సందర్భంలోనే గాంధీజీ గొప్పతనాన్ని గురించి మరొక సంగతికూడా స్మరించవలసి ఉంది. దేశ విభజన, పాకిస్తాన్ అవతరణ అనంతరం, భారత పాకిస్తాన్‌ల మధ్య రకరకాల వివాదాలు వచ్చాయి. అందులో ఉమ్మడి భారత ప్రభుత్వం కాతానుంచిన పాకిస్తాన్‌కు చెల్లించవలసిన సొమ్ము విషయంలో, సర్దార్ పటేల్ పేచీపెట్టారు. ఆ సొమ్ము చెల్లింపును నిలుపుచేశారు. కాని గాంధీజీ అందుకు సమ్మతించలేదు. ఆ సొమ్ము చెల్లించితీరాలని నిరాహారదీక్ష పూనారు. పాకిస్తాన్ మిత్రత్వం భారత్‌కు అవసరమని తద్వారా నిరూపించారు. పంతం నెగ్గించుకున్నారు. కాశ్మీర్‌లోకి భారత సేనలను పంపించడానికి గాంధీజీ కూడా అంగీకరించారని ప్రచారానికి చెప్పుకొనే కాంగ్రెసు నాయకులు, పాకిస్తాన్ స్నేహసాధనకు గాంధీజీ నిరాహారదీక్ష పూనడాన్ని కూడా గుర్తుకు తెచ్చుకొని వ్యవహరించడం అవసరం.

ఈ సందర్భంలోనే గాంధీజీ జీవితకాలంలో జరిగిన మరొక సంఘటనను కూడా ఉదాహరించవలసి ఉంది. జాతీయ చైనా నాయకుడు చాంగ్—కై—షేక్ నాయకత్వం ఘనంగా ఉన్న రోజులవి. ఈ నాటివలెనే ఆ నాడుకూడా పండిట్ నెహ్రూ చైనా ప్రభుత్వ స్నేహసహృద్భావాలను కాంక్షించారు. భారత స్వాతంత్ర్య సాధనకు అనువుగా చాంగ్—కై—షేక్ ద్వారా అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టును సుముఖం చేసుకొనడానికి ప్రయత్నాలు జరిగాయి. ఆ సందర్భంలోనే చాంగ్ కై—షేక్ దంపతులు భారత దేశానికి వచ్చారు. పండిట్ నెహ్రూ వారికి నివాళిపట్టారు. కాని గాంధీజీ వారినిజ స్వరూపాన్ని గ్రహించారు. నేటి చైనా కమ్యూనిస్టు నాయకులలో ఎంత మోసముందో, నాటిచైనా జాతీయ నాయకులోను అంతే కుతంత్రం కలదని గుర్తించారు. ఆ విషయం ఒక లేఖద్వారా పండిట్ నెహ్రూకు విశదంచేశారు. దీనినిబట్టి ఈ నాడే కాకుండా, ఆ నాడు కూడా పండిట్ నెహ్రూ చైనా వారిని సరిగా అర్థంచేసుకొనలేదని నమ్మవలసి వస్తున్నది. అయితే అప్పటికీ ఇప్పటికీ ఒక వ్యత్యాసం ఉంది. ఆ నాడు శ్రీ నెహ్రూ జాతీయ భావావేశంలో ఉన్నారు. ఈ నాడు అంతర్జాతీయ భావావేశంలో ఉన్నారు. నాటికి— నేటికి ఆయనలోని భావావేశం తగ్గలేదు. ఆ నాడు ఈ భావావేశం ఉన్నా, గాంధీజీ, సర్దార్ పటేల్, రాజేంద్రబాబు ప్రభృతులు మధ్య ఆ ఆవేశం అణగి పోయేది. ఆచరణ యోగ్యమైన విధానాన్ని వారు రూపొందించగా దానికి తలొగ్గేవారు, కాని ఈనాడు ఆ పెద్దలులేరు ఆయన రక్షకులమని అభిమానులమని కేకలు పెట్టేవారికి దేశంలో పలుకుబడి లేదు. కాంగ్రెసు సంస్థలో పట్టులేదు. ఆయనను ఆశ్రయించుకొంటేతప్ప వారికి గతిలేదు. ఆశ్రయం పొందటానికి ఇతరులను తిట్టాలి. నిజానికి శ్రీ నెహ్రూను బలపరుస్తున్నమనేవారు, ఆ పేరుతో ఆయనను బలహీనుణ్ణి చేస్తున్నారు. ఆది నుండి కాంగ్రెసును అంటి పెట్టుకుని అచంచల దేశభక్తిని వెల్లడించినవారు దూరమై, వంట ఇంటి వామపక్ష వీరులు, తాడు తెన్నూ లేనివారు ఆత్మీయు లయినారు. ఆచరణ యోగ్యమైన విధానం రూపొందడానికి అనువగు వాతావరణం ఆయన పరిసరాలలో లేదు. అందువల్లనే భావావేశంతో కూడిన ఆయన విభంధ విధానం ఆచరణలో విఫలమై

దేశానికి తగిన రక్షణలేకుండా చేసింది. కమ్యూనిస్టు చైనా, పాకిస్తాన్ మాత్రమే కాక, నేపాల్— బర్మాలు కూడా దూర దూరంగా ఉండిపోగల స్థితి ఏర్పడింది :

పండిట్ నెహ్రూ, ఉత్తమ భావకుడు అయితే, ఆయన అమలు జరిపిన విభంధన విధానము సక్రమమైన దైతే భారత దేశానికి ఇలాంటి శోచనీయస్థితి అంతర్జాతీయంగా ఎందుకు ఏర్పడింది ? కాశ్మీర్‌లో నిజంగా దురాక్రమణ సాగించినా, ఐక్యరాజ్య సమితి మన వాదనను అంగీకరించలేదేమి ? గోవా నిజంగా మన మాతృ భూమిలో భాగమైనా, దానిని మనం ఆక్రమించుకుంటే ప్రపంచ రాజ్యాలు హర్షించలేకపోయినవేమి ? స్నేహాన్ని శాంతిని కోరి పంచశీల సూత్రాల ప్రకారం టిబెట్‌ను వదలుకున్నా కమ్యూనిస్టు చైనా భారత ప్రభుత్వాన్ని విశ్వసించదేమిటి ? కమ్యూనిస్టు చైనా దురాక్రమణకు తలపడితే సోదర ఆసియా రాజ్యాలు గట్టిగా చైనాను ఖండించవేమి ? చివరకు కాంగోలో కొరియాలో, లావోస్‌లో భారత సైన్యాలు సమితి ఆధ్వర్యాన దీక్షతతో వ్యవహరించినా, భారత దేశానికి పాక్షిక దృష్టి కలదన్న నిందతప్ప లేదేమి ? వీనినిబట్టి చూడగా ప్రధాని నెహ్రూ అనుసరించిన విబంధ విధానమువల్ల జాతీయంగా దేశానికి భద్రత సమకూరలేదని, అంతర్జాతీయంగా భారత దేశపు నిజాయితీని ఎవ్వరూ— అటు కమ్యూనిస్టు రాజ్యాలు, ఇటు పశ్చిమ రాజ్యాలు— గుర్తించలేదని ధృవపడుతున్నది. అంతకు పూర్వం సంగతి ఎలావున్నా 1962—63లో ఇది మరింత స్పష్టమైపోయింది.

స్వాతంత్ర్యం పొందిన పదిహేను సంవత్సరాల తర్వాత అంతర్జాతీయంగా భారతదేశం స్థితి ఏమిటని ప్రశ్నించుకొని పరిశీలిస్తే— పొరుగున బలీయమైన శత్రువులు పొంచి ఉండడం, మిత్రరాజ్యాలలో ఎవ్వరూ నమ్మకస్తులో, ఎవ్వరు నమ్మకస్తులుకారో తెలియకపోవడం, పశ్చిమ రాజ్యాలు కూడా భారత ప్రభుత్వం చిత్తశుద్ధిని శంకించడం, పంచశీల సూత్రాలకు తిలోదకాలు ఇవ్వడం, బలప్రయోగంలేకుండా శాంతి పద్ధతులద్వారా సామరస్యం సాధించాలనే తత్వం బెడిసిపోవడం, సరిహద్దులలో సుమారు 50 వేల చదరపు మైళ్ళలో మన అధికారం చెల్లక పోవడం, గృహదహన మవుతూ ఉంటే బావి త్రవ్వకానికి ఆరంభించినట్లు, శత్రువు దెబ్బతీసిన తర్వాత ఆయుధ సేకరణకు, సైనిక సన్నాహాలకు ప్రయత్నించడం, దేశ సరిహద్దుల్లో రేపు ఏమి జరుగుతుందో అనే భీతితో ప్రజాజీవితం సాగడం—మినహా కానవచ్చేది, విన వచ్చేదీ మరేదీలేదు.



శా. భద్రే భంబాక కంటెఁ గూర్కెడును స్వప్నావస్థయం దేనియున్
క్షుద్రూ సంతతి నిద్రవోవుచు వినంగా నోపు మర్త్యుండవై
నిద్రావస్థ శ్రమతే తుణక్రియల రెంటిం జేయుచున్నావులే
నిద్రాదేవత నిన్వరించెగదరా! నిర్భాగ్యదామోదరా!

శా. అద్రీశాత్మజ జాని మంత్రపు రహస్యంబెల్ల తృణ్ణమ్ముగా
భద్రాత్మం గ్రహియించి నిశ్చల జపప్రారంభతన్ మాలికా
రుద్రాక్షంబుల బట్టియుం గునికిపాట్లుం జెందుచున్నావులే
నిద్రాదేవత నిన్వరించెగదరా! నిర్భాగ్యదామోదరా!

# రామరాజ్య స్థితి



కుష్వంతసింగ్

ఇది ముప్ఫయ్ ఏళ్ళనాటి మాట:

పరాధీనతనుంచి స్వదేశాన్ని తప్పించాలని పారలిపోతున్న ఉత్సాహంతో ఒక ఇంగ్లీషు విశ్వ విద్యాలయంనుంచి దేశంలో దిగాను. ఏదో కాస్త ముట్టజెపితే నా సామాను లన్నింటిని చూడకుండానే వదిలేస్తానని ఒక కస్టమ్సు అధికారి చెప్పాడు. అందుకు అప్పుడు నేనేమీ ఆశ్చర్య పడలేదు. బ్రిటిష్ పరిపాలనలో అలాంటిది జరగటం మామూలని అనుకున్నాను. ఆ కాలం కేవలం కలియుగం !

ఇది పదేళ్ల నాటి మాట:—

స్వతంత్రమైన దేశానికి అమితోత్సాహంతో తిరిగి వచ్చాను. బొంబాయిలో దిగాను. ఒక జిడ్డు ముఖం మనిషి నా పక్కకు వచ్చి, ఏదో కాస్త ముట్ట జెపితే, కస్టమ్సు అధికారుల ఇబ్బంది ఉండదని చెప్పాడు. అప్పుడు నాకు మండిపోయింది. దేశభక్తిని గురించి అతనికి ఉపన్యసించాను. అతను తోక ముడుచుకొని, కుయ్ కుయ్ లాడుతూ వెళ్లే కుక్కలాగా వెళ్ళిపోయాడు. నేను తర్వాత మూడు రకాల ఫారాలను నింపాల్సి వచ్చింది. నా పెట్టెలో సామానులన్నీ బయట పడవేయవలసి వచ్చింది. అనేక కౌంటర్ల (తనిఖీ బల్లల) దగ్గర నుంచుని కాచుకోవలసి వచ్చింది. అవసరంలేని వస్తువులకు కూడా దిగుమతి సుంకాన్ని చెల్లించుకోవలసి వచ్చింది. ఆ కస్టమ్సుశాలనుంచి బయట పడిన వారిలో ఆఖరివాడిని నేను. నేను ఢిల్లీకి వెళ్లవలసిన రైలు తప్పిపోయింది. అయినప్పటికీ ఇది రామ రాజ్యం!

ఇది ఏడాదినాటి మాట:—

బొంబాయిలో దిగాను. కస్టమ్సువారికి చూపించవలసినది ఇంచుమించు నా దగ్గర ఏమీలేదు. అయినా ఆ జిడ్డుముఖం వ్యక్తికోసం అటూ, ఇటూ చూశాను. అలాంటివారు చాలా మంది కనబడ్డారు. వారందరిలోకి జిడ్డుముఖం వాణ్ణి ఏరుకున్నాను. పది రూపాయలు అతని చేతులో పెట్టాను. చూశారు! కొద్ది నిముషాల తర్వాత మెరీన్ డ్రయివ్‌లో కారులో వెడుతున్నాను.

ఈ పదేళ్లలో నాకేమి వచ్చింది? నేను ఉత్తమమైనవిగా భావించినవన్నీ ఏమైపోయినాయి. వాటిని వదిలివేసి లంచభూయిష్టమైన సంఘంలో ఏ గొడవ చేయకుండా ఉండే స్థితికి నన్ను దిగలాగింది ఏమిటి? చెబుతాను.

నే నెప్పుడూ ఊరికే కలలు కనేవాడినికాదు. చిన్న పోలీసు ఉద్యోగులు, కోర్టు గుమాస్తాలు మరితర చిన్న ఉద్యోగస్తులు—నిజాయితీ పరులుగా పరివర్తన చెందటానికి రామ రాజ్యం మాత్రమే చాలదని నా అభిప్రాయం. అయితే బ్రిటిష్ ఉన్నత అధికారులస్థానే వచ్చిన విద్యావంతులైన భారతీయులు, బ్రిటిష్‌వారు కనపరచిన నైతిక ప్రమాణాలను అనుసరించి తమ క్రింది ఉద్యోగులకు ఆదర్శప్రాయులు అవుతారని ఆశించాను. కాని, ఇంతకుమించిన భ్రమలేదని తేలింది.

ఈ సందర్భంలో మొట్ట మొదటగా నా పై అధికారి చేసిన పనే నన్ను అదర గొట్టేసింది. (ఆయన పేరెందుకు బయట పెట్టటం) లోకసభలో వచ్చే ప్రశ్నలకు జవాబులుగా ఆయన అన్నీ తప్పుడు లెక్కలు తయారుచేసి ఇచ్చేవాడు. అంతేకాదు. అప్పుడుభారత ఉప ప్రధానిగావున్న సర్దార్ పటేల్‌ను గురించి అతి న్యూనతమైన వ్రాతలు కొందరు మంత్రులతో సాగిస్తూ ఉండేవాడు. అలాంటి ఈ నాపై అధికారే దేశభక్తికి, నిజాయితీకి ప్రసిద్ధి పొందాడు. ఆ ప్రసిద్ధి అప్పటినుంచి కొండంతగా పెరుగుతూనే వచ్చింది.

అధికారంలో ఉన్నవారి ఎత్తులు చూస్తే నాకు ఎక్కడలేని విచారం వచ్చింది. మన రాష్ట్రపతికి జ్యోతిష్యంలో ఎక్కడలేని నమ్మకము. ఆయన పెద్దలందరి జాతకాలని పోగుజేసి అట్టే పెట్టుకున్నాడు. నక్షత్రాలు, జ్యోతిష్యులు అంటే, రాష్ట్రపతితోపాటు మంత్రులలో అందరికీ కాకపోయినా, చాలా మందికి నమ్మకం. పెద్ద విషయాలమీద సలహా ఇవ్వడానికి కొందరు జ్యోతిష్యులను తమ పోషణలో ఉంచుకున్నారు. వీరిలో ఒకరికి ఆకాశంలోకి తేరి చూచే వారివికాక, యోగి అనే వారిని చేర దీశారు. ఆయనకి వళ్లు వంచి పని చేయక, పెండికట్లు పెట్టుకొని, పని చేయుమని ఇతరులకు బోధించే

వారిని చూస్తే ఇష్టం. మా రాష్ట్ర ముఖ్యమంత్రికి ఒక జ్యోతిష్యుడు ఉన్నాడు. ఎప్పుడూ వారింటిలోనే ఉంటాడు. ఈ జ్యోతిష్యుణ్ణి అప్పు డప్పుడు అప్పుడున్న రక్షణ మంత్రికి అరువు ఇస్తూ ఉండేవాడు. ఈయన మాటకు సహచర మంత్రులకన్న ఎక్కువ చెల్లుబడి ఉండేది. పక్క రాష్ట్ర ముఖ్యమంత్రి ఆకాశంలోకి తేరిపార చూడగలగడంలోను, జాతకాలు చూడడంలోను నిపుణుడని పేరు. ఆయన కాలజ్ఞత్వాన్ని ప్రదర్శిస్తూ, ప్రభుత్వ ఖర్చుతో పంచాంగాలు వేస్తూ ఉండేవాడు. అగోచర శక్తుల విశ్వాసం ప్రభుత్వ శాలలోవున్న వారందరికీ పెరిగింది. పెద్ద ఐ సి. ఎస్ ఆఫీసర్లకు, కొత్త ఐ. ఏ. ఎస్ అధికారులకు, జనరల్స్‌కు బ్రిగేడియర్లకు, కర్నల్స్‌కు, ఫర్డు కేంబ్రిడ్జిలనుంచి వచ్చిన పక్కా పండితులకు, సాంధ్రస్టు, వూర్విచ్, క్రాప్‌వెల్ కేంద్రాలలో శిక్షణ పొంది వచ్చిన వారికి, ఒక ఫోటాకోసం బేరర్‌తో సరసాలాడే ఈ స్ఫుట్నిక్ యుగపుత్రులు ఆ ఫోటాను సేవిస్తూ, వింత ఉచ్ఛారణలో పరమాణు శక్తి గురించి చర్చిస్తూ, అదృష్ట దేవతను వివిధ రూపములలో తీసుకువచ్చే, పలు రంగుల రాళ్ల ఉంగరాలన ప్రదర్శిస్తూ మాట్లాడేవారు—ఈనాడు ప్రభుత్వంలో ప్రత్యక్షమవుతున్నారు.

ఇంతకీ మనోజాడ్యం వారికా? నాకా? ఇది చెడు చేయని వ్యాసంగమా? బహుశా ఈ వృత్తి ఒక అందమైన అమ్మాయి చేయి అందుకొని చూడ్డానికి అవకాశం కల్పిస్తుందేమో! ఇది బాగానేవుంది. అయితే ఒక సేనాధిపతి శత్రువును కొట్టడానికి సమయం నిర్ణయించుకోలేక భృగు సంహితను చూస్తే ఎలా? ఈజాడ్యం కన్నా కూడా ఇంకా పెద్ద జాడ్యం వుంది. ఒక చిన్న బడిపంతులు మంత్రి అయ్యాడు. కోటీశ్వరునికి కన్ను కుట్టేటంత సంపదను ఆయన సంపాదించాడు. ఒక మంత్రి కుటుంబీకులు సినిమా థియేటర్లతోపును, రిఫ్రీజియేటర్ యంత్రాలను సంపాదించారు. ఇతరులు కొడుకులకు, అల్లుళ్లకు, మేనల్లుళ్లకు ఉద్యోగాలు సంపాదించుకున్నారు. నిజంగా చూస్తే అధికారంలో ఉన్నవారిలో మురుగులో పడనివారు కొద్దిమంది మినహా కనబడరు. ఇలా ఉంటూనే నీతి బోధంతా వీరే చూస్తూ ఉంటారు.

చట్టం, పోలీసు, లంచగొండితనాన్ని చంపలేరు. సాంఘికమైన నిషేధం, క్లబ్బులలో సభ్యత్వం రాకుండా చేయడం (Black balling) ఇలాంటివి చేస్తేనే వారికి తెలిస్సి వస్తుంది. అయితే సంఘ శ్రేయస్సును విస్మరించిన చర్యలకు శిక్ష పొందిన వారు ఇచ్చే విందులకు రాష్ట్రపతి, భారత ప్రధాని ఇతర ఉన్నతాధికారులు వెడుతూఉంటే—వారికి లేనిది మన కెందుకని మిగతా వారంతా అనుకుంటారు. (సౌజన్యం "ఒపీనియన్."

---

"మేమంటే గిట్టనివారు చెప్పే మాటలను నమ్మి మమ్మలను అనకండి — మా చేతలే మా విషయం చెబుతాయి."



మ. చదువుల్ నేర్చిన పండితాధములు స్వేచ్ఛాభాషణ క్రీడలన్
పదరన్, సంశయభీకరాటవుల త్రోవల్ దప్పి వర్తింపగా,
మదన క్రోధకిరాతులందుగని భీమ ప్రౌఢిచే దాకినన్
చెదరుం జిత్తము చిత్తగింపగదవే శ్రీ కాళహస్తీశ్వరా!

## గ్రంథములు – గ్రంథకర్తలు :

# జకార్తాలో సందె చీకటి



**రావు**

పత్రికా స్వాతంత్ర్యము కోసం పాటుపడి చెఱసాలలో జీవితం సాగిస్తున్న సాహసిక సంపాదకుడు 'ముక్తర్ లుబి' వ్రాసిన నవల యిది. ఇండొనేషియాలో ఈ సంవత్సరం ప్రకటితమైన గ్రంథాలలో ఎన్నికైనది. "సంస్కృతి స్వాతంత్ర్య సమితి వారి తోడ్పాటుతో హచిన్‌సన్ అనే ఆయన ఆంగ్లభాషానువాదంతో వెలువడింది. అంతర్జాతీయ పత్రికా స్వాతంత్ర్య సమితివారికి, పదేళ్ల నుండీ అధ్యక్షుడుగా ఉంటూ, 'అబ్జర్వర్' అనే పత్రికలో సారస్వత శాఖకు, సమీక్షకుడుగా పనిచేస్తున్న ఇ. జే. బి. రోజ్ అనే ప్రముఖ రచయిత దీనిని సమీక్షించేడు. లండనులో ఫోరమ్ సర్వీసు వారి సౌజన్యంతో యీ సమీక్ష ప్రకటితమైంది.

ఒక ఇండొనేషియను స్నేహితుడు నాతో మాట్లాడుతూ, పాశ్చాత్య దేశాల్లో పుట్టుక నుండి చావు వరకూ, జీవితం ఒకేవిధంగా చలనం లేకుండా ఉంటుంది. మా దేశంలో ఏ క్షణం ఏది జరుగుతుందో తెలియదు. "ఈరోజున నేను పత్రికా సంపాదకుణ్ణి. మర్నాడు రాయబారిని—లేకపోతే ఖై దీని.

"జకార్తాలో సందె చీకటి" అనే నవలను వ్రాసిన ముక్తర్ లుబి ప్రస్తుతం జైలులోనే ఉన్నాడు. ఈ నవల, ఆతడు దీర్ఘమైన కారాగారశిక్ష అనుభవించిన రోజులలో వ్రాసిందే— రాజ్యాంగంలో అవినీతి, ప్రజల్లో దుర్భర దరిద్రం ప్రబలంగా ఉండే ఒక క్రొత్త రాజ్యంలో స్వాతంత్ర్యం కోసం ప్రాణాలు తెగించిన, ఒక ధీరుని కథ ఇందులో ఇతి వృత్తం. ఇంతేకాక ఉదాత్తత, అంతశ్శుద్ధి ఉన్నవారు ఖై దీలుగా కాలం గడుపవలసిన సన్నివేశాలు యిందులో వర్ణింపబడ్డాయి. ఇది ఒకరిపై నేరారోపణ కాదు. అక్కడి దరిద్రావస్థ. తన సిద్ధాంతాల కనుగుణ్యంగా అక్కడ సంఘంలో జీవితం గడపాలంటే, విడవని పట్టుదల—విశుద్ధమైన, హృదయం—ధీరత్వంగల భార్య—యీ మూడు ఉండాలి. లుబికి యీ మూడు ఉన్నాయి.

ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో వలసరాజ్య విధానం నుండి విముక్తి పొందిన క్రొత్త దేశాలలో, నాయకత్వభారం వహించడానికి ఏ కొద్దిమందో విద్యావంతులైన స్త్రీలు, పురుషులు మాత్రమే సిద్ధపడ్డారు—వారి కవకాశాలు, అత్యుత్సాహాన్ని కల్పించేయి. ఈ సంఘంలో, సంఖ్యలో చిన్నదిగా ఉన్న ఈ ఉత్తమశాఖలోనే, ప్రతి సభ్యుడును, జాతీయ సేవకు పూను కొనవలసి వచ్చేది. కాని వలసరాజ్యాధికారాన్ని ప్రతిఘటించిన కాలంలో సమకూడిన సమైక్యత స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, ఆ రాజ్యంలో నిలిచి ఉంటుందని భావింపరాదు. దేశ దారిద్ర్యాన్ని నివారించడమనే క్లిష్ట పరిస్థితి నెదుర్కోవడానికి వేరే విధమైన శిక్షణ, నాయకత్వం జాతికి ఉండాలి. కాని యీ క్రొత్త నాయకుల దృష్టి రాజకీయాల విషయమై చాలా సంకుచితం. దేనికి ప్రాధాన్యం యివ్వవలెనో వారికి తెలియ లేదు. పలుకుబడి, అధికారం—వీనికోసం పోరాడడం—ఆవిధంగా వచ్చే లాభాలని పొందడం—ఇవే వారి ఆశయాలు.

ఈ విధానంలో నూతనంగా ప్రకాశవంతంగా ఉండవలసిన దేశంలో, అంధకారం క్రమ్ముకొన్నది. కొంతమంది తాత్కాలికంగా గొంతెత్తి దీనిని విమర్శించక పోలేదు. అయితే అది స్థిరరూపం దాలిస్తే వారికి ప్రాణాపాయకరంగా పరిణమించేది. స్వాతంత్ర్యం వచ్చిన ప్రారంభదినాల్లో, దుష్పరిపాలన, అవినీతి గడ్డకట్టని రోజుల్లో పత్రికలు చాలా ప్రముఖ పాత్ర వహించేయి. యుద్ధానంతరం అవతరించిన ఇండొనేషియా ప్రజా ప్రభుత్వం—దీన్ని గుర్తించింది. విద్యావంతులు, యువకులూ అయిన సంపాదకులు స్వాతంత్ర్యోత్సాహ పూరితాలైన పత్రికలు నడుపుతూ ఉండేవారు.

ఈ పత్రికలు ప్రభుత్వంవారి సహాయ సంపత్తిచేత వర్ధిల్లేయి. స్వతంత్రం వచ్చిన దేశంలో జాతి నిర్మాణాత్మకంగా పెంపొందాలంటే దానికి పత్రికా ప్రచారమే ప్రధాన బలమని ప్రభుత్వము భావించింది. మొదటి సంవత్సరాల్లో ప్రభుత్వానికి పత్రికా సంపాదకులకు మధ్య ఎంతో అన్యోన్య సంబంధం సౌహార్దం ఉండేవి. ఇట్టి గౌరవపూర్వకమైన సంబంధం యిరువురిలోను కలగడానికి ఒక యువకుడు నాయ

**ముక్తార్ లుబి** తోడి వారంతో పత్రిక నడిపించడమే కారణం— **అతడే మోక** లుబి. తోడివారంతా అతని సహాధ్యాయులు.

అయితే యిప్పుడు వారెవ్వరు పత్రికలలో లేరు. పత్రిక లన్నింటిని ప్రభుత్వం అణగద్రొక్కింది. వారు బలవంతంగా వానిమండి విరమించవలసి వచ్చింది. స్వాతంత్ర్యపు అడుగు జాడలు కూడా పూర్తిగా దేశంలో మాసిపోయేయి.

తన సిద్ధాంతాలకోసం మొదట కష్టా లనుభవించిన వాడు లుబి. 'ఇండోనేషియా రాయ' అనే స్వతంత్ర పత్రికలో, ప్రభుత్వంలో లంచగొండితనం, దౌర్జన్యం, అవినీతి—వీని వన్నింటిని తూర్పార బట్టేడు. పత్రికాముఖంగా అతను చేసిన దాడి ప్రశంసనీయమైంది. అతని సాహసం వ్యక్తమైంది. ప్రజలు సంతోషించి, అతని కొక బంగారు పతకం బహూకరించేరు—ఇది పత్రికా చరిత్రలో ఒక స్మరణీయ మైన ఘట్టం. అతని వ్రాతలు, అటు ప్రభుత్వానికి ఇటు సైనికవర్గం వారికి సహించరాని వైనాయి. 1956 లో సంవత్సరాంతంలో అతణ్ణి జెయిలులో ఉంచి తరువాత ఉత్తర ప్రత్యుత్తరాలకు వీలులేని ఒక రహస్య ప్రదేశంలో ఒక ఇంట్లో నాలుగేళ్లు నిలిపేరు—1961 లో హఠాత్తుగా ఏ షరతులు లేకుండానే, అతణ్ణి విడుదల చేసేరు.

ఒక నెల అయిన వెనుక టెల్అవివులో జరిగిన అంతర్జాతీయ పత్రికా సంస్థవారి మహాసభకు లుబి హాజరైనాడు. పత్రికా స్వాతంత్ర్య సిద్ధాంతాలను గూర్చి, ఒప్పుదల సూచించని యుక్తులతో, ఉపన్యసించి, దాన్ని ప్రతిపాదించేడు. ఆ ఉపన్యాసం తిరిగి అతన్ని కష్టాలకు కారణం అయింది. తన దేశం రాగానే, అతని అరెస్టుచేశారు. విచారణలేకుండానే ఒక సైనిక కారాగారంలో నిర్బంధించేరు. 1956 నుండి, అతణ్ణి ఒక్కసారైనా న్యాయస్థానానికి తీసుకొనిరాలేదు.

ఇట్టి దీర్ఘకాల కారాగృహవాసంలో పూర్వంకంటె సాహసం, ధైర్యం, శక్తి చూపించేడు. అతడు స్పానిషుభాష నేర్చుకున్నాడు. చిత్రలేఖనం ప్రారంభించేడు. కథానికలు వ్రాసేడు. ఈ నవల కూడా అక్కడ వ్రాసిందే. ఆంగ్లభాషానువాదంలో ప్రకటితమైన అతని గ్రంథాల్లో ఇదే మొదటిది.

చాలా పేదవారు, క్రొత్తగా గొప్పవారైనవారు, కొద్దిమంది చిన్న ఉద్యోగులూ—వీరి జీవితాలతో యీ నవల నడుస్తుంది. మొదట నాలుగు కంఠాలు కలిసినా తరువాత **విలాప్య** **పాతకంలో పడిపోతుంది**, నవలలో ఒక రసవద్ఘట్టంలో **ఒక** కుట్ర వర్ణితమైంది. అధికారంలో ఉన్న ఒక వర్గ నాయకుడు తన వర్గం కోసం చాలా ధనం కావలసి, దిగుమతి లైసెన్సుల్ని ప్రభుత్వాజ్ఞ లేకుండా అమ్ముతాడు. కుట్ర తెలిసిపోయిన తరువాత, ఆ వర్గానికే కాక తక్కిన వారికి కూడ అది వినాశకారి అవుతుంది.

ఈ నవలలో భావాన్ని ఉత్తేజపరిచే, పాత్రపోషణ లేకపోవడం, ఒక దోషమేమో ? తన దేశంలో వున్న సాంఘిక పరిస్థితి యొక్క భిన్నభిన్న దృశ్యాలను ప్రదర్శించడమే గ్రంథకర్త ఉద్దేశం. అవినీతిపరుడైన ఒక వ్యాపారస్థుని కుమారుడు సూర్యోనో యువకుడు, కొంత విద్య నేర్చినవాడు అతడు స్వాతంత్ర్య వాదులతో తత్త్వశాస్త్రం చర్చించేవాడు. కాని అతని కామేచ్ఛ — అతన్ని తప్పుమార్గాల్లోకి త్రిప్పి పాడు చేస్తుంది.

సూగింగ్, ఒక నమ్మకస్థుడైన రాజకీయోద్యోగి. అతనికి అవినీతి పట్టుపడింది. కారణం పేదరికం. తనకు రెండోబిడ్డ పుట్టేలోగా తనకొక స్వంత యిల్లుకావాలని అతని భార్య పట్టుపట్టింది. నిజంగ పుట్టుకతో దరిద్రం అనుభవించేవాళ్లు మాత్రం ప్రభుత్వ వక్రమార్గాలనుసరించవలసిన అగత్యం లేకపోయింది. వారు తమ శరీరాల్ని అమ్ముకొని ఇతరులకు ఏవగింపు కల్గించేవారు.

పాశ్చాత్యులకు, మొట్ట మొదట యీ పుస్తకంలో స్పష్టంగా కనిపించేది అక్కడి దరిద్రం. చాలా వర్షంగా ఉండే నవంబరు నెలలో ఒక పెద్ద నీటిగొట్టంలో కొంతమంది మనుష్యులు పడుకొన్నారు. దాన్ని భూమిక్రిందికి తోసుకొని వెళుతూ ఉంటే చినుకులు పడి గొట్టంలోకి వస్తూఉంటే లోలోపలికి వాళ్లు వెళ్లడం జరిగింది, అంటే భూగర్భంలో ఉండిపోయినారన్నమాట. అచ్చట వర్షా కాలవర్ణన అయినా, ఈ నవల సందేశాన్ని మనం గ్రహించాలంటే, ఇట్టి దుర్భర సన్నివేశాలను అవగాహన చేసుకోవాలి.

దరిద్రం ఒక్కటేకాక, ప్రతిమనిషీ — ఏదో ఒక విధంగా, ఈ బాధ తప్పిపోతుందా, అనే తరణోపాయం ఆలోచనలోకి వచ్చే భయంకర స్థితులుకూడా లేకపోలేదు. అమ్మకానికి సిద్ధంగా ఉన్న వస్తువుల్లా ఆదర్శాలని ముందుపెట్టే వారున్నారు. అచ్మద్ అనే అతడు సూర్యావో స్నేహితుల్లో ఒకడు. అతని సామ్యవాద సిద్ధాంతం, కొంతమందికి నచ్చేది. అతడు స్నేహితులతో జరిపిన చర్చ లీపుస్తకంలో ముఖ్య ఘట్టాలు కాని కొద్దికాలానికే, అచ్మద్ అంతంలేని చర్చలూ, మాటలూ— వీనివల్ల లాభంలేదని మాటిగా కార్యరంగంలోకి దిగాలని నిర్ణయించుకొని తన వర్గాన్ని పరిత్యజించేడు. కాని ఆ వర్గంవారింకా, "ఏవిధమైన సంఘం తమ దేశానికి సరి

పోతుంది'' అనే విషయం చర్చిస్తూనే ఉన్నారు. ప్రజారాజ్యం కావాలని కొంతమంది— అక్కరలేదని కొందరు. సమూహ నాయకత్వం— కావాలని కొందరు— చివరకు ఇస్లాంమత సిద్ధాంతాల కనుగణ్యంగా రాజ్యం ఉండాలని వివాదాలు జరిపేరు. మూర్తాలిస్ అనే తన/ముస్లిం స్నేహితుడు, ఒక అల్లరిమూకను ప్రతిఘటిస్తాడు. అచ్మడ్ ఆ మూకను రేకెత్తిస్తాడు. ఆ మూక పాదాలలో మూర్తాలిస్ అణగిపోయి ప్రాణాలు వదలడం, ఆ పరిస్థితికి ప్రతీకం.

జకర్తాలో నేరస్థుల జీవిత చిత్రణమే యీ నవలలో ప్రధానంగా ఉన్నప్పటికీ, అక్కడక్కడ— గొప్పవారిని బీద వారిని ఒకేలాగ పీడించే ఘట్టాలు కూడా ఉన్నాయి. అక్కడ జరిగే ఘోరకృత్యాల్ని చూపడానికి అవి రచితములయేయి. అయితే, అంధకారబంధురమైన— ఆ రాజ్యంలో అక్కడక్కడ వెలుగు చిమ్ముతూ, తాము నమ్మినది సత్యమని పట్టువిడవని యువకులూ ఉన్నారు. ఒక స్నేహవర్గానికి నాయకుడైన ప్రానోటో, తాను ప్రేమించిన అమెరికన్ యువతిని యింటికి దుకు పెళ్లాడలేదో యీ క్రింది ఉత్తరం మూలంగా తెలి పేడు.

''నా స్వంత ప్రజాసోదరులకి నేను నిర్వహించవలసిన కర్తవ్యం ఉన్నది. స్వాతంత్ర్య విప్లవ పోరాటంలో, తమ జీవితాలని అర్పించిన నా ప్రజల సత్యరూపాపణకై నేను పాటు పడాలి. స్వతంత్రం వచ్చిన తరువాత, ఆర్జవంలేని, అవినీతి పరులైన రాజకీయ వేత్తలు పాలించడానికికాదు, నా స్నేహి తులు జీవితాలను ఆహుతిచేసింది. ఇంకా ఎంతో పనిఉంది. నావంటి యువకులు స్వదేశంలో పనిచెయ్యాలి. ప్రజలకు వారి కర్తవ్యం కనువిప్పు కలిగించాలి, వారి జీవితాలను ఉన్నత స్థితికి తీసుకురావాలి, ప్రజానీకం, తమదేశ భవిష్యత్తు తమ చేతుల్లో ఉంచుకొనే సామర్థ్యం కలిగేదాకా, నేను పాటు పడాలి.''

ఇదే మక్బర్‌లుబి సందేశం

---

# శైవాచార్యపరంపర

ఆచార్యత్రయము—1. హరదత్తాచార్య
2. భట్టభాస్కరాచార్య
3. నీలకంఠాచార్య త్రయము

ఆరాధ్యత్రయము—1. ఉద్భటారాధ్య
2. కోటిపల్యారాధ్య
3. శ్రీమనారాధ్యత్రయము

సిద్ధత్రయము—1. రేవణసిద్ధ
2. మగుళసిద్ధ
3. ఏకోరామసిద్ధ త్రయము

పండిత త్రయము—1. శ్రీపతి పండిత
2. శివలెంక మంచెన పండిత
3. మల్లికార్జున పండిత త్రయము

---

# ప్రాతకోట - పుల్లయకవి



శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

ఈ కవి నాల్గాశ్వాసములు గల 'బ్రహ్మోత్తర ఖండము'ను రచించినాడు. ఇతఁడు శైవాచార పరాయణుఁడఁగు వైదికారాధ్య బ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. కాత్యాయన సూత్రుఁడు. పోతరాజు, పెదవీరమలపౌత్రుఁడు: రేఖయామాత్య పుత్రుఁడు. పరమేశ్వరారాధన విధేయుఁడైన పుల్లయ నామధేయుఁడు. అని యీ క్రింది గద్య వలనఁ దెలియుచున్నది. 'ఇది శ్రీ వీరభద్ర కృపాలబ్ధ సరస కవితా చమత్కార, ప్రచండాను కోదండ, ప్రథమ శాఖాగ్రగణ్య చారిత్ర, కాశ్యపగోత్ర, కాత్యాయనీ సూత్ర, పవిత్ర సుచరిత్ర, వీరనారాయణ పురవిఖ్యాత ప్రాతకోట పోతరాజు పెదవీరమరాజు పౌత్ర, రేఖయామాత్య పుత్ర, పరమేశ్వరారాధన విధేయ, పుల్లయ నామధేయ ప్రణీతంబైన శివప్రభావాభి రామంబగు బ్రహ్మోత్తర ఖండంబను మహాపురాణమునందు శైవ పంచాక్షరీమంత్ర మహాత్మ్యం బన్నది ప్రథమాశ్వాసము, ఇది శ్రీ .... శివరాత్రి జాగరణ పూజా మాహాత్మ్యం బన్నది ద్వితీయాశ్వాసము—ఇది శ్రీ .... సోమవార వ్రత మాహాత్మ్యం బన్నది తృతీయాశ్వాసము. ఈ చతుర్థాశ్వాసము చివర కొన్ని తాళపత్రములు తునిగినవి. కొన్ని లేవు, కలికాలాదులు. తన గ్రంథాదిలో 'శ్రీశైల పశ్చిమభూమి భవనాశమను వాహినీ తటమున మౌనులు. దేవ మల్లేశ .... భూసురేశాది ముఖ్య శివలింగ బహుతీర్థములు కలిగి, సకల విద్యా విశాల సజ్జనులు గలిగి ప్రబల విఖ్యాతి గన్నట్టి ప్రాతకోట—పురవరాంకుఁడనని చెప్పుకొనుచున్నాఁడు. ఈ ప్రాతకోట కర్నూలు మండలమునఁ గలదు. తద్వంశీకు లెవ్వరైన నట కలరో ? లేరో ? తెలియదు. తన వంశోన్నతినిం గూర్చి యిట్లనుచున్నాఁడు.

> శ్రీ విష్ణు నాభిరాజీవ మధ్యంబున
> బ్రంహ జనియించె తద్బ్రంహసంత
> తతికిని కశ్యపముని యమ్మహాత్ముని
> వరగోత్రమున యాగ్నివల్క వంశ
> మం దుద్భవించె కస్వామాత్యు డుత్త
> ము డతని పుత్రుఁడు లక్కసాఖ్యు డట్టి
> పుణ్యున కుదయించె—పోతరాజాన్వయు
> డట్టి ఖ్యాతునకు జగద్ఘట్టి వీరు
> తనయుఁ డాతని సుతుఁడు రేఖన వదాన్యు
> డాయనకు అక్కమాంబకు నాత్మజుఁడ
> ఘనత కెక్కిన రామలింగయ్యకు ననుజు
> డను శివాచార హితుఁడ పుల్లసుకవిని. (సీతిక.)

ఇందు పితామహ ప్రభృతి తనవరకున్నవారిఁ దెల్పియఁజేసినాఁడు. 'ఇది' స్కంద పురాణ సంహితకు ఖండములేఁబదిలో నొక్కటిగా నుండనోపు. గ్రంథరచనకుఁ గారణము నిట్లనుచున్నాఁడు—"కరుణాకటాక్ష వీక్షణంబున వీక్షింపుచు పరమానందంబున, మహానుభావులయిన సకల సుకవి బంధుజనంబులు బ్రహ్మోత్తర ఖండంబను మహాపురాణంబును, ఆంధ్రభాషా విశేషంబున రచింపుమని శివప్రేరితులై యానతిచ్చిన నేను మహాప్రసాదంబని దృఢంబుగా నానంద కందళిత హృదయుండనై తత్ప్రాభవంబున నంగీకరించి"తినని వ్రాసికొన్నాఁడు. ఆ కాలమందలి భక్తుల ప్రేరణంబున దీని నాంధ్రీకరింప సమకట్టి యుండును. కాలమును గూర్చి సరియైన యాధారము లేదు గాని పూర్వ కవిస్తుతిలో కవిత్రయమును స్తుతించి పోతనను వేములవాడ భీమునిస్తుతించినాఁడు. కాన, పోతనకు తరువాతి కాలమువాఁ డవుట సందియములేదు. దీనినిబట్టి క్రీ. శ. 16 శతాబ్దపువాఁడై యుండవచ్చును.

ఈ కావ్యమందలి ఇతివృత్తము నిట్లుండవలయునని 'నైమిశారణ్యంలోని మహర్షి సంఘము సూతు నిట్లు ప్రార్థించిరఁట. ఆ క్రమ మిది. 'పంచాక్షరీ లక్షణ విలక్షణంబును, మాఘ కృష్ణ చతుర్దశీ ముఖ్య చతుర్దశీ విశేషంబును, త్రయోదశీ ప్రదోషపూజా విశేషంబును, సోమవార వ్రత విచిత్రంబును, శివసేవా ప్రభావంబును, విభూతి మహాత్మ్యంబును, ఉమామహేశ్వ రారాధన క్రమంబును, రుద్రాక్ష, రుద్రాధ్యాయ సామర్థ్యంబును, పురాణ శ్రవణ విధానంబును, శని ప్రదోష మాహాత్మ్యం బాదిగా గల విశేషములతో కూడి శివ మహిమలం

జాటు చిత్ర విచిత్రమైన కథలతో కూడియుండవలయునని యపేక్షించిరట. అట్లే యున్నది.

కవిత్వము: 'సరస కవితా చమత్కార' యన్న విశేషణము కొంతవరకు సార్థకమే యని చెప్పవచ్చును. ఈతనికి ముందు (1) పట్టమెట్ట—సోమనాథకవి, (2) మండపాక—కామకవి, (3) పిడుగుపర్తి—బసవన, (4) శ్రీధరమల్లె—వేంకటస్వామి, యనువార లాంధ్రీకరించి యున్నారు. నాటి శైవమత ప్రాబల్యమో, శివభక్తి తత్పరతయో, ఈతనిఁ గూడ నాంధ్రీకరించుటకు శ్రీకారము జుట్టించినది. ఎంద రెన్ని గతుల రచించినం గాలదే! భక్తునకు భగవంతుని మహిమలే కదా, రచనకు ప్రేరేపించును.

## కావ్య మీమాంస

పురాణలక్షణములు కలవుగాని, ప్రబంధ లక్షణముల పాల కువ పొడగట్టలేదు. అని ప్రబంధకవితామార్గ మెఱుఁగనివాఁడని నిరసింపలేము. కొన్ని లక్షణములున్నవనియే చెప్పవలయును. 'తానే మహాపురాణమని వాచ్యముగఁ జెప్పుకొనుచున్నాఁడు కదా! వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములు చాల కలవు. కాని కవిత్వము మాత్రము మృదు మధుర మైనది. కమ్మని శైలి, కమనీయ రమణీయములగు భావములు. రచనలో కందము, మాకందము, మధురభావ సమంచితము. ప్రబంధములందు వలె షష్ఠ్యంతములును గలవు. ఈ గ్రంథమును 'శ్రీ నగసింహాసనునకు, ఆనందాంబునిధికి శైల జార్ధాంగునకున్, నానాశ్రిత పద్మోద్భవ, మానాథసు త్యునకును, మల్లేశునకు, అంకిత మిచ్చినాఁడు. భక్తకవి పోతనవలె—నిజదారసుతోదర పోషణార్థమై, ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చిపురంబులు, వాహనంబులు పుచ్చికొని కాలుచే సమ్మెట పోటులం బడుట కిచ్చగింపక సమ్మతి శ్రీహరుకిచ్చి చెప్పినాఁడీ సుకవిరత్నము.

ఆద్యంతములలో నెచ్చటను—ఇతర కృతుల ప్రస్తావనయే పొడకట్టదు. ఈ గ్రంథమునకు ముందే వేని కావ్యములు రచించక యుండి యుండవు. కవిత్వము కొంత పరిణతిఁజెందినదిగా గనబడు చున్నది. అవన్నియు ముద్రితములో? అముద్రితములో, కాలగర్భమున కలసిపోయినవో? లేకయే నిరక్షరాస్యు నింట పొగ చూరుచున్నవో? ఎన్నో ప్రాచీన గ్రంథములు పొగచూరుచున్నవి.

ఇక నిందలి పదము లిట్లున్నవి:—(ఈ) యీాతన్వీ (సేవ) శేవ (ఉమా) వుమా (కరంబు) కరంబ్బు (సీ) హీ. ఇత్యాదులు అనేకము లున్నవి. ఇవి వ్రాయసగాని పొరపాట్లనియే చెప్పవలయు. వాఁడిట్లు వ్రాయుచున్నట్లు లోగడనే జూచిన 'సకలభూవణ భాస్కరోదయము" వంటి తాళపత్ర గ్రంథములలో మున్నవి. భాషా పరిశీలకులు పరిశోధింతురుగాక! ఈ కవి కవితాశైలిని నిరూపించుటకై కొన్ని పద్యము లిందుదహరించుచున్నాఁడను:—

> శ్రీ వాక్పర్వతజా సరోజముఖులం చెన్నొందు నిత్యంబు, వ
> క్షోవక్త్రాంగములన్ చరించి సుమనః కేళీకళా సంభృత
> ప్రావీణ్యంబుల సౌఖ్యముల్ గను హరి బ్రహ్మత్రి నేత్రాఖ్యులన్
> శేవింతున్ తలతున్, నుతింతు, సకల శ్రేయోవచో రూఢికిన్."

ఈ పద్యమున నన్నయ భట్టారకుఁడు తొంగిచూచుట లేదా?

> శివయను డక్షరద్వయము శిష్టమతిం బఠియింప నంత—ప్రా
> గ్భవ భయదోష ఘోరతర—పాపక సంఘములెల్లఁ బాయు, నా
> స్తవమున మత్ప్రియా యతవద స్ఫురణంబు జపించునట్టి—మా
> నవులకు భుక్తి ముక్తులు ననంత సుఖోన్నతు లొప్ప చేకురున్.

ఇందు 'శివనామాక్షరద్వయ మాహాత్మ్యము, తెలియజేయుటలేదా?

> ఇంతీ యెవ్వతె వీవు? నీదు జనకుం డెవ్వాడు? యే దేశమో?
> కాంతారంబున నొంటి నిట్లు తిరుగంగా కారణం బేమియో?
> కాంతా యవ్వన లక్ష్మివో? సురవధూ కన్యా లలామంబవో?
> వింతల్ నీ వర రూపసంపదలు భావింపన్ కురంగేక్షణా,

ఇది కుకవినింద—ఇది మాత్రం ఆంధ్ర కవులలో నెవ్వరును విస్మరింపలేదు.

> గురు లఘువుల యతుల ప్రాసము
> లురు శబ్ద స్థితులు తెలియకొప్పని కవితల్
> విరచించునట్టి కుకవుల
> కొరమాలినవారి చేరుకొన నెన్నటికిన్.

ఇంతటి రసవత్తరమైన కావ్యమును—సంపూర్ణముగ సంపాదించి ముద్రించి ఆంధ్ర కవిశేఖరుని కీర్తిని శాశ్వత పరచవలసినదిగా ప్రార్థించుచున్నాఁడను. ఇట్టి గ్రంథము లనేకము లీయా ప్రాంతములందలి సాహితీపరులుగాని, గ్రంథాలయాధిపతులుగాని సేకరించి వానికి కనీసము పుత్రికలైనను సృష్టించి ఆ కవుల కావ్య శరీరములనైనను పరిరక్షింతురఁ గాక యని ప్రార్థించుచున్నాఁడను.

---

# గ్రంథ విమర్శనము

## మెక్‌బెత్

(అనువాదకులు : 'అమరేంద్ర'. ప్రకాశకులు : సాహిత్య అకాడెమీ పక్షమున మారుతీ బుక్‌డిపో, గుంటూరు. 119 పుటలు. మూల్యం: రు 2.50.)

షేక్స్పియర్ జగత్ప్రసిద్ధమైన ఆంగ్లకవి, నాటక రచయిత. ఆంగ్లభాషలో కొంచెమో గొప్పో ప్రవేశం ఉన్న ప్రతి వ్యక్తికి షేక్స్పియర్ మహాకవి గ్రంథరాజాలతో పరిచయం ఉండక మానదు. పదహారవ శతాబ్ది చివరి భాగంలోను, పదునేడవ శతాబ్దపు మొదటి భాగంలోను ఆంగ్ల వాఙ్మయ వినువీథిలో షేక్స్పియర్ ఒక వెలుగు వెలిగించాడు. సుమారు నాలుగు శతాబ్దాలు జరిగి పోవస్తున్నప్పటికీ ఆ వెలుగు యింకా దేదీప్యమానంగానే ఉన్నది. ఆంగ్లభాష చలామణీ వున్నన్నాళ్లూ షేక్స్పియర్ మహాకవిగా పరిగణింప బడుతాడనడంలో అతిశయోక్తి లేదు. షేక్స్పియర్ వ్రాసిన నాటకాలు మొదట రంగస్థలం కొరకై వ్రాయబడినప్పటికీ, అవి రంగస్థలిలోనే కాక మానవ హృదయం స్పందించే ప్రతిచోటా మనుగడ చేసికొన్నవి. ఆ నాటకాలలో ఒకటి ప్రస్తుత గ్రంథం మెక్‌బెత్.

మెక్‌బెత్‌లోని కథ చరిత్రాత్మకమైనది. మెక్‌బెత్ పూర్వకాలపు స్కాట్లండ్ రాజులలో ఒకడు. అతడు మొదట డంకన్ ప్రభువువద్ద సైన్యాధికారిగా మాత్రమే ఉండెను. సైన్యాధికారిగా ప్రభువు యొక్కయు ప్రజలయొక్కయు మన్ననలను పొందెను. తన ప్రభువునకు అండగా నిలుచుండి శత్రువులను చెండాడి రాజ్యాన్ని కాపాడి డంకన్ అనుగ్రహానికి పాత్రుడైనాడు. కాని రాజ్యకాంక్షచేత దుర్బుద్ధిపుట్టి డంకన్‌ను రహస్యంగా చంపివేసి రాజ్యం చేపట్ట దలచాడు. ఈ దురాలోచనకు మెక్‌బెత్ భార్య చేదోడు వాదోడుగా నిలిచి కార్యసాధనకు ప్రోద్బలం చేసినది. దీనికితోడు మానవేతరమైన దుష్టశక్తులు అతని దుష్ట ప్రయత్నాలకు ప్రోత్సాహమివ్వడంచేత, ప్రేమాతిశయంతో అతిథిగా వచ్చిన డంకన్ ప్రభువును మెక్‌బెత్ దంపతులు దారుణంగా హత్యచేసి, హత్యానేరాన్ని పరిచారకులమీదికి త్రోసివేస్తారు. ఈ భీభత్సవార్త వినగానే డంకన్ కొడుకులు స్కాట్లండ్‌విడిచి పారిపోతారు. ఖాళీయైన సింహాసనానికి మెక్‌బెత్ యెన్నుకోబడుతాడు. ఇక్కడికి వాంఛాసిద్ధి అయినప్పటికీ, మెక్‌బెత్‌కు మాత్రం మానసిక షెమ్మది నాశనమవుతుంది.

రాజ్యపదవి ఎన్నాళ్లు నిలుపుకొనగలం అను ప్రశ్న మెక్‌బెత్ మనస్సును ఆవరిస్తుంది. మానవాకారం పొందిన దుష్టశక్తులు దర్శనం యిచ్చినప్పుడు తనతోకూడ వున్న బాంకో అను తోటి సైన్యాధికారికి తనమీద అనుమానం కలిగినట్లు అతను గ్రహించాడు. అంతేకాక ఆ శక్తులు మెక్‌బెత్‌నకు రాజ్యప్రాప్తి కలిగి నప్పటికీ, బాంకో సంతతికి ఆ రాజ్యం పరిణమిస్తుందని అప్పుడే చెప్పినవి. ఇంతపాపమూ కట్టుకొని డంకన్‌ను చంపి రాజ్యం చేపట్టినది బాంకో సంతతికి వప్పగించడానికా అని మెక్‌బెత్ బాధపడుతాడు. చివరకు బాంకోను కూడ రహస్యంగా హత్య చేయించడానికి పూనుకొని, ఆ హత్య కాండకూడ పూర్తిచేస్తాడు. కాని హత్య పూర్తికాగానే మెక్‌బెత్ తన సామంతులతోను స్నేహితులతోను కూర్చుని విందు ఆరగిస్తుండగా బాంకో పిశాచరూపంలో కనిపించి మెక్‌బెత్‌ను హడలగొట్టుతాడు. దాంతో మెక్‌బెత్‌కు మనస్సు మహా క్షోభించిపోతుంది. బాంకోతోపాటు అతని కొడుకును కూడ హత్యచేయుమని యేర్పాటు చేయించినప్పటికీ, కొడుకు తప్పించుకొని పారిపోవడంవలన, మెక్‌బెత్‌కు డొక్కలో శూలం గుచ్చుకొన్నట్లే వుంటుంది. తనభావి యిటో అటో తేల్చుకోవాలని తిరిగి ఆ క్షుద్రశక్తుల దర్శనానికై అరణ్యంలోనికి వెళుతాడు.

స్త్రీ రూపం దాల్చిన ఆ దుష్టశక్తులు మెక్‌బెత్‌కు సలహా హామీ యిస్తవి : (1) మెక్‌డఫ్ అను అనుచరుణ్ణి గురించి జాగ్రత్తగా వుండమనీ, (2) బర్నం అడవి డన్‌సినన్ గుట్టవరకు కదలి వచ్చేదాకా భయపడ నక్కరలేదనీ, (3) స్త్రీ గర్భంలో పుట్టిన వ్యక్తి యెవ్వడూ మెక్‌బెత్‌ను చంపలేడనీ. మెక్‌డఫ్‌ను గురించి జాగ్రత్త పడటానికి వెంటనే మనుష్యులను పంపిస్తాడు మెక్‌బెత్. అప్పటికే మెక్‌డఫ్ ఇంగ్లండుకు పరారికావడం వలన ఆ దుండగులు అతని భార్యను పసిబిడ్డలను మారణంచేస్తారు. బర్నం అడవి కదలిరావడమనేది అసంభవమని మెక్‌బెత్ భావిస్తాడు. పైగా స్త్రీ గర్భంలో పుట్టని మానవుడు లేడు గనుక తనకు ఎవరివలననూ భయములేదని విర్రవీగుతాడు. ఈ గర్వంచేత దేశంలో మరింత ఘోరంగా ప్రవర్తిస్తాడు. మెక్‌బెత్ స్కాట్లండుకి అరిష్ట పురుషుడుగా తయారవుతాడు.

కాని త్వరలోనే మెక్‌డఫ్ ఇంగ్లండులో డంకన్ కొడుకైన మాల్కంను కలుసుకొని ఆంగ్లరాజ సహాయంతో సైన్యాలు ప్రోగుచేసి, స్కాట్లండు మీదికి దండెత్తుతాడు. మార్గ మధ్యంలో సేనలసంఖ్య దూరాకిని తెలియకుండుటకై బర్నం అడవిలో ఒక్కొక్క సైనికుడు ఒక్కొక్క చెట్టు కొమ్మను అడ్డుగా పెట్టుకొని నడువవలసినదిగా ఆజ్ఞాపిస్తాడు. దీనివలన దూరానవున్న మెక్‌బెత్ కోటనుంచి చూడగా బర్నం అడవి కదలి వస్తున్నట్లు కనిపిస్తున్నది. దానితో మెక్‌బెత్‌కు క్షుద్రశక్తులు ఇచ్చిన హామీ ఒకటి నిష్ప్రయోజన మవుతుంది. మాల్కం సేనలు త్వరలోనే కోటను ముట్టడిస్తవి. మెక్‌బెత్ అనుచరులుకూడ అదనుచూచుకొని శత్రువుకి సహాయం చెయ్యడంవలన మెక్‌బెత్ నిస్సహాయుడవుతాడు. మెక్‌డఫ్ మెక్‌బెత్‌కు ఎదురుపడి తన భార్యను బిడ్డలను పరిమార్చినందుకు కసి తీర్చుకొనేందుకు మెక్‌బెత్‌ను చంప బోతాడు. కాని మెక్‌బెత్ తాను స్త్రీ గర్భంలో పుట్టిన యెవ్వరికీ లొంగనని ప్రగల్భం కొట్టుతాడు. అప్పుడు మెక్‌డఫ్ తాను స్త్రీగర్భ జనితుడు కాననీ, తనతల్లిగర్భంనుండి శస్త్ర సహాయంవలన బయటకు లాగబడినవాడననీ చెప్పి మెక్‌బెత్ ధైర్యాన్ని ధ్వంసం చేస్తాడు. చివరకు మెక్‌డఫ్ మెక్‌బెత్ లు ఘోరయుద్ధం చేస్తారు. అందులో మెక్‌డఫ్ మెక్‌బెత్ శరీరాన్ని ఖండించి దుష్ట పరిపాలనను సమాప్తం చేస్తాడు. మాల్కం రాజ్యాభిషిక్తుడవుతాడు.

టూకీగా మెక్‌బెత్ కథయిది. కాని షేక్స్పియర్ నాటకం చదవడం వట్టికథ తెలుసుకొనడానికి కాదు. అతని రచనలోని అనన్యసామాన్యమైన కవితా మాధురిని గ్రోలడానికి, అతని శైలిలోని అంద చందాలను చవి చూడటానికి, అతని నాటక గరిమలోని బిగువును అనుభవించడానికి. అనువాదాలలో మూలంలోని యీ విశిష గుణాలు సంపూర్ణంగా తీసికొని రావడం అసంభవం. అవితీసికొని రాకపోతే అనువాదంలో కళేబరం మాత్రం ఉంటుంది, ప్రాణంవుండదు. ప్రస్తుత అనువాదం ఇంచుమించు ఆ రకంగానే వున్నది.

షేక్స్పియర్ మెక్‌బెత్ లోనూ ఇతర నాటకాలలోను కూడ కవితా పటిమకు ప్రోద్బలం యిచ్చే Blank verse అను ఛందస్సులో చాలవరకు రచించాడు. మధ్యమధ్యన గద్య వాడినప్పటికీ, హృదయావేదన, హృదయ వికాసం, హృదయ స్పందన, హృదయ పరిణామం మొదలగు విషయాలు ప్రకటించవలసిన అదనులలో బ్లాంక్‌వర్స్‌వాడి తన కవితను హృదయరంజకం చేశాడు. ప్రస్తుత అనువాదంలో అంతటా గద్యమాత్రమే ఉపయోగించడంవలన యివి యేవీ ప్రకటితం కాక చప్పచప్పగా తయారయినది. మచ్చుకు ఒక్కముక్క. ప్రథమాంకంలో ఏడవరంగం మొదట మెక్‌బెత్ తాను తల పెట్టిన డంకన్‌హత్య యెంతవరకు సమంజసమనే సమస్యను తర్కించుకొంటాడు :

"If it were done when 'tis done, then 'twere well.
It were done quickly: if the assassination
Could trammel up the consequence, and catch,
With his surcease, success; that But this blow
Might be the beall and the end-all here,
But here, upon this bank and shoal of time.
We'ld jump the life to come. But in these cases
We still have judgment here; that we but teach
Bloody instructions, which being taught return.
To plague the inventor'; this even-handed justice.
Commends the ingredients of our poison'd chalice
To our own lips. He's here in double trust:
First, as I am his kinsman and his subject,
Strong both against the deed; then, as his host,
Who should aginst his murderer shut the door,
Not bear the knife myself. Besides, this Duncan.
Hath borne his faculties so meek, hath been
So clear in his great office, that his virtues.
Will plead like angels, trum pet-tongu'd, against
The deep damnation of his taking off:
And pity, like a naked new-born babe
Striding the blast, or heaven's cherubin, horsed.

Upon the sightless couriers of the air,
Shall blow the horrid deed in every eye,
That tears shall drown the wind. I have no spur.
To prick the sides of my intent, but only.
Vaulting ambition, which o'verleaps itself.
And falls on the other

దీనికి ప్రస్తుత పుస్తకంలో అనువాదం ఇలాగు ఉన్నది :

ఆ పనివల్ల చెడుఫలితాలు లేకపోతే ఎంత త్వరగా ముగిస్తే అంతమంచిది. హత్యజరగగానే నా ఆశయం సిద్ధించి ఆ తరువాత ఏ యిబ్బందులూ కలగకుండావుంటే, ఈ ఒక్క ఘాతంతో నా కోరికలన్నీ తీరితే? ఈ విషయం యింతటితో అంతమైపోతే, ఇదే నా జీవిత సారాంశమైతే— నా కింకేం కావాలి ? భావి జన్మల ఆనందాన్నంతటినీ ఈ క్షణంకోసం బలి చేసి కాలసాగర సైకతం నుంచి అగాథతలాలకి దూకివేస్తాను. కాని యిటువంటి సందర్భాలలోంచి తేలికగా బైటపడటం అసాధ్యం. న్యాయస్థానంలో నిలబెట్టి దండిస్తారు. మనం నేర్పిన దారుణమైన పాఠాలు తిరిగి మనకే అప్పగిస్తారు.

ఇతరులకోసం సిద్ధంచేసిన విషపాత్రని నిష్పాక్షిక బుద్ధితో, న్యాయదేవత మనకే అందిస్తుంది. మనచేత బలవంతాన తాగిస్తుంది. ఇప్పుడు నా బాధ్యత రెండింతలయింది. డంకన్ నా బంధువు, నా దేశపురాజు. కనక ఆ పని నేనెల్లా చేయను ? అంతేకాక ఇప్పుడు డంకన్ నా అతిథి. ఆయనకి ఏ విధమైన హాని జరగకుండా ద్వారాలు బంధించి రక్షించవలసిన నేను హంతకుడనై కత్తి పట్టడం ఎంత అధర్మం. డంకన్ చాల సాధుపురుషుడు. తన పరిపాలన ధర్మంగా కొనసాగించాడు. ఇటువంటి మంచి వాణ్ని సంహరిస్తే అతని సుగుణాలు ముక్త కంఠముతో ప్రజలని మేలుకొలిపి హంతకుడిమీదికి పురికొలుపగలవు. ఈ హత్య అందరిని జాలితో నింపివేసి కళ్లల అశ్రువులు చిందిస్తుంది. ఈ దారుణ కృత్యాన్ని అందరూ గర్హిస్తారు. నగ్న శిశువులాగా, కనపడని గాలి గుర్రాలమీద స్వారిచేసే దేవదూతలాగా కరుణ అందరి హృదయాలనీ కరిగించి వేస్తుంది. ఈ పని ఎంత అధర్మమో అందరికీ చాటిస్తుంది. నా ఉద్దేశాలకి తగిన ప్రోద్బలంలేదు. అంతులేని ఆశ నన్ను పూర్తిగా ఆవేశించింది. హద్దులు దాటితే మొదటికే మోసం వస్తుంది.

బాగున్న భాగాలలో ఇదిఒకటి. ఐనప్పటికీ, ఆంగ్ల మూలానికీ తెలుగు అనువాదానికి చాలాతేడా వున్న విషయం ఆంగ్లమూలం సరిగా అర్థంచేసుకొనగల వారందరికీ వ్యక్తమౌతుంది. ఆంగ్లంలోవున్న పదగుంభనకు అనువాదంలోని పదాలకు వ్యత్యాసం కనిపిస్తుంది. మూలంలోలేని భావాలుకూడ అక్కడక్కడ దొర్లినవి. ఉదాహరణకు, 'జీవిత సారాంశం' గురించి మూలంలోలేదు. 'న్యాయస్థానంలో నిలబెట్టి దండిస్తారు' అనేభావం కూడాలేదు. ఒకచోటఆంగ్లంలోవున్నమాటకు అపార్థం, ఆపాదించబడినది : (we'ld jump the life to come) అను మాటలకు 'అగాధ తలాలకి దూకివేస్తాను' అని అనువదించబడినది. (Jump) అనే మాట 'దూకడం' అనే అర్థంతో వాడబడలేదు మూలంలో. 'సాహసించడం' అనే అర్థంతో వాడబడినది. తాను చేయబోయే పాపకార్యంవలన ఈ జన్మలో తనకు బాధకలుగని పక్షంలో ముందుజన్మలో ఎటువంటి ప్రతీకారం వచ్చే అవకాశం ఉన్నప్పటికీ సాహసించి ఆ పాపానికి ఒడికట్టుతాను, అంటాడన్నమాట మెక్‌బెత్. (Jump) తప్పుటర్థం తీసికొనడంవలన మూలంలోలేని 'అగాథ తలాలూ' కూడ అనువాదంలో రూపొందినవి. మూలం తిన్నగా అవగాహన చేసికొనకపోతే షేక్స్పియర్‌ను అనువదించడంలో ఇలాంటి తప్పులు వస్తవి.

ఇటువంటి పొరపాట్లు ప్రస్తుత అనువాదంలో ఇంకా వున్నవి. మొదటి రంగంలోనే (నాటకం మొదటి పేజీలోనే) రెండుమూడు వున్నవి. స్త్రీ రూపంలోవున్న దుష్టశక్తి ఒకర్తె మళ్లీ యెప్పుడు కలుసుకుందాం అని అడుగుతే రెండవది 'when the hurlyburly's done, when the battle's lost and won' అని సమాధానం ఇస్తుంది. ఈ సమాధానాన్ని తెలుగు అనువాదంలో 'గందరగోళం అణగిన తర్వాత, యుద్ధం అటో ఇటో తేలిన తరువాత, అన్నారు. (when the battle's lost and won) అంటే యుద్ధం అటోఇటో తేలడంకాదు. 'యుద్ధంలో ఓటమీ జయమూ కలిగినప్పుడు' అని అర్థం. సాధారణంగా యుద్ధంలో ఓటమేనా కలగాలి లేక జయమేనా కలగాలి— రెండూ కలగడం విపరీతం. మానవాతీతమైన దుష్టశక్తులు గనుక వాటికిఇట్టి విపరీతాలు పరిపాటి. కావున అలాగు అంటుంది. ఈ విషయం గమనించక "యుద్ధం అటో ఇటో తేలిన తర్వాత' అనడం సరికాదు. ఈ దుష్టనారీ శక్తులు విడిపోయే ముందు.

First witch : I come, Graymalkin !
Second witch : Poddock Calls.
Third witch : Anon !

# గ్రంథ విమర్శనము

All : Fair is foul, and foul is fair.
Hover through the fog and filthy air.

అంటవి. వీటికి అనువాదం చూడండి :

మొదటిది : వెళ్ళొస్తాను.

రెండవది : పనివుంది. పోతాను.

మూడవది : నేనూ ఇప్పుడే వెళ్ళాలి.

ముగ్గురూ : భలేమంచి సమయమిదే పదండిమరి పదండి, హోరుగాలి జోరువాన మంచి అదునుకదండి అందరికి చెడు అయితే మనకి అదే మంచి మనకి మంచి దైతే అది అందరికీ కీడు.

క్షమించాలి. మూలానికీ అనువాదానికీ అసలు పోలికవుందా అనిపిస్తున్నది. "Graymalkin, Paddock calls" అనే మాటలు కొరకబడక మానివేసినట్లా? మూలంలో (Fog and filthy air) హోరుగాలి జోరువాన యెట్లా అవుతుంది ? భలే మంచిసమయం, పదండి పదండి యెక్కడనుండి వచ్చినవి ? 'అందరికీ చెడు అయినది మనకి మంచిఅనీ, మనకి మంచిదైనది అందరికీ కీడు'అని మూలంలోలేదు. అందరి మాట, మనమాట మూలంలో యెత్తుకొనలేదు. మరి అనువాదంలో యెందుకు కావలసివచ్చినది ? అర్థం స్పష్టీక రించడానికన్నమాట. అలాగైతే అసలు అర్థం అవగాహన చేసి కొనలేదని తెలుస్తున్నది. ఆ దుష్టమాంత్రిక స్త్రీలు విపరీత వాగ్ధోరణిలో అనిన మాటలు అవి. వాక్కులలోని వైపరీత్యం వారికి సహజం. ఈ విపరీతాంశం అసలు మెక్‌బెత్ నాటకానికి పునాది. ఈ పదాలలోని అర్థం స్పష్టీకరించబోయి, ఆ పునాదిని లాగివెయ్యడమే కాకుండ, అపార్థంకూడ ఆపాదించి నట్లయినది అనువాదంలో.

ఇలాగే ఈ దుష్టశక్తులు మెక్‌బెత్‌ను కలుసుకొన్న ప్పుడు, ముగ్గురిలో ఒకతె "All hail, Macbeth, that shalt be king hereafter" అంటుంది. అంటే 'మున్ముందు అవబోయే రాజా !' అని పలుక రిస్తుందన్న మాట. ఈ మాటలవలన మెక్‌బెత్ తన మనస్సులో వున్న కోరిక ఫలిస్తుందని ఆశపడతాడు. ఆ ఆశయే అతనిచేత డంకన్ హత్యను చేయిస్తుంది. మరి ప్రస్తుత అనువాదంలో 'దిగ్విజయం మెక్‌బెత్ మహారాజుకుః దిగ్విజయం' అని వున్నది. మూలంలో దిగ్విజయం అన్న మాటా లేదు. మెక్‌బెత్ అప్పుడే రాజైనట్టు అంతకన్నాలేదు. ఇది కూడా అనువాదలోపమే అనిపిస్తుంది. అనువాదపు లోపాలు ఇలాంటివి చాలావున్నవి. మరొక్కటి మాత్రం చూపించి విరమిస్తాను— చాల ప్రధానమైన ఘట్టంలోనిది గనుక.

మెక్‌బెత్ బాంకోను చంపించిన తర్వాత తన భావిని గురించి మరింత కలవరపడి చివరకు తిరిగి ఆ దుష్టస్త్రీ స్వరూపాల దర్శనార్థం వెడుతాడు. అప్పుడు అవి ఒకరకమైన వింత దృశ్యాలను చూపించి మెక్‌బెత్‌కు అభయం ఇస్తున్నట్లు కనిపిస్తవి. అందులో రెండవదృశ్యం రక్తగ్రస్తమైన శిశువు— మెక్‌బెత్‌ను ఉద్దేశించి ఇటూ అంటుంది :

Be bloody, bold and resolute; laugh to scorn.
The power of man, for none of woman born.
Shall harm Macbeth.

ఇందుకు అనువాదం ఇలాగు వున్నది :

'ఇకనుంచి క్రౌర్యం, ధైర్యం, స్థైర్యం ప్రదర్శించు. నువ్వు అజేయుడివి. మానవులవలన నీకేమీ ప్రమాదంలేదు. మానవ మాత్రుని లక్ష్యం చెయ్యకు. స్త్రీ గర్భంనుంచి జన్మించిన ఏ వ్యక్తివల్లా నీకు అపాయం కలుగదు.'

మెక్‌బెత్ 'అజేయుడని'కాని, అతనికి 'మానవమాత్రుని వలన ప్రమాదంలేదు' అని కాని మూలంలోలేదు. ఎందు చేతంటే చివరకు మెక్‌బెత్ జయించబడుతాడు మానవ మాత్రుని చేతనే. అనువాదంలో ఇలాగు వ్రాసిన మూలాన ఈ దుష్టశక్తులు తాము ఇచ్చిన మాటను నిలబెట్టుకొనలేక పోయినట్టయినది. కాని, మూలంలో ఈ శక్తులు ఆడిన మాటలు అక్షరాలా (అక్షరాలా మాత్రమే) నిజమవుతవి. అనుకోని విధంగా అవి ఫలిస్తవి. తన్మూలంగా మెక్‌బెత్‌కు ఆశాభంగం, శిరో భంగం కూడ కలుగుతవి. మరి అనువాదంలో ఇంతపెద్ద తప్పు ఎందుకు చేశారా అని ఆశ్చర్యం వేస్తున్నది. ఇలాగు ఈ ఒక్కచోటేకాదు. ఇంకా రెండుమూడు చోట్ల ఇలాంటి తప్పులు, మూలంలోలేని వాక్యాలు ప్రవేశపెట్టడంవలన, ఉన్నవి అవగాహన చేసికొనక పోవడంవలన దొర్లివున్నవి.

మరొకమాట. ఈ నాటకంలో Banquo అను పాత్ర ఒకటి వున్నది. అతడు డంకన్ సేనలకు మెక్‌బెత్ తోడి అధికారి. అనువాదంలో అతనిపేరు 'బాంకువో' అని వ్రాశారు. ఈ ఉచ్చారణ నేను ఎక్కడా వినలేదు. ఘనతగల ఆంగ్ల పండితులు 'బాంకో' అని ఉచ్చరించగా చాలమాట్లు విన్నాను. అలాగే (Seyton) అను ఒక పాత్ర. మెక్‌బెత్ సేవకుడు, అనువాదంలో 'సేటన్' అని వ్రాశారు. సేటన్ అంటే ఆంగ్లంలో సైతాన్ అన్నమాట. అటువంటి పేరు ఎవరు పెట్టుకొనరు. ఆ పేరును 'సీటన్' అని ఉచ్చరించాలి. ఆంగ్లంలో ఉన్నపేర్ల ఉచ్చారణ విషయంలో చాలా జాగ్రత్త తీసికోవాలి— తప్పుః

ఉద్ధారణ చెయ్యడానికి అవకాశం ఉండబట్టి. కాని అనువాదకులు అట్టి జాగ్రత్త తీసికొన్నట్టులేదు.

మొత్తానికి అనువాదం చదివినమీదట మూలం చదివిన దానిలో కొంతభాగమైన మానసిక తృప్తి కలుగడం లేదు. షేక్స్పియర్ నాటకాలను అనువాదంచేసి తృప్తి కలిగించడం సామాన్యంకాదు. కావ్యాన్ని సరిగా జీర్ణంచేసుకుని సారం చెడకుండ తెలుగులో వ్రాయాలంటే యెంతో ప్రతిభ కావాలి. లేకుంటే అనువాదం నిస్సారం అవుతుంది. ఏదో ఉజ్జాయింపుగా కథ తెలుసుకొనడానికే, స్థూలంగా నాటకం యొక్క ధోరణి తెలుసుకొనడానికి చాలుననుకోండి. ఆంగ్లం తెలియనివారు అనువాదం చదువుతే 'ఓహో, షేక్స్పియర్ మహాకవియే' అనిపించేలాగు ఉంటే అనువాదం మంచిదన్న మాట. అంతేకాని, 'ఓస్, ఇంతేనా, ఇంకా యేమిటో అనుకున్నాను' అనిపిస్తే అనువాదం నెగ్గలేదన్నమాట. నా మట్టుకు నేను ఆంగ్లమూలం చదివివుండకపోతే అనువాదం చదివి 'ఓస్ ఇంతేనా' అని వుందును.

—ప్రొఫెసర్.

# సిద్ధాన్త శిఖామణి

రచన : ఈశ్వర సత్యనారాయణశర్మగారు. వెల : రు. 3 —. ప్రకాశకులు : సాధనా గ్రంథ మండలి. తెనాలి.

సిద్ధాంత శిఖామణి యనే యీ గ్రంథంపేరు విన్నంత మాత్రాన్నే సామాన్యుల కందరి విషయం ఏమిటో సులభంగా స్ఫురించే అవకాశం తక్కువే ఐనను దానిని సమీక్షించ గలిగితే మట్టుకు—తెలిసే దది యేదో పట్టి యాషామోషీ యేమో గాదు.

ఈ బ్రహ్మాండభాండమంటే యేమిటి ? ఇలాంటి దిది ఒక్కటేనా ? ఇంకా ఉన్నాయా ? ఇందుకు మూలకారణం ఎవ్వడు ? ఇలాంటి ప్రజ్ఞానంలాంటిది కరతలామలకం అవుతుంది. ఈనాడు తెలుగులో పాఠకలోకాన్ని ఆనందింపజేసే గ్రంథా లనేకంగా ప్రచారంలోకి రాగుంగుతున్నాయి. కాని "అవన్నీ ఒక యెత్తూ అగస్త్యులవారి కమండలం ఒక యెత్తూ" అన్నట్లుగా రేవణారాధ్య శిష్యాగస్త్యులవారి సిద్ధాంత గ్రంథం యిది ఒక యెత్తూ—తతిమ్మా మత వేదాంత సిద్ధాంతాలన్నీ ఒక యెత్తూ అని చెప్పుకోవాలి. పాఠకలోకానికి ఆయా అనేక రకాల గ్రంథాలు గలిగించే యానందం క్షణికం—తాత్కాలికానందం, యీ గ్రంథం ప్రసాదించేదో శాశ్వతానందం. ఇంకా విశేష మేమిటంటే దీని పరిశీలించే చక్షుష్మంతులయిన పండితుల కిది మహ దహంకారహారి, వేదాంతవిధుల దృష్టిలో బ్రహ్మసత్యం—జగన్మిథ్య ఇట్టి వాక్యద్వయార్థ ద్వంద్వ మున్నది. ఈ యర్థము అంధకార బంధుర మది మాయా వాదమని ప్రతిపాదించుచు ఈ గ్రంథము బ్రహ్మ పరిణామమే యైన యీ జగత్తు మిథ్య కాదు—సత్యమే యని నిరూపించు నొక వెలుగుదివ్వె యనిపించుచున్నది. ఇదియే యీ గ్రంథ ప్రశస్తికి ముఖ్య కారణము. మఱియు ద్వైత+అద్వైత మహావాదధులు రెంటికిని యిది కూడలి వంటిది. ఈ గ్రంథమందలి వివిధ ప్రకరణములను ఈ యర్థమునందే యుపసంహరింపబడినవి. ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, వీర వైష్ణవము ఇట్టి ముఖ్య మతములకు నుండునట్టి వేదాంత పారిభాషిక పదముల నన్నింటిని యెదుట బెట్టుకొని పరిశీలించినచో ముఖ్యాంశమందెల్లయును పరస్పర భిన్నత లేనివని బోధపడును. ఎట్లనగా అద్వైతాది మతములలో మిక్కిలి ప్రాయికముగా జీవుడు అనే శబ్ద మున్నది. ఆత్మము అనే పదము నున్నది. ఉదాహరణకు ఈ సిద్ధాన్త శిఖామణి—జీవు డనుటకు బదులుగా పిండజ్ఞాని—యను నొక పారిభాషిక పదమును సృష్టించుకొన్నది. తప్పక నశించే శరీరము వేరు—ఎన్నటికిని నశింపని ఆత్మ వేరు. ఇట్టి జ్ఞాన మున్నట్టి జీవుడు ఈ వీరశైవ గ్రంథమందు పిండజ్ఞాని యనబడు చున్నాడు.

శరీరాత్మ వివేకేన
పిండజ్ఞానీస ఉచ్యతే
శరీర మేవ చార్వాకైః
ఆత్మేతి పరి కీర్త్యతే.

శరీరమే ఆత్మ యనునట్టివారు చార్వాకులు; బుద్ధియే ఆత్మ యని బౌద్ధు లనుకొందురు—అతి పురాతన శైవ విధాన మను దగినదిగా కుస్సాద వేద మతము = దిగంబర జైనమున్నది. ఇందు మీదుగా లాకులేశము, కాలాముఖము, పాశుపతము కొంత కాలము కొన్ని దేశములలో కొన్ని కుటుంబములందు ప్రవేశించి వర్ధిష్ణుత నెనసి నమసినవి. ఐనను ఈ పురాతన మత పీఠిక లొకరిని యింకొకరికి సుబోధకములు కావు. ఎవరు ఏ మతస్థులయి యుండిరో వారు తమ గురుపరంపరా ప్రబోధము ద్వారా ఎరిగియుండిన దదేదో తప్ప తదన్యం బెరుంగజాలరు. ఇందువల్లనే సామాన్యముగా పరస్పర మత సామరస్య మసాధ్యము—వైష్ణవ తప్త చక్రముద్రాంకణధారణ మేరీతి ప్రయోజనమునుద్దేశించిన యాచారమో ఎంతటి విద్వాంసుడయి యుండనీ తదన్య మతస్థు డెరుంగడు. ఇట్లే లింగాయత శైవుల యొక్క లింగధారణాచార ప్రశస్తిని గురించి

# గ్రంథ విమర్శనము

స్మార్తం డెరింగి యుండుటకు వెరవు తక్కువ. స్మార్తు డెరిగియుండుటే సంభవ మైనచో అట్టి దెంతో మేలన వచ్చును. ఈ గ్రంథ ప్రకటన విధము అట్టివే లోడగూర్చి నందుకు గ్రంథకర్తకు, ప్రకాశకులకు దార్శనికులు, తత్త్వ జిజ్ఞాసువులు, పండితులు— అభినందనలు తెలుపవలసి యున్నది.

ఈ గ్రంథకర్త— శ్రీ శ్రియానందనాథులు— (శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు) శైవమత భేదము లనదగినట్టి శాక్త, భైరవ, మిశ్ర, సిద్ధాన్త ప్రకటన మర్యాద లన్నిటిని క్షుణ్ణముగా నెరిగిన విబుధమణి. జన్మవశమున వీర శైవులు గారు—స్మార్తులు.

—సంస్కృతవాణిలో ఈ సిద్ధాన్త శిఖామణిని రచించి యున్న శ్రీ శివయోగి—తెనుగునందు కూడ ప్రవీణుడే. పురుషార్థ సారమును రచించి నాతఁడే! ఉభయ కవిమిత్రుడు— తిక్కన సోమయాజి కాకతి గణపతిదేవుని జూడబోయినపుడు శివయోగి నుద్దేశించి గణపతి దేవునితో—"వసుమతీనాథ! యీతఁ డీశ్వరుడు గాని—మనుజమాత్రుండు గాడు"—అని మెప్పొందియున్నాతడు.

ఈ శివయోగిని సంబోధించుచు—నింకొక కవి—

ఉ. ప్రాణున పానుగూర్చి యుల పాము
గదల్చి—తదూర్ధ్వ కీలితోద్యానము
నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి
దృష్టులం ఘోణము జేర్చి యా ప్రణవ
ఘోషమునే విని యందు మ్రానస
క్షీణముచేసి నం బసవ సిద్ధుడనా? శివదేవధీమణీ!

ఈ యర్థములోని శివయోగి సంస్కృతాంధ్రములు "ఉభయ వాణులందును ప్రవీణుఁడే. తన సంస్కృత సిద్ధాన్త శిఖామణి తెనుగు సిద్ధాంతశిఖామణినిగా గూడ ఒనర్ప గలవాడే. అందుకు సందియమేల. అయినను అట్లు జరిగినట్లుగా అగుపడదు.

ఈ గ్రంథ గర్భిత బహు విషయములు లేవి—తదాంధ్రీకరణ విధ మేమి ఇట్లు స్తవనీయమయి యుండగా—ఇయ్యధునాతనవిద్య మాన ప్రకటనమందు గ్రంథకర్త కాల నిర్ణయాది విధానములు కూడ చేర్పబడి యుండెనేని సాధనా గ్రంథమండలి వారి యీ గ్రంథ ప్రకటనము ఇతోధిక ఘనత నందియుండును. అట్లు జరుగలేదు. సరిగదా. ప్రకాశక విజ్ఞప్తిలో—

"రేణుకా గస్త్య సంవాద రూపమగు నీ సిద్ధాంత శిఖామణిని శ్రీ శివయోగి శివాచార్యులు సంస్కృతభాషయందు రచించిరి. ఈ శివయోగి శివాచార్యులు రెండువేల యేండ్లకు బూర్వుడు కాని నరుడు కాడు"—సాధన గ్రంథమండలి—వ్యవస్థాపకుడు—

దీనినిబట్టి అగస్త్యునకు శైవ సిద్ధాన్తముల నెరింగించిన రేణుకాచార్యుని తరువాత ఈ గ్రంథకర్త ఇప్పటికి 2000 ఏండ్ల క్రిందటివాడని తెలియును. ఈ యంకెలను పరిశోధన విధమున్న చారిత్రకు లొప్పరు. ఎందువల్ల ననగా— ఈ సిద్ధాంత శిఖామణియందు

ఆగమా బహుధా ప్రోక్తాః శివేన పరమాత్మనా
శైవం పాశుపతం సోమం లాకులంచేతి భేదతః.

అని శివయోగి ఈ గ్రంథకర్త ప్రతిపాదించి యుండెను. రేణుకారాధ్య—అగస్త్యులను పరస్పర సంవాదులుగా చిత్రించి యుండెను. క్రీ. శ. 1001 నాడు ద్వారకామఠకాళీ సమారాధకుడుగా నుండిన త్రిపురారి కవి—శ్యామలా దండక కర్తయై—ధారాపురాధీశుడగు భోజుని పరిపాలన మప్పుడు సమ్మానము లందెను. ఈ త్రిపురారితో పరిచయమున్న రేణుకారాధ్యుడు కవి సమయ విలాసమును రచించి భోజ సభలో విద్వద్గోష్ఠి నెరపి సమ్మానితు డయినవాడు. ఈ సిద్ధాంత శిఖామణి యొక్క ఆదిమూల నిర్మాణకర్త యీ రేణుకారాధ్యుడే— ఆ గ్రంథనామము సిద్ధాన్తాగమము. పశ్చిమ చాళుక్య విక్రమాంక దేవ చక్రవర్తి వేంగి దేశమును స్వాధీన పరచుకొనగా అతని తరఫున రాజ ప్రతినిధియైన అనంతపాలుని కాలమున శ్రీపతి పండితుడు బ్రహ్మసూత్ర భాష్యమును రచించెను. క్రీ. శ. 1120 ప్రాంతమునం దీ శ్రీపతి పండితుడు రేవణారాధ్యుని సిద్ధాన్తాగమమునుండి తన బ్రహ్మసూత్ర భాష్యమందు కొన్ని బంతులనుగ్గడించెను.

సీ. శివుడె దైవంబని శిఖి వచ్చడంబున
బంధించె శ్రీపతి పండితయ్య—

—అన్యవాద కోలాహలము.

బ్రహ్మసూత్ర భాష్యకర్తయగు నీ శ్రీపతి పండితయ్యయే శ్రీ కాశీనాథుని వారి వంశమునకు మూలపురుషుఁడు. ఈయన కంటె కొంచెము వయోధికుడు శ్రీకంఠ శివాచార్యుడు కూడ బ్రహ్మసూత్ర భాష్యమును రచించెను. ఆ భాష్యమందు రేణుకారాధ్యుని యొక్క సిద్ధాన్తాగమమునుండి ఆయా సందర్భముల నుగ్గడించెను. లాకులేశ ప్రతిపాదిత మయిన పాశుపత శైవమును నిరాకరించి యుండెను. క్రీ. శ. 1019—1023 మధ్య దిగంబర జైనము నెదుర్కొన్న కాలాముఖ శైవులగు లాకులేశాదులచే పాశుపత శైవము ప్రతిపాదింప బడినది. వీరికి

పశ్చిమ చాళుక్య జయసింహ తృతీయుడు ప్రోత్సాహకుడు. ఈ గ్రంథకర్త శివయోగి లాటదేశము (ప్రస్తుత బరోడా ప్రాంతము) నుండి వచ్చిన (ముద్దణము వఱకు—మురుళ) వంశస్థుఁడు. ఘొడియరాయ—క్రియాశక్తిరాయాది శైవ పీఠములు ఈ వంశస్థుల నిర్మాణములే. శివయోగియొక్క యీ సిద్ధాన్త గ్రంథ రచనము—రేవణారాధ్య సిద్ధాన్త రచనము యొక్క తరువాయి యనదగును. శివసంహితాకర్త అగస్త్య పండితు డీ రచనకు తోడ్పడెను.

—జగన్నాథశర్మ.

## "అశ్వఘోషుడు"

ఆరిపిరాల విశ్వంగారి అరవై పేజీల దృశ్య శ్రవ్యనాటిక. వెల : రెండురూపాయిలు. రచయిత స్వయంప్రకాశకులు. 3—4—424, శివనిలయం, నారాయణగూడా, హైదరాబాద్—29 నించి ప్రతులు పొందవచ్చు.

ప్రాచీన ప్రబంధ సాహిత్యంలో ప్రేమాయణాలు కోకొల్లలు. ప్రణయజీవుల విరహవర్ణన రసపుష్టి దాయకం. క్రమంగా ఆదిమధ్యాంత మంగళ చాదస్తంపోయి, పారశీకుల ధర్మమా అని విషాదాంతాలు వెలిశాయి. "లైలా—మజ్నూ" "బైజూ—బావరా" వగైరాలు ఇంటా బయటా రంగస్థల మెక్కి వెండితెర కెగ్రబాకాయి. అంతాభళీ అన్నారు.

బౌద్ధ సాంప్రదాయ వాతావరణంలో అశ్వఘోషుని భగ్నప్రేమ వృత్తాంతాన్ని రచయిత నాటకీయంగా చిత్రించ ప్రయత్నించారు. ప్రఖ్యాత బౌద్ధబిక్షువు, అశ్వఘోషుడు భగ్న మనోరథుడై భాగవతుడయ్యాడని యీ నాటకం దృష్ట్యా అనుకోవాలి. అతడు హర్షుని ఉదయన సదృశుడు. సర్వ నాయక లక్షణ సంపన్నుడు— కవి సార్వభౌముడు— నటక చక్రవర్తి— మేటి ఆటగాడు — గజయాతగాడు. అతని నాయిక ప్రభా లేకప్రభ. గ్రీకుకన్య. అతని పాటకు ఆడుతుంది. అతని నాటకంలో ఊర్వశి. అతని ప్రేయసి. సాకేత రాజ్యపు పల్లెల్లో వయసులోని పిల్లల పాటలన్నీ అతను వ్రాయగా ఆమె ఆడి పాడినది.వీరి ప్రణయ పానకవుపుడక తండ్రి. అతని సనాతనత్వం వీరి దేశాంతరానుబంధానికి ప్రతిబంధకమౌతుంది. అతని మతహౌత్యానికి ప్రభా బలికావడం, అశ్వఘోషుడు మధుర జీవితాన్ని పరిత్యజించి సన్యసించడం ఫలితాలు. ఇది సూక్ష్మంగా నాటకేతి వృత్తం.

ఇక నాటకీయతకు పొంగమైన విదూషకపాత్ర ఆనంద్. అతను అగస్త్యభ్రాత. అశ్వఘోషుని సోదరప్రాయుడు. శ్మవనానికి దిగితే కపాలమోక్షం సిద్ధించే సాధకుడు. అన్నగారన్నా, తలిదండ్రులన్నా అతని అపార గౌరవాభిమానాలు, హార్దింప దగ్గవి. తలిదండ్రుల సేవకే అంతా అంకితం చేసినవాడు. అయితే అతని వినోదం ప్రేక్షకులని అంతగా నవ్వించలేదు. భర్త చాదస్తానికి కుమారుని పట్టుదలకూ మధ్య నలిగిన అడకత్తెరలో వక్క సువర్ణాక్షి. ఆ వ్యథతోనే కన్ను మూస్తుంది.

నాయిక ఏటిపాలవడం విషాదాని కుపకరించినా ఆ పాత్రకు అంతగా శోభనివ్వదు. వ్రతం చెడ్డా ఫలం దక్కనట్టు, తన తనయుని బాటనుండి వైతొలగెదనని సువర్ణాక్షుని కిచ్చిన మాట మరచికూడా అతని అవేశాగ్రహానికి వెఱవెంది బలికావడం అంత నిష్కల్మషముూకాదు. ఆ పాత్రకు స్వార్థబుద్ధి వంటగట్టటం ఉచితం కాదేమో ! రంగస్థలంమీద విలాస విహారాలు, విషాద గీతికాలాపనలు తప్ప, అసలు కథంతా తెర వెనక జరగడం మరో బలహీనత. అశ్వఘోషుని కావ్యసృష్టి వగైరాలన్నీ నేపథ్యంలోనే జరిగిపోతాయి.

ఇక నాటకం ప్రదర్శిద్దామంటే ఉద్యానవనాలు, ఉపవనాలు, లతామండపాలు, విహారాలు, ఇళ్ళు, తరులు, గిరులు, నానా వనాలు ఉండాలి. సరయూతీర వాతావరణ సృష్టిఅంతా, **Game is not worth the candle** అనిపిస్తుంది. ముఖ్యంగా ప్రభాగృహంతో హేమంతం సూచించడం అసాధ్యం. అక్కడక్కడ కమ్మని కవనాలున్నవి గనుక వాటికతగ్గ సంగీతంకూర్చి శ్రవ్యనాటికగా రూపొందిస్తే రేడియో శ్రోతల కుపకరిస్తుంది. అక్కర్లేకపోతే స్టేషన్ మార్పే స్వేచ్ఛ వారొక్కరికే ఉంది. కాని ప్రేక్షకుల్ని చేర్చి సమూహంగా యీ నాటకాన్ని తిలకించమని కోరడం హింసించడమేమోనని భయం.

## ఎవరు సుఖపడుతున్నారు ?

ఇది పద్మావతీ గంగాధర్‌గారి ఆరుకథల సంపుటి.

ఎవరు సుఖపడుతున్నారు—అంటే ఎవరూ సుఖపడడం లేదని భావం—అని ఫారాల్లో తెలుగు మాష్టరు నాన్ డిటైల్డ్ చెప్తూ టూకీగా తేల్చేస్తారు. తత్వాన్వేషులు "సంసారం సాగరం దుఃఖం" అని ఏనాడో పాయించారు. ఆధునికులూ "జీవఫలం చేదువిషం" అని నిశ్చ నమిలారు. వేదాంతులు జీవితం క్షణభంగురమని బుద్బుద ప్రాయమనీ చెప్పి సుఖదుఃఖాల కతీతులు కమ్మన్నారు. సుఖాలకందరూ దాసులే. ఇక దుఃఖాన్నధిగమించడమే అందరి ధ్యేయమున్నా. కష్టకాలంలో పరులబాధల్ని తలిస్తే మనకి కొంత ఊరట కలుగుతుంది. ఇది అంత ఉన్నతం కాకపోయినా దీన్ని మనం విస్మరించలేం. సాహిత్యంలోని చేదుకథలన్నీ చదువరులకు అటువంటి తృప్తి కాస్తో కూస్తో యిస్తాయి. అయితే యీ ఆరు కథల్లో అదీ అంతమాత్రంగానే కనుపిస్తుంది. 'శిల్ప నైపుణ్యం

# గ్రంథ విమర్శనము

పదేంద్రజాలం లేకున్నా మానవ జీవితాన్ని గురించి తనంత తామగా దర్శించిన కొన్ని నిజాలున్నా'యని, 'అవి తనతోటి వాళ్లకు చెప్పాలన్న ఆరాటం' యీ ఆరుకథల్లోను కనిపిస్తాం'దని బొమ్మకంటివారి నాలుగు పేజీల రెండుమాటలు. అయితే అవి వారి నిశితదృగ్గోచరాలేమో కాని సామాన్యుల కంటపడవు. ప్రత్యేకించి సానుభూతి కేంద్రీకరించుకుంటే కాని కళ్లు చెమ్మగిల్లవు. బండరాతిని ఢీకొన్న భగ్న కెరటాల్లాగ నిస్తేజంగా నిష్క్రమిస్తాయి యీకథలు, మన మనస్సుల్లో ముద్రవేసుకోకుండా. కథల్లో ఎంత హృదయ విదారకతకై యత్నించినా రసపుష్టి జరగలేదు.

'సుగుణ' కథ భగ్నప్రేమిక త్యాగమయ జీవితం. ఈ మధ్య సినీమాల్లో నాటు నిర్మాతలు సైతం 'తేగాలు' కావాలంటున్నారని ఎవరో చమత్కరించరు. తాను ప్రేమించిన శేఖర్ భార్యను ఆదుకుని, అతని పాపను పెంచి ఆస్తి యిస్తూ పిలునామా వ్రాసి అందరి నోళ్లల్లోనూ నలిగిపోతుంది, సుగుణ. ఇదొక్కటే ఉన్నవాటిలో మెరుగు.

ఇక మిగిలిన కథలు, సుశిగాని, శశిగాని, మరో మగువ గానిచెప్పే ఆత్మకథలూ, కథలూ, అన్ని ఒకే యితి వృత్తం. మమతలు పెంచిన పేకమేడలు కూలి చెల్లా చెదరవడం. చిన్నప్పుడు బాలశిక్షలో రాము మంచిపిల్లవాడు పెందలకడనే లేచి తల దువ్వుకొని— యీ కథల్లో రాముచింపిరి జుట్టు త్రాగుబోతు, కొండొకచో నిర్లిప్తత నావరించిన రచయిత, వేదాంతి. 'ఎవరు సుఖపడుతున్నారు'లో సుశి, తనకు తానై రాముకి ఆశ్రయాన్ని అనురాగాన్ని యిస్తుంది. అతని పెడదారి బ్రతుకుని అష్టకష్టాలుపడి సహిస్తుంది. తీరంజేరే సమయంలో పూర్వపు పతనం పీడ కలగా ప్రత్యక్షమౌతుంది. ఆ వ్యథతోనే క్షమించమనే రాముకన్నీళ్లు తుడుస్తుంది. తన తప్పుకు లోలోన కుములుతు భర్తకు క్షమాభిక్ష పెట్టడం ఆమెకొక అగ్ని పరీక్ష.

'ఆదర్శాలు— అవాంతరాలు'లో కొంత కొత్తపోకడలు కనిపిస్తుంది. ఈ 'రామూ' ధ్యేయం భార్యేఉన్నతి. అనంతరం ఆమెకొక నూతన వరునన్వేషించడం అతని అభివృద్ధి భావ చిహ్నం. అది హృదయ వైశాల్యమో, కాఠిన్యమో వివాదంశం: 'పారూ' పై 'రామూ' కత్యంతానురాగం. కాని అతని దృష్టిలో ఆమె ప్రత్యనురాగం అభివృద్ధి నిరోధక బలహీనత. ఈడూ జోడూ పరిపడ్డ చంద్రం ఇతరత్రా కుదురుకోవడంతో కథ సరియైన దోవనపడి సుఖాంత మౌతుంది.

పావలా కొకటిచొప్పున కిట్టే యీకథలన్నీ కాస్త కూస్త విషాద గుళికలు, విలాసాన్నియవవి, వినోదాన్నాశించవద్దనీ శీర్షిక చెప్పకనే చెప్తుంది. వేరే ప్రత్యేకం హెచ్చరించ నవసరంలేదు. అయితే యీ కథలు ఏవీ యివ్వక పోవడం గమనార్హం. దాపూయిషాని ప్రతికథ పదహారేసి పేజీలున్నా ఏ కథలోనూ ఏవీ సాధించబడలేదు. విలాస రచనలు కింది స్థాయివని యీ మధ్య అంతా కీనుస్తున్నారు. ఆ స్థాయి పెంచాలంటే కేవలం 'విలాసాన్ని' వినోదాన్ని వదిలేస్తే చాలదు. ఈ కథల్లో అంతకుమించి ఏవీ జరగలేదు.

'బాపూ'గారి స్వివర్ణ ముఖచిత్రమే పుస్తకానికి ఆకర్షణ. చిగురాకులతో చిలకమ్మ కులకడంలేదు. కుములుతోంది. ఈ చిత్రం డిటెక్టివ్ సాహిత్యాన్ని స్ఫురిస్తుందంటే కువిమర్శ కాదని ఆశిస్తాం.

ఈ పుస్తకం కొనుక్కో దల్చుకుంటే 'పద్మా ప్రచురణలు' కంకిపాడు, కృష్ణాజిల్లా అని వ్రాయాలి.

—"సనిధ."

## గీతాంజలిః

(సంస్కృతానువాదకులు : శ్రీ పుల్లెల శ్రీరామచంద్రః ప్రాప్తిస్థానము : శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు, సంస్కృతోపన్యాసకులు, ఆర్ట్సు అండ్ సయిన్సుకాలేజి, వరంగల్లు. డెమ్మీ 1/8 పేజీలు 12+66. వెల: సాదా 3 రూ., స్పెషల్ రు 4 )

శ్రీ రవీంద్ర గురుదేవుల ఆంగ్ల 'గీతాంజలి'కి ఇది సంస్కృత భాషానువాదము. 103 ఖండకావ్యములును 264 మందాక్రాంతా వృత్తములలో అనువదించినారు. ఈ గ్రంథమును శ్రీ ప్రధాని నెహ్రూ మహాశయులకు అంకిత మొనర్చిరి. పెద్దల ప్రశంసలతోపాటు, కవి 'కించిద్వక్తవ్యము'లో, ముఖ్యముగా ఛాయావాద రహస్యవాదముల ప్రధానాంశములు తెలిపిరి.

వంగభాషలో నైవేద్య, ఖేయ, గీతాంజలి అను మూడు సంపుటముల నుండియు, పత్రికలనుండియు ఆంగ్ల గీతాంజలి ఖండికలు సంగ్రహింపబడినవి. దీనికి కేవలము ఆంగ్లగీతాంజలియే మూలము. ఆంగ్లములో వచనమే యైనను, గేయమూలము గనుక ఇందు మందాక్రాంత వృత్తము గ్రహించిరి. మేఘదూత కావ్యమువల్ల విశేషప్రచారము గాంచిన ఈ వృత్తము గేయము కాకపోయినను, గేయమైనట్లే చదువుట ఆంధ్రదేశ సంప్రదాయము. అది గమనించి అనువాదకు లావృత్తము గ్రహించుటలో ఔచిత్యముతోపాటు ఆంధ్రత్వము జోడించిరి.

జగత్ప్రసిద్ధి కాంచిన ఈ కావ్య సంపుటిని, అందులో ఆంగ్లమునుండి భారతీయ భాషలోనికిని, పై పెచ్చు వృత్తరూపమునను అనువదించుట బహు కష్టసాధ్యము. అట్టి దుర్ఘట కార్యమునకు గ్రంథకర్త సాహసించి కృతకృత్యులైనందులకు ఎంత యభినందించినను చాలదు.

భారతదేశ చరిత్రమబట్టి విచారించినచో, ఈ దేశములో ఏ భాషలో ఎంత ఉత్తమ కావ్యము రచించినను, అది దాని సంస్కృతానువాదమువల్లనే చిరకాలము మనగలదనుట అనుభవసిద్ధము. అందుకు ప్రాకృతకావ్యాలకు ప్రస్తుతము పట్టినగతియే ప్రబల దృష్టాంతము. రవీంద్ర మహాకవి కావ్యాలకు సంస్కృత వాణిలో చిరతరస్థాయి కల్పించుటకు పూనుకొన్న ఈ గ్రంథకర్త ప్రయత్నము ప్రశంసార్హము. రవీంద్రులకు సంస్కృత కావ్యములంటే ఎంత గాఢాభిమాన ముండెడిదో పలువు రెరుగరు. ఈ సంస్కృతానువాదము చదివిన తర్వాత, ఆంగ్లగీతాంజలి భాష, సంస్కృతవాణికి ఎంత సన్నిహితంగా ఉన్నదా, అనిపిస్తుంది. అందులకు అనువాదకుల శ్రద్ధా ప్రతిభా తోడైనవి. ఈ అనువాదము మూలానికి బహు సన్నిహితంగా ఉండి, స్వతంత్ర రచనవలె శోభిస్తున్నది.

ఐనా ఏవో బహుస్వల్ప లోపాలు లేకపోలేదు. అవి గణించుటలోనే అనువాదము మూలానికి ఎంత సన్నిహితంగా సాగినదో కూడా విశదము కాగలదు.

ఉదా : (1) 48వ కావ్యములో ఆగకుండా అడావుడిగా పరుగెత్తుకొని పోయేవారితో పరుగెత్తలేక, మధ్యాహ్నవేళ నీడలో ఏటిఒడ్డున పచ్చికమీద విశ్రమించి నిద్రించి సాయంకాలపు సందెచీకటిలో బద్ధకంగా లేస్తూ, భగవంతుని దర్శించిన భక్తుని ఆత్మకథ ఉన్నది. ఈ కావ్యంలో తొందరలేని శాంతి ప్రాణభూతమైనది.

'సంభిన్నాండం సవితృకిరణైః పర్ణవర్ణం తమిస్రం
వ్యాప్నో దంతర్హృది మమశ నైర్వ్యస్మరం యాన లక్ష్యమ్'

అనే అనువాదములో

**'The repose of the sun - embroidered green gloom slowly spread over my heart. I forgot for what I had travelled.'**

మూలార్థమంతా అద్భుతం వచ్చింది. కాని దాని ప్రాణమైన **'The repose'** మాత్రము పోయినది. అంతే కాదు. ఆ తర్వాత శ్లోకంలో,

'బుద్ధ్వాసుప్తే హృదయనయుగం శీఘ్ర ముస్మీల్య చాగ్రే
త్వా మద్రాక్షం దరవిహసితై ర్వ్యాపయంతం స్వనిద్రామ్'

అన్నదానిలో,

**'At last, when I work from my slumber and opened my eyes, I saw thee standing by me, flooding my sleep with thy smile.'**

అన్నమూలంలో లేని 'శీఘ్రం' వచ్చి పడ్డది. కళ్ళు తెరవడంలో కూడా తొందరలేదు. ఈ 'శీఘ్రం'తో మూలములోని అందము మందగించింది.

**'On the seashore of endless worlds children meet.'**

అని 60వ కావ్యము ప్రారంభమవుతుంది. అది మనకే కాక రవీంద్రులకు గూడ అభిమాన పాత్రమైనది గనుకనే **Crescent Moon** లో కూడా చేర్చినారు. దీన్ని—

'సంసార స్యావధి జలధేర్తతీరే విశాలే
నృత్యై ర్వాద్యై రపి బహువిధైః రాగతా నైకబాలాః'

అని అనువదించిన ఎత్తుగడలోనే సొగసుపోయినది. అది సంసార జలధి కావచ్చు, ఆ ఆటకు వచ్చిన పిల్లలు సంసారులే కావచ్చు. కాని సంసార జలధి అనడంలో, పిల్లల ఆట పోయినది. మూలములో ప్రాణభూతమైన వ్యంగ్యము అనువాదంలో వాచ్యమై పోయినది. కాని ఈ కావ్యము అనువాదకులకు అందలేదంటే అది వారి లోపముకాదు. అది అనువాదానికి లొంగే కావ్యముకాదు.

**(3) 'They come and ask me, "Who is he?" I know not how to answer them. I say,'**

అనే 102 కావ్యమూలాన్ని

'పృష్టః కుత్రే ద్యవద మితితాన్'

అని ఎందు కనువదించినారో తెలియదు. వారు చూచిన మూలములో **"Where is he?"** అని ఉన్నదేమో !

ఈ అనువాదకులు చేసిన ఇటువంటి స్వల్ప లోపాలు గణింపతగినవికావు. పోతే, వారు మూలానికి మెరుగు పెట్టిన స్థలాలుకూడా లేకపోలేదు. ఆ 102 కావ్యమూలములోనే,

**'And you sit there smiling.'**

అని ఉండగా దానిని,

'మందస్మిత శుచిముఖ స్త్వంతు తత్రోపవిష్టః'

అని అనువాదములో మూలములోలేని 'శుచి' శబ్దము చేర్చి, దానికి చక్కని మెరుగు పెట్టినారు. శుచిస్మితము సంస్కృత కవుల కభిమాన పాత్రమైనది.

ప్రాకృతము ప్రియురాలి వక్త్రోద్గతమైన వాక్కువలె రమ్యమనీ, సంస్కృతము పురుషవాక్కువలె పరుషమనీ ప్రాకృతకవులు చెప్పినారు. నిజము చూచినచో సంస్కృత వాణి గంభీరమైనది. రవీంద్రుని కావ్య రమణీయకతకు ఈ సంస్కృతానువాదము ఉదాత్తత చేకూర్చినది.

సంస్కృతమందు అనాదిగా ఎక్కువ శ్రద్ధ ప్రదర్శించుచున్నది ఆంధ్రప్రదేశమే. గీతాంజలికి సంస్కృతానువాదము ప్రారంభించినది ఆంధ్రుడే యగుట మాకు సమ్మోదావహముగా నున్నది. ఈ అనువాదము సంస్కృతవాణి రుచి ఎరిగిన లోకమంతట వ్యాప్తి చెందుగాక ! రవీంద్రుని ఇతర కావ్యాల అనువాదాలకు కూడా ఈ కవి పూనుకొనుగాక !

దేవనాగరలిపిలో ముద్రణము ముచ్చటగా నున్నది. ముఖపత్రము మీద శ్రీ బలరామాచార్యులు వ్రాసిన రవీం

ద్రువి రేఖా చిత్రము గ్రంథ బాహ్యాకారానికి కూడా అందము తెచ్చినది.

## శంకర గ్రంథరత్నావళి

(ద్వితీయ సంపుటము—అనువాదకులు : శతావధానుల శ్రీ వేలూరి శివరామశాస్త్రి, ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి, క్రౌను 1/8 పేజీలు 16+325, వెల : రు 4)

ఆత్మ జ్ఞానోపదేశవిధి, మాయా వివరణము, ఉపదేశ సాహస్రి (గద్యబద్ధమగు ప్రథమభాగము), అను శ్రీ శంకర భగవత్పాద రచితము లనబడు ప్రకరణ గ్రంథములును, అనుబంధముగా శ్రీ సురేశ్వర భగవత్పాద విరచిత పంచీకరణ వార్త్తికమును కలవు. వీనిలో మొదటి దానికి అర్థము, తాత్పర్యము, విశేషములును, తక్కిన వానికి తాత్పర్యములును శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు రచించినవి కలవు. ఇవికాక చివర విలాసముద్రాలయము వారు పూర్వము ప్రచురించిన మూడు చిన్న పంచీకరణ వ్యాఖ్యలు కూడ చేర్చినారు.

ఇట్టి గ్రంథములు ఆంధ్ర జిజ్ఞాసువులకు నిజముగా ఉపయోగపడవలె నన్నయెడల, సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యమే కాక, శాస్త్రజ్ఞానము, ఆంధ్రములో రచనానుభవము కూడ నుండవలెను. వానికితోడు పాశ్చాత్య విమర్శ పద్ధతి కూడ తెలిసి యుండుట అవసరము. ఈ లక్షణము లన్నియు పుష్కలముగా గల శ్రీ శివరామశాస్త్రిగారు ఇందులోని ఆంధ్ర తాత్పర్యాదులు వ్రాసి యుండుటచే, ఇది పరిపూర్ణముగా ప్రయోజనకారి కాగలదు.

వీనిలో 'మాయా వివరణము'నకు పీఠిక వ్రాయుచు, శ్రీ శాస్త్రిగారు కొన్ని కారణములు చూపి, 'ఇది శంకర భగవత్పాద రచనమా అనా నాకు సంశయం. గ్రంథకర్త ఎవరయితే నేం గ్రంథం దొడ్డది' అన్నారు. నిస్సందేహంగా ఈ గ్రంథాలన్నీ దొడ్డవే.

మాయా వివరణంలో చాలా ముచ్చటైన శిష్ట వ్యవహారిక భాష వాడినారు. అట్టిభాష శ్రీ శాస్త్రిగారి బోంట్లకే సాధ్యపడుతుంది. తక్కిన వానిలో గ్రాంథికభాషే వాడినా, వ్యవహారిక భాషే ఏమో అన్నంత తేటగా వ్రాసినారు.

ఆత్మ జ్ఞానోపదేశ విధిలో తాత్పర్యము తర్వాత 'విశేషము' అనే శీర్షికక్రింద ఇచ్చిన విశేషాలు చాలా ఉపయోగకారులుగా ఉన్నవి. అవికొన్నిచోట్ల కలిగే సందేహాలకు వివరణలు. కొన్ని ఆయాచోట్ల అనుసంధింపదగిన ఉపనిషద్భాగాలు, బ్రహ్మ సూత్రాలు, గీతావాక్యాలు. ఏవైనా సంగ్రహంగా ముక్తసరిగా ఉన్నవి.

పంచీకరణ వార్త్తికమునకు, రెండు శతాబ్దముల క్రిందట శ్రీ పిన్నింటి మల్లు శాస్త్రులవారు రచించిన దర్పణమను సంస్కృత వ్యాఖ్య నుండి కొన్ని విశేషాలు అధస్సూచికలలో ఇచ్చి, అట్టి గ్రంథమున్న సంగతి ఆంధ్రలోకానికి తెలియ జేసినారు.

ఈ సంపుటము సర్వవిధముల ఉత్తమ స్థాయిలో నున్నది. ముముక్షువులు పఠించి దాని ప్రయోజనము పూర్తిగా పొందెదరు గాక !

— నోరి నరసింహశాస్త్రి.

## స్ఫూర్తిశ్రీ వ్యాసావళి

### (మొదటి భాగము)

రచన : శ్రీ స్ఫూర్తిశ్రీ. ప్రతులకు: టి. భాస్కరరావు, లెక్చరరు, ఏ.సి. కాలేజి, గుంటూరు. మూల్యము: రెండు రూపాయలు.

ఇందు అయిదు వ్యాసము లున్నవి. అన్నియును సాహిత్యమునకు సంబంధించినవే. సాహిత్య విమర్శన వ్యాసము లన్నచో సరిపోవును. కావలయునని సాహిత్యమును అధ్యయనము చేయువారిసంఖ్య తగ్గుచున్న కాలమిది. సాహిత్యమును పొడిచి గెలువ వలయునన్న ఆవేశపు టహంకారముతోడి యభిమానము చాలమంది యందున్నది. అందువలన నేటి కాలమున సాహిత్య విమర్శ పూర్తిగా అప మార్గమున బడిపోవుచున్నది. నిజమునకది విమర్శనమేకాదు. కాని, ఆ పేరున చలామణియగుటకు చూచుచున్నది. శ్రీ స్ఫూర్తిశ్రీగారు తగ్గుచున్నదని చెప్పబడిన సంఖ్యలో నొకరుగా ఈ వ్యాసముల వలన తెలియవచ్చుచున్నారు. ఈ కావలయునని అధ్యయనము చేయువారిలోను మరల భేదము లున్నవి. విమర్శనమును కళగా భావించువారు కొందరు. శాస్త్రముగా భావించువారు కొందరు. పరమార్థ మేమనగా సాహిత్య విమర్శ నూటికి ఎనుబది పాళ్లు శాస్త్రము. పై ఇరువదిపాళ్లు కళ. మొదటి ఎనుబది పాళ్లే విమర్శనమని చెప్పబడదగినది. శ్రీ స్ఫూర్తిశ్రీగారు చివరి ఇరువది పాళ్ళను పట్టుకొని పోవుచున్నట్లు కనిపించుచున్నది. అనగా ఆత్మాశ్రయమైన విమర్శ లక్షణము కలవారన్న మాట. ఇది సాహిత్యమును సంభావించుకొనుట వరకు మంచిదే. చెప్పబూను కొన్నచో నిలువదు. సాహిత్యములో సంగీతము అన్న వ్యాసమున్నది. పద్య రచనలో సాధింపబడు సంగీత లక్షణమును గూర్చిన వ్యాసమది. సాహిత్యమున ఛందస్సుయొక్క వినియోగమున్నది గనుక అందువలన ఒక మధురమైన 'లయ' వచ్చుచున్నది. శ్రీ స్ఫూర్తిశ్రీగారు ఆ 'లయ' లక్షణమును నిరూపించుటకు గట్టి ప్రయత్నము చేసిరి. కాని సాహిత్య విమర్శనలో పద్యములయొక్క నడక—పద్యములలోని శబ్దములయొక్క ఊపు ఇత్యాదులు ఆత్మాశ్రయములు. అనుభవములోనివి మాత్రమే.

"వినరా విభావరీ
వేలా శాలల నీ మ్రుదు
వనవాంచలముల గుస గుసలో
మసలు చరణ మంజీరము
కొసరు జాలి పలుకరింతలో—"

"ఇది విన్నప్పు డెల్ల నాడులలో ఆనందము నర్తనము సాగించును. ఒక మైమరపు, ఒక చిన్న పులకరింత కలుగుచుం డును." అని వ్రాయుట విమర్శ చేయుటకాదు. ఈ లెక్కను వ్రాసి కొనుచు బోయినచో దిక్కు లేకుండ వ్రాయవచ్చును. అట్టి అనుభూతి విమర్శకున కేకాంతమున కలిగి యుండ వచ్చును. దానికి హేతువులను చూచుకొనవలయును. అర్థ మును విచారించి తాత్పర్య నిరూపణ మొనరించి కవి ఔన్నత్య మును స్థాపింపవలయునుగాని, తాను పొందిన యనుభూతిని మాత్రమే చెప్పరాదు. అనగా అదియే విమర్శగా చెప్పరాదు. ఈ వ్యాసమువంటిదే 'నన్నపార్యుని ఛందో యోగ' మన్నది కూడ. నన్నయ్యగారు భారతమున నుపయోగించిన విశేషములైన వృత్తముల ప్రయోజనమును సమీక్షించిన వ్యాస మది. వృత్తౌచిత్యమును క్షేమేంద్రుని భావమే మొదలు సముచితమైన సిద్ధాంతముకాదు. ఫలానా వృత్తము ఫలానా విషయమును వర్ణించుట కుచితముగా నుండునని ఆయన కొన్నింటినిగూర్చి మాటాడెను. సంస్కృత కావ్యములయందును, పూర్తిగా ఆ యా వృత్తము లా యా విషయములనే వర్ణించుటలేదు. తెలుగు నను అంతే. కాకతాళీయములై, ఒకటి రెండు కనిపించవచ్చును. అందుకనియే వృత్తౌచిత్యము సిద్ధాంతముకాదు. పృథ్వీవృత్త మున్నది. కోపము—హేళన—ఎత్తిపొడుపులతోనున్న భావ మును చెప్పుట కది సముచితముగా నుండునని క్షేమేంద్రు డనెను. కాని అన్ని కావ్యముల యందును, పృథ్వీ వృత్తములో భావముల నే వర్ణించుటలేదు. నన్నయ్యగారి పృథ్వీ వృత్తములు గూడ అట్లు లేవు. ఈ వ్యాసకర్త చెప్పినట్లవి 'పంపన్నతను నిరూపించు నుదాత్తత' కలిగి యున్నవి. శ్రీస్ఫూర్తి శ్రీ గారా వ్యాసమున నన్నయగారు వాడిన మానిని—కవిరాజవిరాజితము—మణిభూషణము—స్వాగతము—పద్మకము—దండకము—వసంత తిలక—స్రగ్ధర—మహాస్రగ్ధర—ఉత్సాహ లయగ్రాహి—పృథ్వీ—మాలిని—తరువోజ—మత్తకోకిల—మధ్యాక్కర—ఈవృత్తముల ప్రయోజనమును గూర్చి ముచ్చటించిరి. ఈ ముచ్చటయంతయు నన్నయ్యగారా యా వృత్తముల నెచట ఏ యభిప్రాయమును వ్యక్తీ కరించుటకు వాడిరో, ఆ యా వృత్తములా యా అభిప్రాయము లను వ్యక్తీకరించుటకే సమర్థములై యున్నవన్న సిద్ధాంత ములుగా పరిణమించు ప్రమాదమున్నది. ఆ ప్రమాదమును తొలగించుటకే వృత్తౌచిత్యము సిద్ధాంతము కాదనినది. శ్రీస్ఫూర్తి శ్రీగారు ఉత్సాహ వృత్తమును గూర్చి "ఈ వృత్తము పేరుకు తగినట్లు ఉత్సాహమును ప్రకటించుటకు యోగ్యమైన శైలి కలిగియున్నది అని వ్రాసిరి. ద్రోణుడు చెప్పగా ద్రుప దుని పట్టుకొని రాసాగిన కౌరవ పాండవుల విషయమును వర్ణించి చెప్పుచున్నది గనుక అచట ఆ వృత్తమును గూర్చి యట్లు చెప్పుట సమంజసముగానే యున్నది. కాని కవులం దరును ఆ వృత్తము నట్లు వాడలేదు. చచ్చి యుద్ధ భూమి పడి, నక్కలచే తినబడుచున్న శల్యుని చూచి, గాంధారి ఏడ్చి నది. ఆ యేడ్పును తిక్కన్నగారు ఉత్సాహ వృత్తమున వెల యించిరి. మరి యచట ఏమి చెప్పవలయును? తిక్కన్నగారికి వృత్తౌచిత్య జ్ఞానములేదా? లేదనవలయును. కాని అనరాదు అనగా ఫలానా వృత్తము ఫలానా విషయమును వర్ణించుటకువ యోగించునన్న సిద్ధాంతము సిద్ధాంతముకాదు. విశేష వృత్త మొకచో వాడబడి నదనగా అచట ముందు వెనుకలను మించిన విచ్ఛిత్తిని కవి సంపాదింప జూచుచున్నాడని మాత్రమే గ్రహింప వలయును. ఆ వృత్త మాధారముగ ఆ విచ్ఛిత్తిని విమర్శ కుడు నిరూపింపవలయును—నన్నయ్యగారి కొన్ని మధ్యాక్కరల లోని ఛందస్సుకు సంబంధించిన వ్యత్యయములను ఆ యా పద్య పాదములు శ్రీ గిడుగు సీతాపతిగారిచేతను, డాక్టరు దివా కర్ల వేంకటావధానిగారిచేతను, కీ. శే. రామకృష్ణయ్యగారిచేతను శ్రీ సంపత్కుమారాచార్య చేతను బహు విధముల సంభావింప బడి సరి చేయబడినవి. ఒకటి, రెండింటికి శ్రీ స్ఫూర్తి శ్రీగారు చూపిన సవరణ లా మార్గమున సముచితముగా నున్నవి.

'కవులు—కవిత' అను వ్యాసమున కవులు తమ తమ గ్రంథములలోను, విడిగాను, కవిత్వమును గూర్చి యొసగిన యభిప్రాయములు సమీక్షింపబడినవి. నన్నయగారు, నన్నె చోడదేవుడు, తిక్కన్నగారు—గోపరాజు భైరవుడు—వేంకట నాథుడు—శంకరకవి—పింగళి సూరన్న మొదలైనవారి యభి ప్రాయములు సమీక్షింపబడినవి. నన్నయ్యగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తిని శ్రీ స్ఫూర్తి శ్రీ గారు సంభావించిన తీరు నిశిత పరిశీలనాత్మకమై యున్నది. గాని అక్షర రమ్యతను గూర్చి వ్రాసినది పొసగుచున్నట్లులేదు. దాని పొసగక పోవుట "ఇతరులనగా గుణ గ్రహణ పారీణులగు పండితులు" అను టలో నున్నది. మరి కవీంద్రు లనగా నెవ్వరు? వారెవరో గూడు వ్యాసకర్త నిర్వచింపనే వలయును. 'భావకులగు కవుల'నుట చాలదు. వారు "అర్థ విశేషము గౌరవింపగా విమర్శకులగు పండితులు, ప్రత్యక్షర రమ్యతను సంభావింతురని" తెల్పుట వలన విషయము విషమమైనది. విమర్శకులకు, పండితులకు లర్థ విశేష మక్కరలేదా? మరి వారిక దేనిని విమర్శించి చూడవలయును? భావకులగు కవులకు ప్రత్యక్షర రమ్యత నక్కరలేదా?— భైరవుని పద్యము నుదాహరించి తదర్థ వివ రణ మున్నట్లుగా శ్రీ స్ఫూర్తి శ్రీగారు గణముల వర్ణములు—కులములు, అధిష్ఠాన దైవములు ఇత్యాదులను పేర్కొనిరి. బీజాక్షరములను గూడ పేర్కొనిరి. ఈ యన్నింటి విషయము నను కొన్నిచోట్ల లాక్షణికులలో మతభేదము లున్నవి. వ్యాస కర్త ఏలాక్షణికుని ప్రమాణముగా గ్రహించి, ఆ యా విషయ ములు వివరించిరో చెప్పియుండవలసినది. పింగళి సూరన్నగారి పద్యములను వ్యాసకర్త సమన్వయించుచు వ్యాఖ్యానించిన తీరు విస్పష్ట మధురముగా నున్నది.

# గ్రంథ విమర్శనము

కవులు, ఇతర కవుల కవిత్వమును గూర్చి వెలువరించిన అభిప్రాయవాక్యములు సూక్తులని శ్రీస్ఫూర్తిశ్రీగారు కొన్నింటిని చేర్చి తత్తదాంతర్యములను వివరించిన వ్యాసముపేరు 'సూక్తులలో విమర్శ.' ఇందులో సంస్కృతాంధ్ర కవుల సూక్తులు రెండును గ్రుచ్చి ఎత్తబడినవి. కలగాపులగముగా గ్రుచ్చిఎత్తబడినవి. రామరాజభూషణుని 'భువికళాకన్య పుట్టించె నెవ్వాడు' ఇత్యాది పద్యమునందలి కాళిదాస భవ భూతులకు సంబంధించిన వాక్యముల యర్థమును చాల కాలముగా వినవచ్చుచున్న కథలనుబట్టి సమన్వయించి, వ్యాసకర్త చూపెను. అంతవరకు బాగుగానే యున్నది. కాళిదాస భవభూతు లేక కాలమునందున్న వారుగా నున్నట్లున్న కథలు విచారించినచో పొసగవు. ఈ వ్యాసమున నొక పొరపాటున్నది. కాకుమాని మూర్తికవి రామరాజ భూషణుడైన భట్టుమూర్తిగా అనుకొనబడిన పొరపాటది.

అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగ విభుని పదగుంఫ నంబును
కాకుమానిరాయ నీక తగుర.

ఈ పద్య మొక చాటువనియు, ఎవడో అనంతర కవి భట్టుమూర్తి కవిత్వమును ప్రశంసించుచు, చెప్పినాడనియు శ్రీ స్ఫూర్తిశ్రీగారు వ్రాసినారు. కాకుమాని మూర్తి కవిరాజ వాహన విజయము—పాంచాలీ పరిణయము—బహుళాశ్వ చరిత్రము అను ప్రబంధములను రచించిన ప్రౌఢకవి. క్రీ. శ. 1560 ప్రాంతము వందున్నవాడు. పాంచాలీ పరిణయ కృతిపతియైన శ్రీ మహా విష్ణువు కలలో కనిపించి మూర్తికవి నా పద్యముతో ప్రశంసించినట్లున్నది. అనగా మూర్తి కవి తనను గూర్చి శ్రీ మహా విష్ణువు చెప్పినట్లుగా వ్రాసికొన్న పద్యమది. క్రీ. శ. 1894 వ సంవత్సరమున ముద్రింపబడిన పాంచాలీ పరిణయము చూచుకొనవచ్చును. 'అల్లిక బిగిసొంపు' 'పాండురంగ సుకవి' పద్యంబు హరువును, కాకుమానిరాయ నీకె కలదు. ఇట్లు కొద్దిపాటి పాఠభేదములతో నీ పద్యమందు ముద్రింపబడియున్నది.

'అవధాన తత్త్వము' అను మరొక వ్యాస మిందున్నది. శ్రీ తిరుపతి వేంకట కవులతో నొక వెలుగు వెలిగిన అవధాన విద్య నేడు వెనుక బట్టినది. ఆ వెలుగు కాలముననే సంస్కృతాంధ్రములు రెండింటను అవధానవిద్య మొత్తము దేశమున వ్యాపించినది. శ్రీస్ఫూర్తిశ్రీగారి వ్యాసమున అవధానముయొక్క స్వరూప స్వభావములను విపులముగా వివరించి వ్రాసిరి. అవధాన మెరుగని వారికి ఆ విద్యా రహస్యమును కరతలామలకము గావించు వ్యాస మిది. అష్టావధాన శతావధానములతోపాటు నేత్రావధాన నాట్యావధానములను గూడ వ్యాసకర్త పేర్కొనెను. నాట్యావధానము నీ నేటి కాలమున శ్రీ ధారా రామనాథశాస్త్రి సమర్థముగా నిర్వహించుచున్నాడు. ఈ వ్యాసకర్త దీని తత్త్వమును ఇంకను విపులముగా వ్రాసియుండిన బాగుండెడిది.

మొత్త మీ సంపుటములోని వ్యాసములన్నియు, వ్యాసకర్తయొక్క నిజాయితీతో కూడిన సాహిత్యమునందలి యభినివేశ లక్షణ లక్షితములు. సాహిత్యము కావలయుననుకొన్న వారీ వ్యాసముల నధ్యయనము చేయవచ్చును. 'స్ఫూర్తిశ్రీ వ్యాసావళి' తరువాతి భాగములు త్వర త్వరగా వచ్చిన బాగుండును.

## కాశీఖండము

రచన : శ్రీ బి. యన్. శాస్త్రి. ప్రచురణ: నాగార్జున బుక్‌డిపో, నారాయణగూడ, హైదరాబాదు. వెల: రు. 1.25.

కాశీఖండముయొక్క ప్రాశస్త్యమును వివరింపబూనిన గ్రంథ మిది యని పేరునుబట్టి యే స్పష్టముగా తెలియుచున్నది. శ్రీనాథు డెంతటి చిత్రమైన మానిసియో ఆయన కృతులును నట్టివే. ఆయనగారి ఏ గ్రంథమును గూర్చి మాటాడవలయునన్నను బహు విషయము లెరిగి సమన్వయించుకొని కావ్యములను గురించి మాటాడినట్లాయన కృతులను గూర్చి మాటాడుటకు వలనుపడదు. క్రౌను సైజున 63 పుటలుగల ఈ పుస్తకములో శ్రీ శాస్త్రిగారు శ్రీనాథుని అయఃపిండమును గూర్చి వ్రాసిరి. ఈ సైజున ఆ అయఃపిండము దానంతట అది 470 పుటలకు మించియున్నది.

అనువాద వైఖరి—అలంకారములు—శాస్త్రజ్ఞత—శైలి ఇత్యాది శీర్షిక లుంచబడి, బహు పద్యము లుదాహరింపబడి, గుణనిధి కథవంటి కథలు ప్రశంసింపుచు వ్రాయబడి ఆ శ్వాసములమీద విషయము సంగ్రహింపబడి, శ్రీనాథుని దేశ కాలములకు సంబంధించిన వివరములు సంగ్రహముగా నొసగబడి, సంస్కృత కాశీఖండము, స్మృశింపబడి, మొత్తముమీద 'కాశీ ఖండము—దాని ప్రాశస్త్యము' అన్న గ్రంథముగా నైనది.

"స్కందుడు చెప్పిన పురాణము కావున నిది స్కాంద పురాణమనబడుచున్నది" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. స్కాంద పురాణములు రెండున్నవి. ఖండాత్మక మొకటి. సంహితాత్మకము మరొకటి. శ్రీనాథుడు తెనుగు చేసిన కాశీ ఖండము సంహితాత్మకమైన స్కాందములోని సనత్కుమార సంహితలోని మూడవ ఖండము. ఈ పురాణమునకు మొదటి వక్త శివుడు. ఖండాత్మక

పురాణమునకు వక్త కుమారస్వామి. మరియు శ్రీనాథుడు "ఈ కాశీఖండంబు వేదవ్యాస సూత సంవాదాత్మకంబనియునుం గొందరు చెప్పుదురు" అని వ్రాసినాడు. అసలు శ్రీ శాస్త్రిగారు స్కాంద పురాణములు రెండున్నవన్నట్లే వ్రాయలేదు. అందు కిది చెప్పవలసి వచ్చినది. అయఃపిండమను మాట శ్రీనాథుని తెలుగు కాశీ ఖండమునకు చెందునదిగా ఈ దేశమున కొందరు పెద్ద లనుకొనుట చాల కాలముగా నున్నది. శ్రీ శాస్త్రిగారా మార్గ మునసే సంస్కృత కాశీ ఖండము సులభ గ్రాహ్యమనియు, శ్రీనాథుడు దానిని మహా ప్రౌఢముగా రచించెననియు, అందు వలన అయఃపిండమనుట కిదియే తగియున్నదనియును వ్రాసిరి. పరీక్షలకు వ్రాయు వ్యాసములలో నిట్టి వ్రాతలు వ్రాయ వచ్చునేమోగాని, విమర్శ గ్రంథములని వ్రాయువానిలో వ్రాయ రాదు. పురాణ వాఙ్మయము నధ్యయనము చేయుటయే బ్రదుకు గాగల బ్రహ్మశ్రీ కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులవారు "కాశీ ఖండ మయఃపిండమ్' అన్నమాట సువ్యాప్తమగు ఒక్క కాశీ ఖండము విషయములోనే పుట్టినను, ఇంచుమించు స్కాంద పురాణమంతకు సమన్వయించునట్లున్నది......ఇది భాషా శిల్పము లోనేకాక, భావకల్పనలో కూడ అగాధమై, సూక్ష్మాతి సూక్ష్మ ములయిన ధర్మ రహస్యములను సర్వ శాస్త్ర సంప్రదాయము లను వ్యక్తీకరించి, గ్రంథ విస్తృతి చేతనేకాక, విషయ గాంభీ ర్యముచేత కూడ ఒక మహా సముద్ర మట్లున్నది" అని వ్రాసినది గమనింపదగినది.

శ్రీ శాస్త్రిగారు శ్రీనాథుని శాస్త్రజ్ఞతను నిరూపించు టకు కొన్ని పద్యములుదాహరించిరి. తదర్థమును వ్యాఖ్యానించి చూపవలయును. ఊరక ఫలానా ఫలానా శాస్త్రములు శ్రీనాథు నకు తెలియునని ఈ పద్యముల వలన తెలియుచున్నదనుట విమర్శకాదు. అదియునుగాక, విమర్శించు గ్రంథముయొక్క ప్రక్రియా వైశిష్ట్యమును విమర్శకుడు గుర్తింపవలయును. పురాణమును విమర్శించు పద్ధతికిని నాటకాదులను విమ ర్శించు పద్ధతికిని భేదమున్నది. ఇది గమనించి, విషయ మును వ్యాఖ్యానించి చూపగలుగుట నలవరచు కొన్నచో శ్రీ శాస్త్రిగారు మంచివిమర్శకులగుట కవకాశమున్నది. తగిన యుదా హరణములను గుర్తించుట, అన్ని ముఖములనుండి గ్రంథమును సమీక్షించుట మొదలు గాగల మంచి లక్షణము లున్నవి. గుణనిధి కథనుగూర్చివ్రాసినది వ్రాసినంతవరకు బాగుగానున్నది. ఈ గ్రంథమును చదువుకొన్నచో శ్రీనాథునిగూర్చి తెలియనివారికి బాగుగా తెలియగలదు. పరీక్షలకు బోవువారికి సంగ్రహముగా శ్రీనాథుని గూర్చి అనేక విషయములు తెలియజేయు గ్రంథ మిది. వారికి చాల ఉపయోగమైన గ్రంథము.

# భక్తపోత రాజీయము

గ్రంథకర్త : విద్వాన్, కావ్యతీర్థ శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. వెల : రూపాయిన్నర. ప్రచురణ : శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల, హిందూపురము.

ఇది అయిదంకముల నాటకము. పోతన్నగారి జీవిత మాధారముగా వ్రాయబడిన నాటకము. ఇంతకుమునుపు శ్రీమాన్ చలంచెర్ల రంగాచార్యులవారు 'హాలికుడు' అను పేర పోతన్నగారిని గూర్చిన యొక నాటకమును వ్రాసిరి. దానికిని దీనికిని సంబంధములేదు.

ఇందు ప్రథమాంకమున పదునైదేండ్ల ప్రాయముగల పోతన్న ఆవులను కాచికొనుచు తన తోడి గోపాలురచేత భజ నలు చేయించుట, అట్టిచో చిదానందయోగి యొకనాడు వచ్చి పోతన్నకు తారకమంత్ర ముపదేశించి పోవుట చూప బడినది. రెండవ అంకము మొదలగు 'ప్పటికి పోతన్నకు ముప్పది యైదేండ్లు వచ్చును. మల్లన యను కొడుకు, శారద యను కూతురు, భార్య—ఈవిధముగా పోతన్న గిడ్డ కాపై యుండును. కాశీ ప్రయాణ సన్నాహములతో అంకము మొదలగును. కాశీలో పోతన్నకు శ్రీరామచంద్రుడు—(సీత) దర్శనమిచ్చి శ్రీ మహాభాగవతమును తెనుగుచేసి తన కంకిత మీయగోరును. తృతీయాంకమున 'అలవైకుంఠ పురంబులో' పద్యమును శ్రీరాముడు వచ్చి పూర్తిచేసి పోవుట, వేంకటగిరి రాజైన సర్వజ్ఞసింగ భూపాలుని కడ నుండి హరిహరనాథ పండితుడను వాడొకడు వచ్చి పోతన్నను తన ప్రభువుల యాస్థానమునకు రమ్మనుట—ఇంతే. చతుర్థాంకము శ్రీనా థుడు వచ్చుట, భాగవతమును వేంకటగిరి ప్రభువుకు నంకిత మియ్యగోరుట, పోతన్న నిరాకరించుట, శ్రీనాథుడు గజేంద్ర మోక్ష కథ విని 'సిరికింజెప్పడు—' ఇత్యాది పద్యము నాక్షే పించుట, పోతన్న దానిని ప్రత్యక్ష మొనర్చి సమాధానము చెప్పుటగా ముగియును. చిదానందయోగి అధ్యక్షులుగా భాగవత కృతి సమర్పణోత్సవసభ పంచమాంకము. శ్రీనాథుడు, పిసవీర భద్రకవి, అనంతామాత్య కవి మొదలైనవారి ఉపన్యాసములతో పంచమాంకము ముగియును. అనగా నాటకమే పూర్తి యగును.

ప్రతి విషయము నాటకముగా వ్రాయబడదగియుండదు. పోతన్నగారి విషయ మట్టిది. నిజమున కాయన విషయము మనకు తెలియదు. ఆయన ఒక కవి యన్న దానికంటె మనకు తెలిసిన ఇతర విషయములు చారిత్రక సత్యములు కావు.

# గ్రంథ విమర్శనము

పుక్కిటి పురాణములు. శ్రీనాథ పోతన్నలు బావమరదులు కారు. వారలు ఏకకాలమునందున్నవారు కారు. పోతన్నగారికిని సర్వజ్ఞసింగ భూపాలునకును సంబంధములేదు. చరిత్ర పరిశోధకు లీవిధముగా చెప్పుచున్నారు. పుక్కిటి పురాణములను పట్టుకొని మహా గ్రంథములు వ్రాయబూనుట హర్షింపదగినది కాదు. ఒకవేళ పూనుకున్నచో రచయిత జాగ్రత్త కలిగి అనేక విషయములను మలచుకొని పొగలిగి యుండవలయును. కొందరు వ్యక్తుల సంవాదములను వ్రాసి అది నాటక మనుట, కొన్ని వాక్యములను వరుసజాగా క్రిందికి వ్రాసి అది గేయ మనుట, గణయతిప్రాసలు తప్పకుండ కొన్ని పద్యములు వ్రాసి అది మహాకావ్య మనుట, అడిగెడువాడు లేడుకదా యన్న దుర్మార్గము తప్ప మరొకటి కాదు.—పోతన్నగారి భజనలకు వ్యతిరేకులుగా ఈ రచయితచేత ప్రథమాంకమున కల్పింపబడిన నాయుడు, సాహేబు పాత్రములేవి ప్రయోజన సిద్ధ్యర్థమైనవో బోధపడుటలేదు. వారి సంభాషణల మూలముగా పుటలు పెరిగినవి అంతే. తృతీయాంకమున పోతన్నగారు 'అలవైకుంఠపురంబులో'—ఇత్యాది పద్యమును వ్రాయలేక పడిన యవస్థ సాగదీయబడి పేలవముగా నున్నది. పోతన్న వేషమున వచ్చిన శ్రీరాముని యొక్కయు, పోతన్న కూతురు శారద యొక్కయు సంభాషణము నీరసముగా నున్నది. చతుర్థాంకమున కొడుకు బావిలో పడినట్లు చెప్పబడిన శ్రీనాథుని పోతన్నగారు నిలువరించు ఘట్టము నిర్విశేషము. పంచమాంక మంతయు 'ఊకదంపుడు ఉపన్యాసముల' తో గ్రుచ్చి యెత్తబడి ఇది యేమి నాటకమురా యనిపించుచున్నది. పిన వీరన్నగారి ఉపన్యాస విషయము 'కవితా కళ' యట. శ్రీనాథునిది 'కవి' యట. ''భాగవత రచనా విశేషములు' అను వంశముపై అనంతామాత్యుని యుపన్యాసము. సభాధ్యక్షులైన చిదానంద యోగీంద్రులు వ్రాసి తన కీయబడిన కార్యక్రమ పట్టికను ప్రతిసారి జూచి వారందరను ఆయా విషయములపై ఉపన్యసించుట కాహ్వానించును. వారు వచ్చి మాటాడుదురు. చివరకు పోతన్నగారి వాక్యములు, చిదానందయోగి 'అంత్యోపన్యాసము', పోతన్న భారత వాక్యము.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పండితులుగా దేశమున కొంతవరకు ప్రసిద్ధులే. వారి పాండిత్య మిందు నాందీ ప్రస్తావనలందు, విష్కంభములందు మాత్రమే కనిపించుచున్నది. భాగవతములోని కొన్ని పద్యములను కూడ శ్రీ శాస్త్రిగా రిందు వాడుకొనిరి. మొత్తముమీద ఇరువది మందికి తక్కువగాక పురుషులు నలుగురు స్త్రీలు ఈ నాటకమున వచ్చెదరు. శ్రీ శాస్త్రిగారి పాండిత్యముమీద మనకెంత గౌరవమున్నను ఈ నాటకము మాత్రము నాటకముగా మాత్రము లేదని చెప్పక తప్పదు. వారి కీర్తి నీ నాటక మేమాత్రము నినుమడింప జేయజాలదు. 'పోతన' సినిమా వచ్చిపోయిన తరువాత శ్రీ శాస్త్రిగారీ నాటకము నిప్పుడు ప్రచురించుటలో ఏమాలోచించిరో తెలియదు. 1933 వ సంవత్సరమున పూర్తి చేయబడిన ఈ నాటకము 1940 వ సంవత్సరమున వాహినీ పిక్చర్సువారి చేతబడి, సినిమా తీయబడక, నేటికి బయట పడినది.

—క్షేమేంద్ర.

## వికసించని కుసుమాలు

రచన : శ్రీ పి. శేషగిరిరావు, ప్రచురణ: నాగార్జున బుక్‌డిపో, హైదరాబాదు, వెల: రూ. 2.50.

ఇది ఇద్దరు మిత్రుల విషాదగాథ. ఇద్దరూ ఒకే అమ్మాయిని ప్రేమిస్తారు. ఆ అమ్మాయి ఒకతనికి తన హృదయాన్ని అర్పిస్తుంది. కాని, వారి కులాలు వేరు కావడంవల్లా, పెద్దలు అంగీకరించకపోవడంవల్లా వారి వివాహం కాక, ఆ అమ్మాయి ఆత్మహత్యకు పాల్పడుతుంది. ఇక రెండవ మిత్రుడు భగ్న ప్రేమికుడుకదా. అతను తనంత తా వలచి వచ్చిన రాణిని (ఈమె తన శరీరాన్ని విచ్చలవిడిగా యువక స్నేహితుల కర్పించిన యువతి.) దగ్గరికి తీసి కాపురం పెడతాడు. ఆమె ప్రమాద వశాత్తు మృత్యువు పాలవుతుంది. ఈ నవల చదివితే మన యువజనం వాస్తవ సాంఘిక పరిస్థితుల్ని అర్థం చేసుకొని తమ ఆదర్శాలను ఆచరణలో సమన్వయం చేసుకోలేక ఎలా నిస్సహాయులై అసమర్థులై, అవివేకులై, అప్రయోజకులై పోతున్నారా అని పిస్తుంది. వియోగం, వేదన, ప్రతికూల పరిస్థితులు తట స్థించినప్పుడే ధీరులై నిలవాలి. ఈ విషయం ఆది కావ్యమైన రామాయణంనుంచే ఉద్ఘాటింపబడుతూ వస్తూవుంది. శ్రీరాముని కన్న గొప్ప ప్రేమికుడూ, ఏకపత్నీవ్రతుడూ లేడు. కాని మనవాళ్ళు నేడు భీరుత్వాన్నీ, బేలతనాన్నీ చూపి ఊహాలోకంలో మసిలే కొందరు పాఠకులచేత 'అయ్యో' అని జాలి ప్రకటించేటట్టు చేయడానికి ప్రయత్నిస్తున్నారని చెప్పక తప్పదు.

ఇక నవలలో పాత్రలు చూద్దామా ఏమాత్రం గట్టి వ్యక్తిత్వం లేనివిగా ఉన్నాయి. ప్రేయసి చేతుల్లో తన మొహం దాచుకొని బావురుమనే కథా నాయకుడు గోపీ! పోతే మధును గూర్చి ఒక చోట రచయిత ఉత్తమాదర్శాలు గల వాడు. ఏ స్త్రీని 'అటువంటి' దృష్టిలో చూడడు'' అని మనకు హామీ ఇస్తాడు. కాని, ఆ మధు మహాశయుడు మరికొంత సేప

టికేజ్యోతితో నిదాన మనేదే లేకుండా "పెచ్చని నీ పొందు కోసం నే నెంతగా తల్లడిల్లుతున్నానో" అని పరిదేవనం పడతాడు!! ఇక గోపీ విషయంలో బ్యూటీ క్వీన్ రాణి చూపిన చొరవను గమనిస్తే, ప్రేమ విషయంలో రాను రాను ఇంతియే ఇనిషియేటివ్ తీసుకుంటుందన్న అభిప్రాయం కలుగడమేగాక, **It is the woman that seduces all mankind** అన్న గిరీశం మహాశయుని ఉవాచను ఉదారంగా నమ్మవలసి వస్తుందేమో!

ఈ పుస్తకంలో ఒక నవలేగాక, ఒక బాధితుని స్వీయ చరిత్రను కూడా రచయిత అతగాడి ఉత్తరాల ద్వారా పాఠకుల కందించాడు. మాతృప్రేమకు దూరమై, సవతి తల్లి పోరు పడలేక, ఇష్టంలేని పెళ్ళి చేసుకొని, ఆ భార్య తిరస్కారానికి గురియై ఆత్మ విశ్వాసం కోల్పోయి, చివరకు క్షయవ్యాధి గ్రస్తుడైన ఒక అభాగ్యుడి కథ ఇది.

జీవితాన్ని నేటి కొత్త రచయితలు కమ్మని ఊహలపై పగటి కలలపై ఆధారపడి ఉండే ఆదర్శాలతో తిలకిస్తున్నారు. ప్రేమ వచ్చేసరికి లైలా మజ్నూల ధోరణి ప్రత్యక్షమవుతూ వుంది. ప్రేమ, స్నేహం, శారీరక వాంఛలు, హృదయం, సుఖం, డబ్బు, మున్నగువాటి విషయంలో వీరు పెట్టుకొనే ఆశలు అవాస్తవికంగా ఉంటున్నవి. కాబట్టే మన కథా సాహిత్యం చాలావరకు ఈ స్థితిలో వుంది.

ఏమైనా రచయితకు కొంత కలం బలం వుంది. అదే అక్కడక్కడా ఉదాత్తతను ఆపాదించి పాఠకులచేత చదివింపజేస్తుంది. కాని, చదివిన తర్వాత పాఠకుడు అసంతృప్తిగా నిట్టూరుస్తాడు.

## కదంబమాల

రచన : శ్రీ మోహన్‌కుమార్. ప్రేమాలయ ప్రచురణలు, రాజమండ్రి. వెల: రూపాయిన్నర.

ఈ సంపుటిలో మంచుతెర, నీటి బుడగ, వలపు తెమ్మెర, విచలిత మున్నగు కథలున్నాయి. శీర్షికలు వ్యక్తం చేస్తున్నట్లే ఈ రచనలలో చదువుకున్న యువతులు తమకు నచ్చిన వారిని పెళ్ళాడడానికి పడే యాతనలు, భర్తలుండగానే వెనుకటి పరిచయాలతో ఆకర్షణలకు లోనై, దాదాపు పతనం చెందే స్థితి దాకా వచ్చే పడతులు, ఆచరణ సాధ్యంకాని ఊహలతో, జీవితాలతో చెలగాటా లాడటాలూ, అనుమానాలు, అపోహలు పడటాలూ, భార్య కుండవలసిన స్వాతంత్ర్యమూ చెప్పబడ్డవి. వీటన్నిటినీ మనముందుంచిన రచయిత ఒకచోట 'వ్యక్తుల అంతర్యాలముందు మంచు తెరలా నిలిచే నవీన నాగరికత' అంటూ పాత సంప్రదాయాలతోపాటు, కొత్తనూ విమర్శిస్తాడు. నేటి మన రచయితలలో కొందరికి ఏమి కావాలో ఇదమిద్ధమైన అభిప్రాయాలు లేవని చెప్పడానికి ఇది తార్కాణం. కారణమేమంటే, 'హాట్ కాఫీ తాగితే స్వీట్ మూడ్సు వచ్చే రచయితలు!' కథలు—ఫరవాలేదు, ఒకమారు చదివింపజేస్తాయి.

—డి. రా.

## ఆంధ్ర నాటకకర్తలు

రెండవ భాగము. వ్యాస సంపుటి. వెల : 1.50. ప్రచురణ : ఆదర్శ సాహిత్యమాల, హైదరాబాదు.

ఇందు ముగ్గురు మహా కవులను గురించిన మూడు వ్యాసము లున్నవి. శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిని గురించి విద్వాన్ శ్రీ దర్భా వేంకట కృష్ణమూర్తిగార్ని, శ్రీ తిరుపతి కవులను గురించి భాషాప్రవీణ శ్రీ అమరేశం రాజేశ్వర శర్మగారు, శ్రీ గురజాడ వేంకట అప్పారావు పంతులుగారిని గురించి డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు ఈ వ్యాసములు వ్రాసిరి. ఈ మువ్వురు భక్తిశ్రద్ధలతో వీనిని వ్రాసిరి.

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

## 1. అమ్మ సుప్రభాతము, 2. శివార్చన 3. చంద్రశేఖర శతకము

అను నీ మూడును పన్నాల రాధాకృష్ణశర్మగారిచే రచితములైనవి. మొదటిది సంస్కృత శ్లోకములతో నున్న దేవీ సుప్రభాత స్తోత్రము. రెండవది, సంస్కృత శ్లోకపద్య సమన్వితము—రెండింటియందలి సంస్కృతకవిత లలితమై యున్నది. మూడవది చంద్రశేఖరా అను మకుటముతో నూట యెనిమిది పద్యము లున్నవి. శైలి సామాన్యము. వెలలు తెలుపబడలేదు. ప్రతులకు పన్నాల రాధాకృష్ణ శర్మ. అధ్యాపకుడు, బ్రహ్మనాయుడుజిల్లా పరిషదున్నత పాఠశాల, కారెంపూడి.

## ఉన్నవ దంపతులు

రచయిత్రి : శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ. దేశసేవా పరాయణులైన ఉన్నవ లక్ష్మీనారాయణ లక్ష్మీబాయమ్మగార్ల చరిత్ర. ఇందు లక్ష్మీబాయమ్మగారి చరిత్రయే హెచ్చు. సులభ వచన రచన. వెల : 20 నయాపైసలు. పుటలు 59. వలయువారు : గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా.

# గ్రంథవిమర్శనము

## దుందుభి

రచయిత: గంగాపురం హనుమచ్ఛర్మ. తెలంగాణాలో మహబూబు నగరం జిల్లాలోగల 'దుందుభి' అనే నదిని గూర్చిన ఖండకావ్యము. మధ్య మధ్య గేయములతో హృద్యముగా నున్నది. అభిప్రాయములు, కావ్య పరిచయము, ఇవియే యిరవై పుటలు. మొత్తము పుటలు: 70. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి కంకితము. వెల: 1 రూపాయి. ప్రతులకు: జి. హనుమచ్ఛర్మ, గుండూరు గ్రామం. లింగమసానిపల్లి పోస్టు, కల్వకుర్తి తాలూకా, మహబూబ్‌నగరం జిల్లా.

## మదనమోహన మాళవీయ శతాబ్ది వర్ధంతి సంచిక

ప్రసిద్ధ భారతదేశ నాయకుడు పండితుడు నగు మదన మోహన మాళవ్యా శతాబ్ది సందర్భమున నెల్లూరులో మదన మోహనమాళవీయ సాహిత్యమండలివారు (30-12-1961) వెలువరించినది. ఇది సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నున్నది. ఆంధ్రాస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులవా రుత్సవాధ్యక్షులు. రాజకీయనాయకుల, ప్రముఖుల సందేశము లున్నవి. మాళ వ్యాను గూర్చి సంస్కృతములో మూడు బహుమతి వ్యాసము లున్నవి. సంస్కృత భాషాభివృద్ధికి మండలి తోడ్పడుట ప్రశంస నీయము.

## కవిబ్రహ్మ

రచయిత: రేవూరి సుబ్బారావు. కవిత్రయములో ద్వితీయుడైనను కవితారచనయం దద్వితీయుడైన తిక్కన చరిత్ర మూడాశ్వాసములలో, మూడువందల ఇరువదియైదు పద్య ములలో వర్ణితమైనది. కవితారచన ప్రాచీనకవుల ప్రతిభను జ్ఞప్తికి దెచ్చుచున్నది. నవీన కాలమున తిక్కనను గూర్చి రచింపబడిన పద్య కృతులలో దీనిని మించినదిలేదని చెప్ప వచ్చును. మన ప్రాచీన సాహిత్యం దభిరుచి కల్గునట్లు చేయగల కృతి. పుటలు: 88. పీఠికాదులు 18 పుటలు. వెల: 1.75 న. పై. ప్రతులకు: "ది నెల్లూరు పేపరు మార్టు" ట్రంకురోడ్డు, నెల్లూరు.

## శివయోగి

రచయిత: ముదిగొండ వీరభద్రయ్య. ఇది యొక వచన రచన. ప్రసిద్ధ శైవాచార్యులగు శివయోగి, ముదిగొండశంకరా రాధ్యులవారి చరిత్రం.

శ్రీ శంకరారాధ్యులవారి చరిత్ర య్యావలికే వరంగలు శైవ ధర్మప్రచారిణీ సభవారు ముద్రించియున్నారు. అది లోక మున వ్యాప్తమైనదే. అందులో వారి జీవిత విశేషములు, రచ నలు అన్ని యున్నవి. అయితే ప్రస్తుత గ్రంథ మెందులకు అని ప్రశ్న. శంకరారాధ్యుల శివయోగ తత్త్వమును ప్రతిపా దించుటకని గ్రంథకర్త యభిప్రాయమై యుండనోపును. భూమిక వ్రాసిన శరభారాధ్యులును దీనిని సమర్థించిరి. నవీన దేశకాల పరిస్థితులలో నొక మతానుయాయి విశిష్టత సాంఘిక వ్యవస్థ కెట్లు తోడ్పడునో అది నిరూపితము కావలెను గాని, ఆతని ఆధ్యాత్మిక తత్త్వచింతన కాదు. వ్యక్తిగత చైతన్యము నకు దోహదము కల్పించు రచన లావశ్యకములు—శంకరారా ధ్యులవారి శివయోగ సాధన కాక, శైవ సంఘమును వా రుత్తేజ పరచిన రీతిని వివరించినపుడే వారి విశిష్టత మన కాదర్శ మగును. యోగము, కర్మ, భక్తి గురించి చెప్పే గ్రంథాలు మనకు కోకొల్లలు—సాంఘిక సారస్వతాభి నివేశమునకేవిధము గాను నుపయోగపడని యిట్టి రచనలు నిరర్థకములు. 76 పుటలు. వెల: 1.50. ప్రతులకు: ముదిగొండ వీరభద్రయ్య. స్టేషను రోడ్డు, వరంగలు.

## తుక్కాదేవి

బి. యస్. శాస్త్రి: నవల. కృష్ణరాయలచే పరిత్యక్త యైన తుక్కాదేవి చరిత్ర—కేవలము చరిత్రాత్మకము కాకపోయినను చదువుటకు సరసముగ నున్నది. పుటలు: 80, వెల: 1.50, ప్రతులకు: నాగార్జున బుక్‌డిపో, నారా యణగూడ, హైదరాబాదు, అని వ్రాయవలెను.

## ధర్మమనగా నేమి?

డాక్టరు డి. వి. ఏ. ఆచార్య బి. ఏ. ఇది శ్రీ జయ దయాళ్ గోయంక వ్రాసిన "What is Dharma" అనే గ్రంథానికి తెనుగు అనువాదం. ప్రశ్నోత్తరరూపంగా 14 పుట లలో ఉన్నది. వెల: 0.25. ప్రతులకు, డా డి. వి. ఏ. ఆచార్య, లక్ష్మీ హాస్పిటలు, నిడుబ్రోలు, గుంటూరు జిల్లా.

## సమీర సందేశము

సోమంచి వాసుదేవరావు. ఇది సందేశ కావ్యముల శాఖ లోనిది. నలకూబరుడు రంభకు వాయువుచే సందేశము నంపుట యిందలి యితివృత్తము. పద్య రచన సరసము. పుటలు: 57. ఇందు తారకానిర్వేదము అను మఱియొక చిన్న గేయ కృతి గలదు. వెల: రు 1.50. ప్రతులకు: సోమంచి వాసుదేవ రావు, కానుకుర్తివారి వీథి, శ్రీకాకుళం (శ్రీకాకుళంజిల్లా)

## పంచవర్ష ప్రణాళికా ప్రచారిణి

శ్రీరామ్ వీరబ్రహ్మ కవి. గద్య పద్య గేయాన్వితము, కవితారీతి ప్రాచీనము. గ్రంథము పేరు విషయమును దెలుపును. ప్రకటనకర్త: కోగంటి దుర్గామల్లికార్జునరావు. పామఱ్ఱు, కృష్ణాజిల్లా. 52 పుటలు. వెల : 1 రూపాయి.

## సౌ నం ద చ రి త్ర

శ్రీ కూచి సూర్యప్రకాశ శర్మ. శుక్ల యజుర్వేదశాఖా ప్రతిపాదకుడగు యాజ్ఞవల్క్య మహర్షి చరిత్ర. అతి సులభముగాగ తెలియు అబ్బురంపు గేయ కృతిగ సౌనంద చరితమ్మును, సంతరించినాడు గ్రంథకర్త. ఇందు తొమ్మిది శీర్షికలున్నవి. పుటలు: 101. వెల: 1.50 ప్రతులకు : 'సునందా సుత సుజ్ఞాన సమితి'' రామనాథపురము (జువ్వలపాలెము) తాడేపల్లిగూడెము. ప. గో. జిల్లా.

## ధా న్య మా లి ని

శ్రీ నారు నాగనార్య రచితము. స్వతంత్ర ఖండ కావ్యము. పద్య రచన ప్రశస్తమే కాని శృంగార వర్ణన మితిమీరినది. 165 పద్యములు. పుటలు : 36. వెల: 1.00. ప్రతులకు : శ్రీ నారు నాగనార్య శ్రీ ఆత్మారామ విహారము. నాగవరము (పోస్టు)

## రూపాంతర శతకము

కోగంటి దుర్గా మల్లికార్జునరావు. తెలుగు భాషలో కొన్ని పదములకు వేఱువేఱు రూపములు లిందు కంద పద్యములలో కూర్చబడినవి. బాలకవుల కుపయుక్తము. అకారాదిగా నున్నది. పుటలు : 24. వెల : 0—6—0. ప్రతులకు : కోగంటి దుర్గామల్లికార్జునరావు. పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

## క్రైస్తవ మతా ప్రాశస్త్యము

దీని రచయిత పై గ్రంథకర్తయే. ఇందు హిందూ క్రైస్తవ మతముల సామ్య విరుద్ధాంశములు చర్చింపబడినవి. క్రైస్తవ మత వేదమగు బైబిలు నుండి యుదాహరణము లీయబడినవి. పుటలు: 84. వెల: 1 రూ. ప్రతులకు పై చిరునామాయే.

## వే దాం త భే రి

### అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాస పత్రిక

1963 జనవరినుండి ప్రారంభము. మూడు సంచికలు. ఇది కాళహస్తి యందలి శుకబ్రహ్మాశ్రమమునుండి వెలువడుచున్నది. శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు దీనికి స్థాపకులు. బ్రహ్మచారి గోపాల్ సంపాదకుడు. ఈ మూడు సంచికలును, శ్రీ శంకరాచార్య, వివేకానంద, విద్యాప్రకాశానందులను గూర్చినవి. వారి త్రివర్ణ చిత్రములతో స్ఫుటమగు సచ్చుతో నివి యాకర్షణీయమై యున్నవి. సంవత్సర చందా: 4 రూ. ప్రతికకు: శుకబ్రహ్మాశ్రమము. శ్రీ కాళహస్తి.

## సామాన్య రోగ నిరోధక కృత్యములు లేక పుణ్య పాప విమర్శనము

కర్త : శ్రీ తెన్నేటి వేంకట దీక్షితులు. ఇందు వాయువు, ఆహారము, వస్త్రములు, ఇండ్లు, బ్రహ్మచర్యము మున్నగు వానిని గూర్చి, మన మనుసరింపదగిన యాచారముల వివరణమున్నది. శైలి సులభము. పుటలు : 72. వెల: 1రూ. ప్రతులకు: తెన్నేటి వేంకటదీక్షితులు,ఇరగవరం, తణుకు తాలూకా, ప. గో. జిల్లా.

## లిఖితోపన్యాసములు (ఆంగ్లము)

1. వి. వరదాచారి—కాళిదాసుని కృతులలో గృహసూత్ర వ్రతాచరణ.

2. వి. సుబ్బారావు. కాళిదాసుని యపపాణినీయ ప్రయోగములు.

3. ఇ. ఆర్. కృష్ణశర్మ—కాళిదాసు తాను వాడిన శబ్దములకు రూపించిన వ్యుత్పత్తులు.

4. వి. ఆంజనేయశర్మ—కాళిదాసుని ఛందోవైశిష్ట్యము

5., టి. కె. గోపాలస్వామి అయ్యంగారు—కాళిదాసు ప్రకాశింపజేసిన ఉపనిషద్భావములు.

6. యన్ సుబ్రహ్మణ్యశాస్త్రి—కాళిదాసుని ప్రేమ మానసిక తత్త్వము.

7. యమ్. రామారావు—కాళిదాసుని కాలము.

8. పి. లక్ష్మీకాంతము—కాళిదాసుని కవితా ప్రతిభ.

ఇవిగాక— ఎస్. భాస్కరరావు—కాళిదాస ఛందస్సుమీద జరిపిన చర్చ.

పి. ప్రభావతి—కాళిదాస ప్రేమతత్త్వముపీద జరిపిన చర్చ—సారాంశము లున్నవి.

ఇవియున్నియు డాక్టరు ఆర్. కృష్ణశర్మ ఎమ్.ఏ.పి హెచ్.డి గారిచే సంపాదితములు.

ప్రకటన కర్తలు—వేంకటేశ్వర విశ్వవిద్యాలయము. పుటలు: 122. వెల: నాలుగు రూపాయలు.

# గ్రంథ విమర్శనము

## ప్రవాసి (గురజాడ శతజయంతి సంచిక)

బీహారు రాష్ట్రమున జెంషెడ్పూరున నున్న ఆంధ్ర విజ్ఞాన సమితి వారు నవ్యాంధ్ర కవితా వైతాళికుడు గురజాడ అప్పారావు శత వార్షికోత్సవ సందర్భమున వెలువరించిన సంపుటము. శ్రీ భాగవతుల ఉమామహేశ్వరశర్మ ప్రకాశకుడు. ఆతని వ్యాసముతోపాటు, శ్రీకొవ్విడి లక్ష్మన్న, పోమంచి యజ్ఞన్న శాస్త్రి, మొదలగువారి వ్యాసాలున్నవి. గురజాడ గేయము దేశమంటే మట్టికాదోయ్—అన్నదానికి సంస్కృతాంగ్లాను వాదములు గలవు. రాష్ట్రేతర ప్రాంతములలో ఆంధ్ర విజ్ఞాన సమితివారు ప్రవాసి మూలముగా ఆంధ్ర సంస్కృతి వికాసమునకు దోహదముచేయుట ప్రశంసనీయము.

## శ్రీరామతత్త్వ రహస్యము

గ్రంథకర్త: పాణ్యం లక్ష్మీనరసింహయ్య. ఇందు శ్రీరామ తత్త్వము సాంఖ్య శాస్త్రానుసారముగా 58 పద్యములలో వివరింపబడినది. శైలి సులభము. వెల: 0.25. ప్రతులకు: గ్రంథకర్త, ఉయ్యాలవాడ, కోయిలకుంట్ల తాలూకా. కర్నూలు జిల్లా.

## మారుతి శతకము

గ్రంథకర్త : జలగము సుబ్రహ్మణ్యమునాయుడు. పరిష్కర్త : శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులు. ఇందు 226 చంపకోత్పల మాలికా పద్యములు, మారుతి, మకుటముతో మన్నవి. ఇవి నిర్దుష్టములు. భక్తిరసభరితములు— వెల తెలియదు. ప్రతులకు: గ్రంథకర్త శ్రీలక్ష్మీనారాయణమండీ, 44 కందప్పసెట్టివీధి, మద్రాసు-1

## శ్రీ వెంకటేశ్వర నీరాజనము

గ్రంథకర్తలు : ఆశుకవిసామ్రాట్టులు కోట సోదర కవులు. ఇందు తిర్పతి వేంకటేశ్వరా అను మకుటముతో 64 చంపకోత్పల మాలికలున్నవి. ఇందలి శైలి ధారాళమైనది.

ఏక సమాస రచనమే కాక చిత్రకవిత్వము కూడ గలదు. వెల: 0.50. ప్రతులకు: కవిచంద్ర గ్రంథవ ళా 147. మింటుస్ట్రీటు, మదరాసు—1,

నార్ల—కర్త : జాస్తి వెంకటనరసయ్య. శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారి జీవితచరిత్ర. నార్ల గ్రంథసమీక్ష—వారిని గూర్చి ప్రముఖుల యభిప్రాయము లిందు గలవు. అభిప్రాయాల్లో ముఖ్యంగా ఉండదగిన శ్రీ డి. ఆంజనేయులు వి. వేంకటరావుగార్ల అభిప్రాయాలు ఇందులో లేకపోవడం ఒక లోపం. పుటలు: 56. వెల : 75 న. పై. వలయువారు : భారతీ సమితి, తెనాలి.

---

మ. శ్రుతులభ్యాసముచేసి, శాస్త్రగరిమల్ శోధించి, తత్త్వంబులన్
మతి నూహించి, శరీరమస్థిరము బ్రహ్మంబెన్న సత్యంబు గాం
చితిమంచుం సభలన్ వృథావచనముల్ చెప్పంగనేకాని, ని
ర్జిత చిత్తస్థిరసౌఖ్యముల్ దెలియరో శ్రీ కాళహస్తీశ్వరా!

మ. ఒకరిం జంపి పదస్థులై బ్రదుకఁ దా మొక్కొక్క రూహింతు రే
లోకో ? తా మెన్నఁడు చావరో ? తమకుఁ బోవో సంపదల్ ? పుత్త్రమి
త్ర కళత్రాదులతోడ నిత్యసుఖమం దంగందురో, యున్నవా
రికి లేదో మృతి యెన్నఁడుం గటగటా శ్రీ కాళహస్తీశ్వరా!

# బసవపురాణకావ్య భాషాచ్ఛందో విశేషములు

ఆర్యా !

ఆంధ్రపత్రిక శోభకృతు సంవత్సరాది సంచికలో 'బసవ పురాణ' కావ్య భాషాచ్ఛందో విశేషములు' అని శ్రీ వంతరాం రామకృష్ణారావుగారు వ్రాసిన వ్యాసములో నొకచిన్న సందేహము కలిగినది. దాని నివృత్తికై ఈ లేఖ వ్రాయుచుంటిని.

ఆ వ్యాసములో '(ఒ) భాషా విశేషములు' అను శీర్షిక క్రింద రెండవ పేరాలో నీ విధముగాఁ బేర్కొనినారు.

"ఆనా డాంధ్ర కర్ణాటముల కుండిన సన్నిహిత సంబంధమునుబట్టి నన్నెచోడుడును, సోమనాథుడును కన్నడ పదముల నెడనెడ వాడినారు. 'అహేయ మన్య దేశియం యత్త్రదేవ ప్రయుజ్యతే' అని అథర్వణుఁ డీ విషయమునే తెలిపి యున్నాడు. కొందరీ కారికలోని అన్య దేశ్య శబ్దము తురుష్కాది భాషా పరమని భ్రమింతురు. తురుష్కాది భాషా పదములును అన్య దేశములే అగుటచే ఈ అథర్వణ కారికకు లక్ష్యము లన వచ్చునుగాని, అథర్వణుఁ డుద్దేశించినది మాత్రము కర్ణాట పదములనే అని గ్రహింపవలెను."

పైన పేర్కొనిన దానిలో నథర్వణుని కారికలోని 'అన్య దేశ్యము' అనగా కర్ణాట పదములే యని సిద్ధాంతీకరించినారు. అంతియేకాక, కొందరీ కారికలోని అన్య దేశ్య శబ్దము తురుష్కాది భాషా పదమని భ్రమింతురు' అని కూడ వివరించినారు.

ఈ కారికకు నే నెరిగినంతలో నింతకు మున్నెవరు నిట్టి వ్యాఖ్యానము చేయలేదు. పూర్వపు వ్రాతల నటులనుంచి నే డాంధ్ర దేశములోనేకాక తెనుగు వైయాకరణిగా బిలవ పడుచు, శ్రీవంతరాం రామకృష్ణరావుగారి కడుగడుగునా పరమ ప్రామాణికులైన శ్రీ వజ్ఝలవారు తమ ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వములోనేమి చెప్పినారో పరికింతము. కారిక యొక్క వివరణకు ముందు శ్రీ వజ్ఝల వారి మతమున అన్య దేశమననేమియో చూతము.

"తమిళ, కన్నడాది భాషల సంబంధముగల దెల్గు శబ్దముల నన్య దేశములనరాదు. ద్రావిడ భాషలలోని శబ్దములకు బెక్కింటికి రూపమునందును నర్థమునందును బరస్పర సంబంధముండుట సహజము. అంతమాత్రమున నది యన్య దేశ్యమని తలంపరాదు. ఉదా: మూన్రు (తమి) మూరు (కన్న) మూడు (ఆంధ్రదేశ్యము) ఇట్లే పరస్పర సంబంధముగల శబ్దములు పరశ్శతములు గలవు. మూరు శబ్దము తెల్గునవాడఁ బడు నప్పుడు దాని నన్య దేశ్యమనఁ జనును ఉదా: మూరు రాయర గండడు. ఇది కర్ణాట రాజుల బిరుదము."

పుట 162. సంజ్ఞ 61-విష:

ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము మొదటి సంపుటము పైన శ్రీ వజ్ఝలవారు 'తమిళ కన్నడాది భాషల సంబంధముగల దెల్గు శబ్దముల నన్య దేశ్యములన రాదు' అని చెప్పుటచే గన్నడ పదము లన్య దేశ్యములు కావని (వజ్ఝలవారి మతమున) స్పష్టీకరించినారు కదా !

(పై పేరాలో నీయన్య దేశ్య విషయమై వారి వ్రాతలు పరస్పర విరుద్ధముగా నున్నవి. 'తమిళ కన్నడాది భాషల సంబంధముగల, దెల్గు శబ్దము లన్య దేశ్యము లనరాదు'' అని చెప్పి యుదాహరణలో మూన్రు (తమి) మూడు (ఆంధ్రదేశ్యము) యని ఇచ్చినారు. 'మూరు శబ్దము తెల్గునవాడబడునప్పుడు దాని నన్య దేశ్యమనఁ జనును. ఉదా:-మూరురాయర గండడు. ఇది కర్ణాట రాజుల బిరుదమనినారు. మూరు శబ్దము తమిళ, కన్నడ భాషలసంబంధియగు శబ్దముకదా! మరి శ్రీ వజ్ఝలవారు మూరు రాయరగండడు' అన్న దానిలోని 'మూరు' అన్యదేశ్యమన జనును' అనినారు. అది ఏలాగు సంభవమో!

అన్య దేశ్యమన శ్రీ వజ్ఝలవారి యాశయ మేమో చూచితమి. ఇంక నీ యథర్వణ కారికకు వా రిచ్చిన వివరణ చూతము.

నన్నయా 61—111 వివ. అహేయ మన్య దేశియం!
యత్త్ర దేవ ప్రయుజ్యతే.

(వికృ. సంజ్ఞా 13 కారి. ఆహో 354 పు)

కల్పతరు 61—III విష:-ఆహేయమ్=నిశ్యముకానట్టి యనగా వ్యాకరణాది విరుద్ధము కానట్టి, అన్య దేశియమ్ = అన్య

శ్య శబ్దము. 'రోజు' మున్నగునది, యత్ = ఏది గలదో, అనగా నేది యాంధ్ర దేశమున వాడుక కెక్కి యున్నదో తత్ = ఆ పదము, ప్రయుజ్యత ఏవ = ప్రయోగింపబడుచునేయున్నది. లేదా యత్ అన్య దేశీయమ్ = ఏ యన్య శబ్దము, అపేయమ్ = ఆంధ్ర పర్యాయ శబ్దా భావమున విడువ రానిదో, తత్ = ఆ పదము, 'మలకలు' మున్నగునది, ప్రయుజ్యత ఏవ = ప్రయోగింపబడుచునే యున్నది ఉదా:—హూటా హుటి, రోజు మొ.

(ఆంధ్ర వ్యాకరణ సంహిత సర్వస్వము మొదటి, సంపుటము పు. 173)

అని వివరించిరి. పిమ్మట ప్రయోగములు చూపి, "ఇట్లు తురుష్కాది భాషా శబ్దము అన్య దేశ్యము అనుట నిర్వివాదము" (పుట 174—మొదటి పేరా) అని శ్రీ వఝ్ఝలవారు ఘంటాపథము గా, నిర్వివాదముగా నీ కారిక యందలి అన్య దేశ్య శబ్దమునకు దురుష్కాది భాషా శబ్దములే యన్య దేశ్యములని వివరించినారు.

కాని శ్రీ రామ కృష్ణారావుగారు మాత్రము "కొందరీ కారికలోని అన్య దేశ్య శబ్దము తురుష్క భాషా పరమని భ్రమించెదరు" అని వ్రాసినారు. పైని జెప్పిన దానినిబట్టి భ్రమించిన వారెవరో మనకు స్పష్టమగుచున్నదికదా! సాక్షాచ్ఛిష్యులు (వినికిడి) అనుయాయులైన శ్రీ వంతరాం రామకృష్ణరావుగారు తమ గురువుగారైన శ్రీ వఝ్ఝల వారిని గురించి యటుల వ్రాయుటెందులకో, శ్రీ వంతరాం వారు చేసిన యా కారికయందలి 'అన్య దేశ్యమనఁగా గర్ణాట శబ్దమే యధర్వణుని యుద్దేశ్యమనెడి' సిద్ధాంతమును సప్రమాణముగా వివరించి నాసందియము దీర్ప గోరెదను.

'త్రినేత్ర' (విజయనగరం).

## బ్రౌను స్వీయ చరిత్ర

ఆర్యా!

భారతీయ భాషలకు పాశ్చాత్యులు చేసిన మహోపకారము ఇంతయని వర్ణింప వీలుకానిది. అలహాబాదు హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తిగా వచ్చిన సర్ విలియం జోన్సు అను మహనీయుడు 28 భాషలలో పండితుడయ్యాడు. అష్టకష్టములకులోనై, సంస్కృతభాష నభ్యసించి దాని మాధుర్యము పాశ్చాత్యులకు చాటి చెప్పిన మనీషి.

ఆయన వలెనే అనేకమంది పాశ్చాత్యులు ఉద్యోగరీత్యా ఈ దేశమున నివసించుచు తమ ప్రాంతములోని భాషలకు సేవ సేసి ఎనలేనివన్నె గాంచినారు. అట్టివారిలో 'ఛార్లెస్ ఫిలిప్స్ బ్రౌను' అను మహనీయుడు మన ఆంధ్రులకు ముఖ్యుడు. ఈయన తెనుగు భాషను సాహిత్యమును ఒక కట్టుదిట్టమైన మార్గమున నడపినవాడు. ఈ మహా పురుషుడు తన స్వీయ చరిత్రను ఆంగ్లమున నెప్పుడో వ్రాసికొన్నాడు. దానిని 'భారతి'లో గత మే సంచికలో ప్రప్రథమున తెనుగున ప్రచురించి, మీరు అస్మదాదులకు చాల ఉపకారము చేసినారు.

ప్రాతఃస్మరణీయుడైన ధన్యజీవి శ్రీ బ్రౌను పండితునకివే నా జోహారులు!

కె. టి. ఎల్. నరసింహాచార్యులు,
(మునునూరు)

ఆర్యా!

మీ 'భారతి' మే నెల సంచిక చూచితిని. తెనుగు సాహిత్యానికి అమూల్యమైన సేవ యొనరించిన బ్రౌనుగారి స్వీయ చరిత్రాను వాదము ప్రకటించుట మిగుల ముదావహము. అంతేగాక "బ్రౌను ప్రశస్తి" యని శ్రీ భట్రాజు రామన్నగారి పద్యములను ప్రకటించితిరి.

కాని, "బ్రౌను ప్రశస్తి" యందలి దండకమున కించిద్గణ భంగము కలదు. దండకాంతమున "సీ. పీ. బ్రవున్ రాజరాజా.!" యని యున్నది. (పు. 42) అందు "సీ. పీ" అనునది "పీ. పీ"గా పడుట ముద్రణా స్ఖాలిత్యము. కాని, "రాజరాజా"! అనుటలో "రాజా!" అనునది "గగ" గణము అగును. దండకమునకు ఏక గురువంత మందుండ వలయునని యందురు. (చూ. సులక్షణసారము.) కాన, దీనిని "సీ. పీ. బ్రవున్ రాజ చూడామణీ!" యని సరిదిద్ద వలయును.

అందే 43వ పుటలో కడపటి పద్యము కడపటి చరణమున "వేగరుణింపుము బ్రౌనుపాగ్రణీ!" — అని పడినది. ఇట గణభంగము కాకపోయినను "బ్రౌన్నృపాగ్రణీ!—" అని నకారము ద్విత్వముగా యుండవలయును. ఇది ముద్రణా స్ఖాలిత్యము మాత్రమే అని యెంతును.

(గిద్దలూరు) ఎన్. రామకృష్ణయ్య.

## రాష్ట్ర సంగీత నాటక అకాడమీ

ఆర్యా,

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సభ్యత్వమునకు రాజీనామా ఏల ఇచ్చిరని పలువురు మిత్రులు అడుగుటచే నా రాజీనామా కారణములను మనవి చేసుకొనుచున్నాను (1) పాలకవర్గమువారు పాక్షిక దృష్టితో సంచరించుట, (2) జనరల్ బాడీ మీటింగులలో ఏ విషయము చర్చించదలచినను తగిన సమయ మివ్వక, చెప్పినను, వానిని సరిగా వినిపించుకొనక మినుట్సు పుస్తకములో వానికి కొత్త రూప మిచ్చి, సభ్యులకు తెలియజేయుట, (3) వేసిన ప్రశ్నలకు సూటిగా సరియైన సమాధానము చెప్పకపోవుట, (4) అసలు పని చేయని సంస్థలకు గ్రాంట్సు, ఎఫిలియేషనులు ఇచ్చుట, వారి కిష్టమైన

రెండూ ఒక్కమారే ఇవ్వుట, (5) కొన్ని సంస్థలకు ప్రతి సంవత్సరము పెద్ద మొత్తములలో గ్రాంట్లు ఇచ్చెదరు. వారు చేయువని జనరల్ కౌన్సిల్ సభ్యులకు తెలియదు. అడిగి నమా పరియైన జవాబురాదు. (6) రు. 20,000 కూచి పూడి బాలలు కొరకు ఖర్చు పెట్టిరి. క్షీర సాగర మధనము అను నృత్య నాటిక తయారు చేయించి, ఇది ప్రదర్శనములు ఇవ్వు టకు ఒప్పుకొని, శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రము తరఫున కంట్రాక్టు తీసుకొనిరి. మొత్తం డబ్బు అకాడమీవారు చెల్లించిరి. కమిటీలు వేసిరి. రిపోర్టులు వచ్చినవి. నృత్య నాటిక మాత్రం తయారు కాలేదు. ప్రద ర్శనమునకు సిద్ధము కాలేదు. ఎప్పుడు ఎట్లు చేయుదురో ఎవ్వరూ చెప్పరు. (7) కొంతమంది ఆనందముకొరకు రు. 11,400 ఖర్చుపెట్టి, హిందూస్తానీ మ్యూజిక్ సెమినారు జరిపిరి. మొదట దానికొరకు ఎంచినది రు. 7,000. ఖర్చు పెట్టినది రు. 11,400. ఫలితము శూన్యము. (8) అనుకూల వ్యక్తులకు పేర్లు మార్చి ఒకే నృత్య నాటికకు గ్రాంట్లు ఇచ్చె దరు. ఒక పనికై ధనమిచ్చి, ఆ పని కాకున్న ధనము మాత్రం తిరిగి రాబట్టరు. రెండు, మూడు సంవత్సరముల కిందట ఎత్తివేసిన సంస్థకు ఎఫిలియేషను ఇచ్చెదరు. నిజముగా పని చేయు సంస్థలను గుర్తింపరు.

ఇట్టి పరిస్థితులలో నేను ఆ సంస్థలోయుండి, సంస్థకు గాని, కళలకుగాని ఎట్టి సేవ, సహాయము చేయలేనని నిశ్చ యించి, రాజీనామా ఇచ్చియున్నాను. వ్యక్తిగతముగా నా శక్తి కొలది నా సంస్థ తరపున కళాసేవ చేయగలను. ఈ విషయమం తయు ప్రభుత్వ దృష్టికి తేబడింది. మిత్రులందరూ సత్యము గ్రహించి, నాకు ఎప్పటిరీతి ఇతోధిక సహకార మిచ్చి తోడ్పడెదరని ఆశించుచున్నాను.

విజయవాడ. ఏ. జి. కృష్ణమూర్తి,

## చింతకాయల కజ్జాయము

1963 మే "భారతి" కలగూరగంప"లో "చింత కాయల కజ్జాయము" శీర్షికతో పూజ్యులు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు చింతకాయల కజ్జాయమును వివరించి, విమ ర్శించినారు. ఆ సవరణ విధానము సందర్భదూరమగుటచే పద్య సమన్వయ—దృష్టితో నా యభిప్రాయ మిట వ్రాయు చున్నాను. విజ్ఞులు పరిశీలింప గోరిక.

కజ్జాయ మనసుపాహార పదార్థము. అవసర నివేద నముకై దేవాలయములందు స్వామికి దీనిని సమర్పించుట సంప్రదాయము. నేడు ప్రసిద్ధిలో "పంచకజ్జాయము" అను నది కలదు. కొబ్బరి, ఏలకులు, అరటిపండు ముక్కలు, పంచ దార, పెసరపప్పు, సెనగపప్పు కలిపి గుచ్చెత్తి దీనిని తయారు చేయుదురు. నారింజ కజ్జాయము, మామిడి కజ్జాయములున్ను గలవు. కాని, ఆ పంచకజ్జాయమేకాని, మిగిలిన కజ్జాయములు ప్రశితములుకావు. ఆచరణమునసులేవు. అట్టిదే ఈ "చింత కాయల కజ్జాయము"న్ను అయియుండును. మన్మిత్రులు శ్రీ చి. వేంకట సుబ్బావధానులుగారు దీని సందర్భమును ముచ్చటించుచు, నీ భక్ష్యమును కోయలలో తయారు చేయుదు రనియు, చింతకాయలుగాని, చింతగింజలుకాని మెత్తగ కొట్టి దానిలో తేనె కలిపి తయారు చేయుదురనియు తెలిపినారు! గంథకర్తృకాలమున విశేష ప్రచారమున నిది—యున్న దేమో! క్రమ క్రమముగా నది ఎబ్బెట్టై పరిహృతమయిన దేమో! అంతమాత్రాన ఆ భక్ష్య విశేషము లోకములో లేదని వ్రాయుట అవిచారమూలకమనుట సాహసముకాదు.

"అసంభవము" అను నర్థమున అన్నమయ్య యుప యోగించినను, ప్రస్తుత సందర్భమునుబట్టి ఇట లోకోక్తి గాదు. పద్యమున "చింతకాయల కజ్జాయము తోయమింత చదరంబా" అని యున్నది. శ్రీ శాస్త్రిగారు ఆ "తోయము"ను వదిలినారు. శాస్త్రిగారి యభిప్రాయమే కవ్యభిప్రేతమయినచో "తోయము" గతియేమి? చింతకాయల కజ్జాయమువలె తేలికా? అని అనవలెగాని అసంభవము వలె తేలికా? అని అందుమా! శాస్త్రిగారు చూపిన ప్రమాణములలో "కడుమోవి చింత కాయ కజ్జము" అనునదియే ఇటనూ ప్రమాణము. అందు వలన అన్నమయ్య కీర్తన నిట ప్రమాణముగ జూపుట యసంగ తము.

అయుత—నియుతుల చరిత్రలోని ఘట్టమిది. ఈ అయుత నియుతులు ముని కుమారులు. కలశజుని శిష్యులు. గుర్వనురాగ పూర్ణులు. కలశజుడు ధాతృసుతల నీ ఇర్వురకు పరిణయము సేయ దలపెట్టను. అయుతుడు వ్యతిరేకియై యుగ్ర తపము సేయబోవును. తపోనుష్ఠానమునకు భీతిల్లి అఖండలుడు ముని వేషమున వచ్చి, ముక్తి ప్రాప్తిలో గార్హస్థ్య జీవిత స్థానమును గూర్చి యుపన్యసించును. ప్రస్తుత పద్యమునకు తరువాత నొక పద్యముపైనున్న "కీలార" యను సీస పద్యములో గీతములో, "హరిభుక్త మాత్మ భార్య భక్తి విడ భుక్తి గొను చున్కి, ముక్తిగాని, నిదురవంటిది తొలివంటిదియుగాదు" అని ముక్తి ప్రాప్త్యుపాయమును విశదీకరించును.

తీవ్ర వ్రతాచార శుష్కులలైయుండెడు ముండ ధారులు, కలలో వార్తలు విప్పి చెప్పెడు క్రియన్ గాథా పురా ణార్థముల్ దెలుపన్ నేర్తురుగాని, మముక్తుల్ డాయగా నేరరు సఖా! తత్పరిష్వంగముల్ చింతకాయల కజ్జాయము తోయము ఇంత చదరంబా!

తీవ్ర వ్రతములు చేసి, శరీరమును శుష్కింపచేయు సన్యాసులు, కలలోని వార్తలు విప్పి చెప్పినట్లు గాథా పురా ణార్థములు చెప్పగలరుగాని, మంచి మోక్షమును సమీపింప గలరా? ఆ ముక్తి కాంతా పరిష్వంగము చింతకాయల కజ్జాయ మంత తేలికా? అని అర్థము పద్యమున కతి సమీపము. సందర్భ సహితము. సమీపించుట సాధ్యమవియు, తేలిక గాదనియు తాత్ప ర్యము. అందువలన శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తమ ఆపో హను సమర్థించుకొనుట కిచ్చిన "శాకుంతల వాక్యములు

అన్నమయ్య కీర్తనలు, వృథా ప్రయాస కవితములని వేరుగ చెప్ప నక్కరలేదుగదా!

ఎస్. టి.పి. వి. రామానుజాచార్యులు,
(నూజివీడు)

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

ఆర్యా,

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1957 నుంచి 1963 వరకు కొనసాగించిన కృషిని సమీక్షిస్తూ, కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు పేర ఆంగ్లంలో ప్రచురితమైన 13 పేజీల నివేదికను శ్రద్ధగా చదివిన పిమ్మట నాకు తెలిసిన కొన్ని అనుమానాలను "భారతి" ద్వారా సాహితీ పరుల పరిశీలనకు పెట్టవలయుననే తలంపు కలిగింది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అనేది రాష్ట్ర ప్రభుత్వం స్థాపించిన సంస్థ కనుక, దానికి ప్రభుత్వం ఎంతగా ఆర్థిక సహాయం చేస్తున్నదీ, ఆ సహాయాన్ని అకాడమీవారు ఎలా వినియోగిస్తున్నారు అనేది తెలుసుకోవాలనే కుతూహలం కలిగి, పరిశీలించగా ఈ నివేదిక ద్వారా ఈ కింది అంశాలు తెలియవచ్చినవి:—

(1) 1957 నుంచి 1960 వరకు సాలుకు 50,000 రూపాయలు చొప్పున రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చినది. 1,50,000 రూ. 1961—62 నుంచి 1963 వరకు సాలుకు లక్ష రూపాయలు చొప్పున ఇచ్చినది 4,00,000 రూ. ఇలా గత ఏడేళ్లుగా రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటుగా ఇచ్చినది5,50,00 రూపాయలు.

(2) కేంద్ర ప్రభుత్వంలోని సాంస్కృతిక వ్యవహారాలు—పరిశోధనల శాఖవారు. గ్రంథ ప్రచురణకు సహాయంగా నాలుగు పద్దులకింద ఇచ్చినది 33,265 రూ.

ఈవిధంగా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి కేటాయించిన నికర మొత్తం 5,83,265 రూపాయలు అని ఈ నివేదిక చెబుతున్నది. ఈ మొత్తంనుంచి జరిగిన ఖర్చుల వివరాలు ఇలా ఉన్నాయి.

(1) తెలుగు రచయితలకు ఆర్థిక సహాయం అనే శీర్షిక కింద అయిదుగురు తెలుగు రచయితలకు చేసిన సహాయం రు. 4, 416.

(2) తెలుగులో ఉత్తమ గ్రంథాలకు బహుమతులు అనే శీర్షికకింద 10 రచనలకు ఇచ్చిన బహుమతులు మొత్తం రు. 16,000.

(3) ఉర్దూ సాహిత్యాభివృద్ధి అనే శీర్షికకింద 10 మంది రచయితల రచనలకు బహుమతిగా ఇచ్చినది రు.3,400 మరి ముగ్గురు ప్రసిద్ధ రచయితలకు ఇచ్చినది రు. 1500.

(4) సాంస్కృతిక కార్యక్రమాలు అనే శీర్షికకింద. టాగూరు శత వార్షికోత్సవ సంచిక ప్రచురణకు ఖర్చు రు 7,000. చిన్నయసూరి, గురజాడ, శతవార్షికోత్సవాలకు ఎంత ఖర్చు జరిగిందీ ఉదాహరించలేదు.

ఈ విధంగా ఖర్చుల ఖాతాను 35,122 రూపాయలు ఖర్చు అయినట్లు ఈ నివేదిక వెల్లడిస్తున్నది. ప్రభుత్వమిచ్చిన 5,83,265 రూ. లలోను ఇలా జరిగిన ఖర్చు 5,83,265 రూపాయలలోను ఇలా జరిగిన ఖర్చు 35,122 రూపాయలు పోను మిగిలివున్న మొత్తం 5,48,143 రూపాయలు.

ఈ మొత్తాన్నీ ఏమి చేశారనే ప్రశ్నకు 17 తెలుగు గ్రంథాలు 7 ఉర్దూ గ్రంథాలు, 7 ప్రాచీన తాళ గ్రంథ ప్రతులకు నకళ్లు తీయించినట్లు ఈ నివేదిక చెబుతున్నది. అయితే అకాడమీవారు ఆరంభం చేసిన ఇంకా పూర్తి కావలసిన ప్రచురణ కార్యక్రమాలు కూడా కొన్ని ఉన్నాయని ఈ నివేదిక చెబుతున్నది. ఇంతకు మినహా వివరాలు దీనిలోలేవు.

ఇప్పుడు మన మొక సంగతి ఆలోచించాలి. ప్రభుత్వం కాకుండా, ప్రయివేటుగా కొందరు కలిసి ఆరు లక్షల పెట్టుబడితో "అకాడమీ" వంటి సాహిత్యాభివృద్ధి సంస్థను స్థాపించి, ఆరేళ్లలో 24 గ్రంథాలు ప్రచురించి, 31 మంది రచయితలను ప్రోత్సహించి, ఏడు తాళపత్ర గ్రంథాలకు నకళ్లు తీయించామని నివేదిక ఇస్తే, ఆ సంస్థకు పెట్టుబడి పెట్టినవారు సంతృప్తి చెందుతారా? సంస్థ నిర్వహణ ఉత్తమంగా ఉందని భావిస్తారా? ఇలా ఎందుకు జరిగిందని ప్రశ్నించరా? పరిశీలించరా?

కాని, ఇది ప్రభుత్వం నెలకొల్పిన సంస్థ కనుక ఇలాంటి వానికి అవకాశాలు ఉండవేమో. అదీకాక, అసలు ఈ సంస్థ నిర్వహణ పద్ధతిలోనే ఇలాంటి వానికి అవకాశం లేని ఏర్పాట్లు జరిగాయి. ఎలాగంటే అకాడమీలో ప్రముఖులైనవారు సంపాదకులుగా, ఉపసంఘాలుగా ఏర్పడి అకాడమీ గ్రంథాల రచన, ప్రచురణ కొనసాగిస్తున్నారు. ఖర్చులు చేస్తున్నారు. కృషిలో ఆలస్యాలు, ప్రచురణలలో లోపాలు జరుగుతున్నాయి. అలాంటప్పుడు ఎలా ఖర్చు చేస్తున్నారు? ఎవరివద్ద ఎంత మొత్తాలు ఉన్నాయి? ఏ పద్ధతిని ఎవరి కెంత ముట్టచెబుతున్నారని అడిగే వారెవ్వరు. చెప్పేవారెవ్వరు. అడిగేవారు చెప్పవలసినవారు వారిలో వారే కదా! స్వయం రాజా, స్వయం మంత్రీ, ఇక తిరుగేది?

అసలు ఈ అకాడమీ అనేది గ్రంథ ప్రచురణ సంస్థా లేక సాహిత్య ప్రోత్సాహక సంస్థా? గ్రంథ ప్రచురణ సంస్థ అయితే, దీనికి ప్రభుత్వ సహాయం అనవసరం. సాహిత్య ప్రోత్సాహక సంస్థ అయితే అనుసరించవలసిన పద్ధతులు ఇప్పుడు అనుసరించే వాటికి విభిన్నమైనవిగాను, వ్యక్తిగతంగా, స్వచ్ఛందంగా జరిగే కృషికి ఆసరాగాను ఉండాలి. కనుక ఇప్పటికైనా ప్రభుత్వంవారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆరేళ్లకృషిని సమీక్షింపజేయడం అవసరమని మనవి చేసుకుంటున్నాను.

అసలు వీరి గ్రంథాలు ప్రచురణకు ఆ ప్రెస్‌కు, ఈ ప్రెస్‌కు ఇవ్వడం దేనికి? అకాడమీవారే స్వయంగా ఒక ప్రెస్ పెట్టుకుంటే తక్కువ ఖర్చు, ఎక్కువ సౌకర్యం ఉంటుందికదా!

(మద్రాసు) ఎస్. వి. శాస్త్రి.

16475

# మా వ్యాసకర్తలు



## నాగళ్ల గురుప్రసాదరావు

గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకా కావూరులో 15—12—1934 న జన్మించారు. 1956 సం. లో మద్రాసు విశ్వ విద్యాలయంలో తెలుగు ఎం. ఎ. ప్యాసయినారు. అప్పటినుంచి విజయవాడ ఆంధ్ర లయోలా కళాశాలలో ఆంధ్రాధ్యాపకుడుగా ఉంటున్నారు. సాహిత్యము, చరిత్ర, తత్వశాస్త్రము అభిమాన విషయములు.

ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతి సమ్మేళనము ద్వారానే భారతదేశము రాణించునని ఆయన గాఢవిశ్వాసము. సాహిత్యము, వర్గములకు రాజకీయములకు, రాగద్వేషములకు బలి కాకూడదని ఆయన జీవుని వేదన!



## శ్రీ దాశరథి

ఆయనపేరు కృష్ణమాచార్యులు. ఇంటిపేరు దాశరథి వారు. జన్మస్థలం వరంగల్లుజిల్లా చిన్నగూడూరు. తండ్రి శ్రీ వేంకటాచార్యులు. తల్లి శ్రీమతి వెంకటమ్మ. 1927 డిశంబరులో జన్మించిన శ్రీ దాశరథి ఖమ్మంమెట్టు హైస్కూలులో విద్యాభ్యాసం చేశారు. ఇంగ్లీషు సాహిత్యం ప్రధాన విషయంగా ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రులైనారు. ఉర్దూ, హిందీ భాషలలో కూడా ప్రవేశం పొందారు. 1944 నుంచి హైదరాబాదు ఆంధ్రమహాసభలోను, స్టేటు కాంగ్రెసు ఉద్యమాలలోను పని చేశారు. 1947 లో హైదరాబాద్ సంస్థానం భారత్‌లో విలీనం కావాలని సాగిన ఉద్యమంలో పాల్గొని (13 నెలలు వరంగల్లు, నిజామాబాదు, హైదరాబాద (చెంచల్‌గుడా) సెంట్రల్ జైళ్లలో కారాగారవాసం అనుభవించారు. ఆ సందర్భంలోనే అగ్నిధార, రుద్రవీణ అనే రచనలు చేశారు. 1951 లో తెలంగాణా రచయితల సంఘం స్థాపించి రెండు దఫాలు అధ్యక్షులుగా ఉన్నారు. ఇప్పుడీ సంస్థ ఆంధ్ర రచయితల , సంఘంగా అభివృద్ధి చెందింది. సాహిత్యశాఖలన్నింటిలోను వారికి పరిచయం ఉంది. అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, మహాబోధి, అమృతాభిషేకం, పునర్నవం (పద్యాలు) నవమంజరి (గేయాలు) గాలిబ్ గీతాలు (అనువాదం) నవమి (నాటికలు) దాశరథీ శతకం (కవిత)తో పాటు ప్రజా మన్ననల పొందిన పెక్కు విమర్శక వ్యాసాలు కూడా వ్రాశారు. ప్రస్తుతం హైదరాబాద్‌లోని ఆల్ ఇండియా రేడియోకేంద్రంలో పనిచేస్తున్నారు.

శ్రీ దాశరథికి పద్య రచన అంటే ఎక్కువ ఇష్టం శృంగార వీరరసాలు రెండూ సమానంగా ఆరాధిస్తారు. ప్రజలకు దూరమైన కల్పనా సౌధాలలో నివసించడం గిట్టదు. ప్రజోద్యమాలలో ప్రత్యక్షంగా పాల్గొనాలనే అభిలాష మెండు. అందువల్లనే ఆయన కవితలో ఆవేశంపాలు అధికం.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

16475


# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/- | రు. 150/- |
| 2 లేక 3 వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 150/- | 125/- |
| లోపలి పేజీలు | | | |
| పూర్తి పేజి | ... | 125/- | 100/- |
| అర్థ పేజి | ... | 65/- | 55/- |
| పావు పేజి | ... | 40/- | 35/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-0-0 |
| 6 మాసముల చందా | ... | రు. 6-0-0 |
| విడి ప్రతి | ... | రు. 1-0-0 |

మేనేజరు, భారతి.

మద్రాసు-1.